KRSA 102M103

# మిసిమి

మాసపత్రిక

**"All that we are is the product of what we have thought"**
*- Dammapada.*

**సంపుటి 22** **నవంబరు 2011** **సంచిక 11**



*Printed & Published by*

Bapanna Alapati
**at Kala Jyothi Process Pvt. Ltd.,**
1-1-60/5, R.T.C. 'X' Roads,
Musheerabad, Hyderabad - 500 020.
Ph. 040-27645536
E-mail : misimi_monthly@yahoo.in
e-magazine : www.kinige.com/misimi

ప్రతి : ₹20 సంవత్సరానికి : ₹240
విదేశాలకు ప్రతి : $ 2.50 సంవత్సరానికి : $ 25

*మీ చందా **మిసిమి** పేర పై చిరునామాకు పంపండి.*
మరిన్ని వివరాలకు 80 వ పుట చూడండి.

# ఈ నెల...



*ముఖచిత్రం* : ముత్తయిదువులు : చిత్రకారుడు-వైకుంఠం
*రెండవ అట్ట* : సర్వేపల్లితో ఆలపాటి (1963)
*మూడవ అట్ట* : ఇదేమి న్యాయం? : చిత్రకారుడు-దెలక్రాయిక్స్ (1828)
*నాల్గవ అట్ట* : సుఖీభవ : చిత్రకారుడు-వైకుంఠం
(*వివరాలు : 70వ పుటలో...* )

అర్ధశతాబ్దంపాటు పత్రికలను అర్ధవంతంగా నడిపి, ఎందరో రచయితలను వెలుగులోకి తెచ్చి వారికి అండగా నిలిచిన బుద్ధిజీవి ఆలపాటి రవీంద్రనాథ్. నవంబరు నాలుగు వారి జన్మదినం. చిరాయువులకు సంవత్సరాలతో పని ఏముంది? రవీంద్రనాథ్ స్మృతిగా మధురవాణితో వారి సంభాషణ, వారిని సన్నిహితంగా ఎరిగిన నరిసెట్టి ఇన్నయ్య పంపిన పరిశీలన – పత్రికా సంపాదకునిగా వారి వైదుష్యం – అందునా **మిసిమి** ప్రత్యేకత – ఇవి ఆలపాటి రవీంద్రనాథ్ పుట్టినరోజు ప్రత్యేకతలు.

చరిత్రకారులు అధికారుల కథనాలతో, పాలకుల దినచర్యలతో లేదా యుద్ధాల భీభత్స దృశ్యాల వర్ణనలతోనే పుస్తకాలు నింపారు. గ్రామ చరిత్రలు రాసిన వారు చాలా అరుదు. వీరులపాడు గ్రామచరిత్రను వెంకటపతిరాయలు పదిహేను సంవత్సరాలు శ్రమించి గ్రంథస్తం చేశారు. వీరికి ఇప్పుడు 97 సం॥ల ఆరోగ్యకరమైన వయస్సు. సాంఘిక చరిత్ర ఎక్కడ మొదలవుతుందో, సంస్కృతి, సంప్రదాయాలు ఎలా రూపుదిద్దుకుంటాయో మనం ఈ గ్రంథం ద్వారా తెలుసుకోవచ్చు.

జవహర్‌లాల్ నెహ్రూ ప్రజల నాయకుడు. ఆయనొక గొప్ప రచయిత కూడా. రచయిత యిక్కట్లు, ప్రచురణ కర్తల వ్యాపారధోరణి ఆయన వుత్తరంలో ఎత్తి చూపారు. అలాగే నిరాలా వంటి రచయితను ఆదుకున్న తీరు చెప్పుకోదగిందే. నవంబరు 14 ఆయన పుట్టినరోజు.

మహిళల అభ్యుదయం కోసం కృషిచేసిన మణిపూస కనుపర్తి వరలక్ష్మమ్మ. స్త్రీల హక్కుల పోరాటం కోసం మనం పాశ్చాత్య దేశాల పుస్తకాలు వెతుకుతాం. కాని మనచుట్టూ ఎందరో మహిళామణులు తమ విప్లవాలను నిశ్శబ్దంగానే నడిపారు.

తెలుగువారిలో చిత్రకారిణులను లెక్కించటానికి ఒక్క చేతివేళ్లుకూడా ఎక్కువే. అరుదైన చిత్రకారిణి సీతాదేవి గురించిన వ్యాసం చదవండి.

మన జీవితం రోజువారి కష్టాలతో నడుస్తూనే ఉంటుంది. కాని మనిషికి అసలు భయం, రోగం–మరణం. ఇవి తప్పించుకోలేనివి. అందుకే మరణానంతర జీవితం కోసం ఊహాగానాలు చేస్తూ ఆ భ్రమలో ఈ భయాలను మరిచిపోయే ప్రయత్నం చేస్తుంటాడు. ఈ చర్చ సంజీవ దేవ్ 'మరణశయ్య' లో చదవండి.



మన తెలుగుకు ఏమయింది? మనకు అష్టదిగ్గజాలు వుండే వారు. కన్నడ భాషలో ఇప్పుడు అష్ట జ్ఞానపీఠ పురస్కార గ్రహీతలున్నారు. ఇంత వరకు మనకున్నది ఇద్దరే. తెలుగుని ఇప్పుడున్న స్తబ్ధతలో నుంచి రక్షించలేమా? **మిసిమి** అహరహము కృషిసల్పేది ఈ దిశగానే....

– సంపాదకులు

# కమ్మతెమ్మెరలు

**ఉత్తరాలతో పలకరించే పాఠకులకు అభివందనాలు. ఎంతో ఆసక్తితో మిసిమి చదివి మీ అభిప్రాయాలను నిర్మొహమాటంగా వ్రాస్తున్నందుకు మా ఆనందాన్ని తెలుపుతూ, చేవగల్గిన ఉత్తరానికి 'వేమన ఉపదేశామృతం' పుస్తకం బహుమానంగా పంపుతున్నాము!**

---

✶ "...*మిసిమి* చదవడం ఒక నాగరికత, ఒక దర్జా, ఒక షోకు, ఒక అందం, ఒక అనుభూతి. చదవకపోవడం ఒకటే దురదృష్టం..." – **తనికెళ్ళ భరణి,** ఈ మెయిల్.

✶ "...సెప్టెబరు 2011 *మిసిమి* సంచికలో కర్షక కవి శ్రీ ఏటుకూరి వేంకట నర్సయ్యగారిని గూర్చి, వారి రచనలు, వ్యక్తిత్వం గూర్చి శ్రీ సూర్యదేవర రవికుమార్ గారి రచన చదివాను. ఏనాడో 1945-46లో నిడుబ్రోలు హైస్కూలులో నాకు వారు తెలుగు పండితులు. ఫోర్తు ఫారంలో నాకు చదువు చెప్పిన పంతులుగారు. ఇన్ని సంవత్సరాల తర్వాత వారి కవిత్వంగూర్చి చదవడటం ఎంత ఆనందంగా వుందో చెప్పలేను. ముఖ్యంగా నేను అదృష్ట వంతుణ్ణి, కారణం శ్రీ తుమ్మల సీతారామమూర్తి గారు, శ్రీ కొత్త సత్యనారాయణ చౌదరిగారు, శ్రీ చింతలపూడి శేషగిరిరావు గారి లాంటి దిగ్గజాలు మాకు తెలుగు పంతుళ్ళుగా నిడుబ్రోలులో వుండటం గర్వకారణం. వారు పెట్టిన భిక్ష మాకు అబ్బిన అక్షరం ముక్కలు. రవికుమార్‌గారికి నా కృతజ్ఞతలు..." – **హరిశ్చంద్రరాజు,** హైదరాబాదు.

✶ "...*మిసిమి* ఈ నెల ఇంకా రాలేదు. ఎంతో ఎదురు చూస్తున్నాము. పుస్తకము ఎంతగానో నచ్చింది. ఎన్నో తెలియని విషయాలను అందిస్తూ మా ఆలోచనలకు పదును పెడుతున్నారు..." – **దరిశి మృదుల,** నాగపూర్.

✶ "...సెప్టెంబరు సంచికలో ప్రచురితమైన నా వ్యాసం (వీణాభ్యుదయం)లో 26వ పేజీ రెండో కాలంలో చివర 'జాతులు' అని వుండవలసిన చోట 'జతులు' అని అచ్చయింది. 28వ పేజీ రెండో కాలంలో దేశాక్షిరాగ ఆరోహణ 'సరిగపదస' అని వుండాలి 'సరిగపదనిస' అని అచ్చయింది. నేను డాక్టర్‌ను కాను..." – **నందూరి పార్థసారథి,** హైదరాబాదు.

✶ "...మీరు పంపే *మిసిమి* ప్రతి మాసం అందుతోంది. అక్టోబరు సంచికలోని పలు శీర్షికలు నన్ను బాగా ఆకట్టుకున్నాయి. వి.ఎస్.రమాదేవి గారి *పరిణతవాణి* ప్రసంగం చదివిన తరువాత చాలా విషయాలు తెలిశాయి...*నన్ను ప్రభావితం చేసిన పుస్తకాలు* శీర్షిక కూడా స్ఫూర్తిదాయకంగా ఉంది. ఛాయాదేవిగారు ఉటంకించిన పుస్తకాలు వెతికి చదవాలనిపించేలా ఉన్నాయి. అలాగే తిరుమల నీరజగారు తన తండ్రి *తిరుమల రామచంద్ర* గారి గురించి రాసిన వ్యాసం ఎంతో ఆర్తిగా ఉంది...

...ముఖ్యంగా కాంద్రేగుల నాగేశ్వరరావు గారు పరిచయం చేసిన పూసపాటి పరమేశ్వరరాజుగారి చిత్రకళ నన్నెంతో అబ్బురపరచింది. వారు వేసిన రామాయణ దృశ్యాలు చాల గొప్పగా అనిపించాయి. *వ్యక్తి-జీవితం* శీర్షికలో ఫిడేల్ రాగాల పఠాభి గారి చివరి భాగం కూడా చదివాం. ఆయన తీసిన *సంస్కార* నాకెంతో ఇష్టం. అనువాదకులు బి.వి.రామిరెడ్డిగారితో మాట్లాడదామని ఎంత ప్రయత్నించినా మీరు ఇచ్చిన ఫోన్ పనిచేయకపోవడం కొంత నిరాశ కలిగించింది. చిలకమర్తి వారి *భార్యా?బ్రహ్మరాక్షసా?* అనే ఘట్టం చదివి వారి హాస్య చతురతకి నవ్వుకున్నాం. పంతులుగారి ప్రహసనాలన్నీ బాగా నవ్వించేవే. మూడో అట్ట, ద్రోణాదుల గోవిందరాజులుగారి చిత్రం చూడగానే మనసుని ఆకట్టుకుంది. వెంటనే ఫోటో కట్టి పెట్టుకోవాలన్నంత అందంగా అనిపించింది. *మిసిమి*లో అందించే శీర్షికపట్ల మీరు చూపిస్తున్న శ్రద్ధ మాలో ఎంతో ఆసక్తిని రేకెత్తిస్తున్నాయి..." **గొరుసు జగదీశ్వరరెడ్డి,** హైదరాబాదు.

✶ "...మోకా ప్రతాప్ వ్యాసంలో ఎన్నో విశేషాలు అందించారు...పఠాభి కథనం ఒక చక్కని అనుభూతి... మల్లెమాల వాణిలో పసలేదు. వెంకటాద్రి లాంటి ఒక కొండను పరిచయం చేయటం- అద్దంలో చూపటమే- ఏటుకూరి మరికొంతకాలం జీవించి ఉంటే ఎందరినో దాటి వెళ్లేవారు- ఆరోహణలో ప్రతినెలా ఒక ఆవిష్కరణ తెలుపుతున్నారు.- ఇవి మానవజాతి చరిత్రలో మహోత్కృష్టమైన మైలురాళ్లు. రామప్పను రక్షించేదెవ్వరు? మొత్తం పుస్తకం చదివిన తర్వాత - ఇన్ని స్పందనలు- ఆలోచనలు- ధన్యవాదాలు..." **- రంగరాయశర్మ,** నిజామాబాద్.

✶ "... **ఊర్ల పేర్లు** : అమ్ముడు బోయిన చరిత్రకారులు సృష్టించిన ఆర్య ద్రావిడ సంఘర్షణ మన సంస్కృతి అతకరాని చీలిక తెచ్చింది. అక్టోబరు ***మిసిమి***లో తమిళనాట ఊరిపేర్లగురించి వ్రాసిన వ్యాసములో ఇది స్పష్టము. కొట్టొచ్చినట్టు కాదు కాటేస్తున్నట్టు కనిపిస్తుంది. అంతే కాదు ఒక పక్క ఆర్య ద్రావిడ కయ్యాలుటంకిస్తూనే ద్రావిడ ప్రాంతాలకు ఆర్య భాష (సంస్కృత) పేర్లు మూలమనడం విచిత్రం. అన్నింటి గురించి మాట్లాడను. తిరుచ్చిరాపల్లికి వ్యాస కర్త త్రిశిర మూలమని, ఆ త్రిశిరునికి ఆర్య భావమైన ఇంద్రుడికి లంకె పెట్టారు. తిరు అన్న ద్రవిడ పదము త్రి (మూడు) నుంచి పుట్టిందనటం అన్యాయమ్. ఇంకొంచముంటే, తిరుపతి అంటే అక్కడి ఆడవారికి ముగ్గరు (త్రి) పతులుంటారంటారేమో. తిరు అనగా మంగళ ప్రదమైనదని శ్రీ కి సంకేతమని అందరికి తెలుసు. కొంచెం తమిళముతో పరిచయముంటే, శిరుప్పు (చిరుప్పు) అనగా నవ్వు, సంతోషము, ఆనందము. తిరు చీరిప్పు పల్లి అంటే సిరి నవ్విన పల్లి. పల్లి సామాన్యంగా జాలరి పేట. సేద్యానికి ముందు నీటి వనరులున్న చోట మనుషులు మత్స్యాహారులనుకుంటా. కయ్య అంటే నెల్లూరు భాషలో వరి పండించడానికి తగినట్లు సిద్ధంచేసిన పొలము భాగము. చేలలో నీళ్ళు ఎప్పుడూ ఉంటాయి (కోతకు ముందు దాకా). ఆ నీటిలో చేపలు పెంచడం (పండించడం) మామూలేమో. (జపాన్ వరి సాగు అని ప్రభుత్వం 1960లలో కొట్టిన డబ్బాలో సరుకిది) తమిళములో అందుకే మంచినీటి చేపలను కయలు కయ్యల్లో పెరిగినవి అంటారు. అదీ తిరుచ్చిరాపల్లి. త్రిశిరుడికి లేని ఇంద్రుడికి సంబంధములేదు...

...కావేరి నది ముక్కొంబు (గుణశీలమ్ వేంకటేశ్వర స్వామి దేయాలయముంది.) దగ్గర రెండు పాయలుగా చీలి, మళ్ళీ కౌత రసనల్లూరు వద్ద ఒకటౌతుంది. అక్కడికి తూర్పుగా తంజావూరు (తిరువైయ్యూరు) ఉన్నాయి. రెండు చీలికలపేర్లు: ఒకటి కావేరి, మరొకటి కొల్లడమ్. విచిత్రంగా (మీరు Fluid mechanics student అయితే చిత్రమేమి లేదు.) కొల్లిడమ్ లో సుడిగుండాలెక్కువ. మత్స్య సంపద కూడా ఎక్కువే. వెడల్పు తక్కువైనా (అందువలన) కొల్లిడమ్ ఈదడం చాలా కష్టం. పెద్దపడవలందులో ప్రవేశిస్తే అంతే సంగతులని కార్మికులు రాలేదు. సేవగా ఎవరికి వారు తమ శక్తిని వినియోగించారు. (అప్పటి దేవాలయాలన్నిటిలోనూ ఇంతే. తాజ్‌మహాలు కట్టిన కూలీలెవ్వరు? వారికిచ్చిన జీతాలెంతన్న గాంగ్రింపులిక్కడ వినపడవు.) దేవాలయము నడవటానికి చేయాల్సిన ఆర్థిక సహాయము చేయనందున, ఒకాయన (ఈయన ఒక ఆళ్వారు. తిరుమంగై అనే పేరుతో ప్రసిద్ధి) వ్యాపారస్తుల పడవలను కొల్లిడము లోకి వెళ్ళేట్టు చేశాడు. కూలీలను ముంచటం అసత్యము. కడపలో వారేంచేస్తారో, అన్నమయ్య సంతతి ఆయన ఏమి వ్రాసారో నాకు తెలియదు. పేర్లను సంస్కృతంలోంచి తెప్పించి చొప్పించి ఆనందించటమ్ తెలుగు వారి ఆత్మన్యూనతకు నిదర్శనమే. (ఉదా: రాజమండ్రి ని రాజమహేంద్ర మనటం. ఏలూరును హేలాపురి అనుకోడం, గుంటూరును గర్తపురమని (కాశీ కృష్ణాచార్య వ్యవహరించడమ్) కానీ తమిళులు అందులోనూ ద్రవిడ వారికి ఆ భావన లేదు. అంచేత తమిళ ఊర్ల పేర్లు సంస్కృతం నుంచి సాధించటమ్ అనవసర అసంబద్ధము...

...చివరగా శ్రీరంగము గా పేరు పొందిన పుణ్య స్థలము సాధన:శ్రీ:+ అంగము అనగా శ్రీని అంగము (శరీరముగా) కలవాడు (బహువ్రీహి). విశిష్టాద్వైతము. పరమాత్మ నిరాకారుడే కానీ అట్లా ఊహించి దర్శనము చేసికోడం దుస్సాధ్యమని, పరమాత్మకు ఆకారం స్ఫురణకు తెచ్చుకోవాలంటే సకల సృష్టి (చరాచర జడాజడ తత్వము) కలిసి ఆయన శరీరముగా ఊహించుకోండి. అంతే కానీ దేనినీ విడదీయవద్దు. (అద్వైతం) అంటుంది. సృష్టి సమస్తమూ కలిసి ఆయన ఐశ్వర్యము లేక సిరి లేక శ్రీ. కావున ఆయన శ్రీ అంగము గా కలవాడు శ్రీరంగడు. ఈ భావాన్ని స్ఫురింపచేసే చోటు శ్రీరంగము. ఇది ఆర్యద్రావిడ మల్లగుల్లాలకు అతీతము. చిత్తగించవలెను..." **- ఆచార్య సముద్రాల,** మద్రాసు.



# హోల్ టైం ఎడిటర్ ఆలపాటి రవీంద్రనాథ్

- *నరిసెట్టి ఇన్నయ్య*

### తొలిదశ తెనాలి 1940-50

ఆలపాటి రవీంద్రనాథ్ జర్నలిస్ట్ కాని సంపాదకుడు! రాయని భాస్కరుడుగా తెనాలిలో ఆరంభించి ఎందరితోనో రాయించాడు. అందుకు తొలి సాధన జ్యోతి పత్రిక, తోడుగా రేరాణి, కినిమా వుండేవి. రెండో ప్రపంచ యుద్ధం అంతం కానున్న రోజులలో, స్వాతంత్ర్య సమరం భారతదేశంలో చివరిదశకు చేరిన కాలంలో రేషన్, కంట్రోళ్ళతో జనం అల్లాడుతున్నప్పుడు తెనాలిలో కళలు, పునర్వికాసం, రాజకీయ చైతన్యం వెల్లివిరిసింది. ఆ నేపథ్యంలో రవీంద్రనాథ్ తురుమెళ్ళ స్కూలు విద్యముగించకుండానే జ్యోతి ప్రెస్ పెట్టి, పత్రికలకు స్వాగతం పలికారు.

ఇది 1940-48 మధ్య విశేషం. ఆంధ్రపారిస్‌గా పేరొందిన తెనాలిలో ప్రింటింగ్ ప్రెస్‌లు, ప్రచురణలు, పత్రికలు, నాటకాలు లేని వీధి వుండేదికాదు. రవీంద్రనాథ్‌కు గోవాడ గ్రంథాలయం సాహిత్యానికి ప్రోత్సాహాన్నిస్తే, తెనాలి ఆటలకు, పాటలకు, మాటలకు దిమిశ కొట్టింది. రవీంద్రనాథ్ టెన్నిస్ ప్రియుడు.

తెనాలికి ఆనాడు అన్ని విధాలా ఆకర్షణీయ యాత్రా కేంద్రం మద్రాసు. రవీంద్రనాథ్ తరచుగా మద్రాసు వెళ్ళి, మౌంట్ రోడ్‌లో కాస్మోపాలిటన్ క్లబ్‌లో వుంటూ, ఎందరో సాహితీ పరులతో సన్నిహితంగా మెలిగాడు. మూర్ మార్కెట్‌లో విదేశాల నుండి కుప్పతెప్పలుగా వచ్చిన పత్రికలు, పుస్తకాలు ఎంపిక చేసి, తెచ్చుకొని చదివాడు. అరుదైన విదేశీ సినిమాలు చూసేవాడు. ఆ అనుభవాల సంపదతో తెనాలి వచ్చేవాడు. తెనాలిలో అన్ని రాజకీయ పార్టీలతోబాటు, ఎం.ఎన్.రాయ్ స్థాపించిన రాడికల్ డెమొక్రాటిక్ పార్టీతో, అధ్యయన శిక్షణ కేంద్రాలతో రాడికల్స్‌తో బాగా కలసిపోవడం రవీంద్రనాథ్ మరో ఆస్తి.

తెనాలిలో రవీంద్రనాథ్‌తో కలసిమెలసిన వారెవరు? అబ్బూరి రామకృష్ణారావు, జి.వి.కృష్ణారావు, త్రిపురనేని గోపీచంద్, జంపాల శ్యాంసుందరరావు, ఆవుల సుబ్బారావు, గుత్తికొండ నరహరి, కోగంటి రాధాకృష్ణమూర్తి, అలా పెద్ద జాబితావుంది.

ఆనాడు రాడికల్స్ వివిధ పత్రికలు పెట్టి నడిపారు. సమీక్ష రాడికల్, స్టూడెంట్ రాడికల్, విహారి, ఆంధ్రలేబర్ అలా వుండేవి. బయట నుండి గూడవల్లి రాంబ్రహ్మం, 'ప్రజామిత్ర', బెజవాడ నుండి బండి బుచ్చయ్య, 'ములుకోల' నడిపారు.

వాటన్నిటికీ భిన్నంగా రవీంద్రనాథ్ పెట్టి నడిపిన పత్రిక జ్యోతి. అందులో తమ రచన పడితే చాలు అనుకునే తీరులో మాగజైన్‌కు పేరు తెచ్చారు. చలం, కొడవగంటి కుటుంబరావు, నెల్లూరు కేశవస్వామి, మరెందరో జ్యోతిలో రాశారు. కొత్త కోణంలో యావత్తు పత్రిక ఆకర్షించింది.

ఇందుకు రవీంద్రనాథ్ సాధనలు, ఆలోచనలు ఏమిటి?

టైం వారపత్రిక ఒకటి. పాఠకులను మత్తు మందుకు అలవాటు చేసినట్లుగా చదివించే లక్షణం టైంలో వుంది. చెప్పేతీరు అలాంటిది. విషయం ఏదైనా సరే ఆకర్షణీయంగా చదివించడం లక్ష్యం. దాని వెనక ఎంతో కృషి వుంటుంది. అది రవీంద్రనాథ్‌కు ఆయువుపట్టు. రచయితలను రాయమని అడగడం ఒక ఎత్తు కాగా, వచ్చిన రచనల్ని చెరిగి, ఎంపిక చేసి, ఎడిట్ చేసి, అవసరమైతే తిరగరాయించడం మరొక ప్రత్యేకత. రచయిత ఎవరైనా రవీంద్రనాథ్ యీ విషయంలో రాజీపడలేదు.

ఎవరూ వేయడానికి సాహసించని కథల్ని, వ్యాసాల్ని రవీంద్ర ప్రచురించారు. అందులో చలం కథలున్నాయి.

కుటుంబ నియంత్రణ విషయాలున్నాయి. రచనలలో రమణీయకత కావాలనే కోరికతో రవీంద్రనాథ్ సంప్రదాయాలకు భిన్నంగా పోయారు. తెనాలిలో ఆనాడు సంస్కరణ వాతావరణం వ్యాపిస్తుండగా, త్రిపుర నేని రామస్వామి, పండిత గోపదేవ్‌లతో సంబంధం గల రవీంద్ర నాథ్ ఎదిగి, పత్రికలు నడిపారు. కళాకారులలో గోవిందరాజుల సుబ్బారావు, డి.వి.నరసరాజు, సీనయర్ కృష్ణవేణి, కొంగర జగ్గయ్య, గుమ్మడి వెంకటేశ్వరరావు, వంటి వారితో రవీంద్రునకు సాన్నిహిత్యం వుంది. సినిమాలకు మానవ విలువలతో అంచనా వేయడానికే, కినిమా నడిపారు.

తెలుగు పత్రికలలో సైంటిఫిక్‌గా సెక్స్ చెప్పడం రవీంద్రనాథ్ చేసిన గొప్ప విషయం. వచ్చిన ప్రతి ప్రశ్నను స్థానికంగా డాక్టర్లకు రిఫర్ చేసి, నిర్దుష్టంగా సమాధానాలు చెప్పించారు. ఆకర్షణీయత సరేసరి. *రేరాణి* ఆ కోవలలో ఎదురు లేని పత్రిక. జనం ఆవురావురు మంటూ ఎదురు చూచిన పత్రిక. అందుకుగాను అప్పట్లో విదేశాల నుండి వచ్చిన హేవలాక్ ఎల్లిస్ శాస్త్రీయ సెక్స్ రచనలు రవీంద్ర ప్రమాణంగాపెట్టు కున్నారు. ధనికొండ హనుమంత రావుతో *అభిసారిక* పత్రిక నడిపించారు.




ఆంధ్రప్రభ సంపాదకుడుగా మద్రాసునుండి నార్ల వెంకటేశ్వరరావు విపరీత ప్రభావంచూపుతున్నప్పుడు ఆయన సంపాదకీయంపై కార్టూన్ వేసి అది బొక్కబెరడా? నార్లసంపాదకీయమా? అని వ్యాఖ్యానించి రవీంద్రనాథ్ పెద్ద సంచలనం సృష్టించారు తెనాలి *జ్యోతి* ద్వారా. 1939లో చనిపోయిన హేవలాక్ ఎల్లిస్ సైకాలజీ ఆఫ్ సెక్స్ 7 సంపుటాలుగా ప్రచురించారు. ప్రపంచవ్యాప్తంగా అది గొప్ప సంచలనం సృష్టించింది. రవీంద్రనాథ్ ఆ సంపుటాలను తెప్పించి రిఫరెన్స్‌గా వాడడం, *రేరాణికి, అభిసారిక*కు బాగా తోడ్పడ్డాయి. సంపాదకుడుగా ఆయన కృషి బాగా వ్యక్తమైంది. వాత్సాయన కామశాస్త్రం దేశంలో మధ్యయుగాలనుండే ప్రచారంలో వున్నా, శాస్త్రీయ ధోరణులు బాగా కొరవడ్డాయి. తెలుగు పత్రికలలో ఒక వినూత్న ఒరవడి రవీంద్రనాథ్ చూపెట్టారు. అందుకే ఆయన పత్రికలు సక్సెస్.

*జ్యోతి, రేరాణి, కినిమా, అభిసారిక* పత్రికలకు ఉపయోగపడే లిటరరీ స్టడీసర్కిల్ రవీంద్రనాథ్ నిర్వహించడం మరో కోణం. తెనాలి సమీపంలో కూచిపూడి గ్రామంలో ఎప్పుడు బడితే అప్పుడు యివి జరిగాయి.

పదిమందీ చుట్టూ కుర్చీలు అమర్చి, చర్చలు సాగించడం రవీంద్రనాథ్ పెట్టిన ఆనవాయితీ. అక్కడ చర్చలు పత్రికలకు ముడి సరుకుగా వాడారు. ఆ చర్చలలో కోగంటి సుబ్రహ్మణ్యం, జి.వి.కృష్ణారావు, పి.వి.సుబ్బారావు, కోగంటి రాధాకృష్ణ మూర్తి పాల్గొనే వారు. రవీంద్రనాథ్ నిర్వహించే వారు. పత్రిక థీమ్స్‌కు యీలిటరరీ సర్కిల్ ఉపయోగపడింది.

సంపాదకుడుగా, ప్రెస్ యజమానిగా వుంటూనే, రవీంద్రనాథ్ తెనాలిలో లజపతిరాయ్ క్లబ్, ఆఫీసర్స్ క్లబ్‌లో టెన్నిస్, క్యారమ్స్ ఆడేవారు. క్రీడల్ని ప్రోత్సహించారు. బుచ్చి రామయ్య, చలమయ్య వంటి వాలీబాల్ నిపుణులు చైనా ఆటల్లో పాల్గొనడానికి బాగా సహాయపడ్డారు.

స్వాతంత్ర్యం వచ్చిన రెండు మూడేళ్ళకే తెనాలి నుండి రవీంద్రనాథ్ పత్రికలను నిలిపేశారు. స్థానం మారింది.

**హైదరాబాద్ అధ్యాయం 1990 నుండి:**

తెనాలిలో మూడు పత్రికలు ముమ్మరంగా నడిపి మరోపత్రిక నడిపించిన రవీంద్రనాథ్ హైదరాబాద్‌కు మారారు.

ఆశ్చర్యం !

40 ఏళ్ళపాటు మళ్ళీ పత్రిక జోలికి పోలేదు. ఆయన తెనాలి నుండి కొనసాగించినవి : టెన్నిస్, ప్రింటింగ్ ప్రెస్, టైం మ్యాగజైన్. చదవడం, అధునా తనంగా పుస్తకాలు తెప్పించడం అలవాటుగా చేశారు. ఒకసారి అమెరికా పర్యటన జరిపి మూడు మాసాల అనుభవంతో తిరిగి వచ్చారు. హైదరాబాద్‌లో క్రాస్ సెక్షన్ ప్రజలతో యథాప్రకారం చర్చలు జరపడం, అనుభవాలు సంతరించుకోవడం ఆనవాయితీగా రవీంద్రనాథ్ చేశారు.

యూనివర్శిటీ ప్రొఫెసర్లు ప్రసార మాధ్యమ కేంద్రాల వ్యక్తులు, అకాడమీల ప్రముఖులు, వివిధ క్లబ్‌లలో సాహితీ

పరులు రవీంద్రనాథ్ కలిసిన వారిలో వున్నారు. అందరి పేరు పేర్కొనడం చాలా పెద్ద జాబితాగా తయారవుతుంది. ప్రధానంగా కొందరు–హైకోర్టు జడ్జీలు గంగాధరరావు, ఆమంచర్ల చిన్నపరెడ్డి, జయచంద్రారెడ్డి, ఆఫీసర్లు– ఎం.ఆర్.పాయ్, అకాడమిషియన్లు–కె.శేషాద్రి, జి.రాంరెడ్డి, రచయితలు – బూదరాజు రాధాకృష్ణ, చలసాని ప్రసాదరావు, సి.ధర్మారావు, సి.నరసింహారావు, తాళ్ళూరి నాగేశ్వర రావు అలా పెక్కురు వున్నారు. హైదరాబాద్‌లో వున్న నార్ల వెంకటేశ్వరరావు బాగా దగ్గరయ్యారు. రాజకీయవాదులలో తిక్కవరపు అనసూయ, రత్న సభాపతి, భవనం వెంకట్రాం వున్నారు. హైదరాబాద్‌లో విదేశీ సినిమాలు చూడడం, వివిధ క్లబ్‌లలో సభ్యత్వం రవీంద్రనాథ్ జీవితంలో భాగం అయింది.

బుద్ధిజం బాగా యిష్టంగా పరిశీలించారు. విల్‌డ్యూరాంట్ స్టోరీ ఆఫ్ సివిలిజేషన్ సంపుటాలు, సోషల్ సైన్సెస్ ఎన్‌సైక్లోపీడియా లైబ్రరీకి చేర్చారు.



సుప్రసిద్ధకవులలో సి.నారాయణరెడ్డి దగ్గరయ్యారు. అడపదడప రేడియో చర్చలలో పాల్గొన్నారు. టంగుటూరి సూర్య కుమారి, కొప్పరపు సరోజినీ వచ్చి కలిసేవారు. టంగుటూరి సూర్య కుమారి ఆలపాటి నడిపిన *కినిమా* పత్రికకు రాసేవారు. బుక్‌లింక్స్ నడిపిన కె.బి. సత్యనారాయణ, లాండ్ మార్ట్‌గేజ్ బ్యాంక్ నుండి మండవ శ్రీరామ మూర్తి, వివిధ పత్రికలలో జర్నలిస్టులు, గోవాడ సత్యారావు, వ్యక్తిగత సన్నిహితులుగా ఎస్.వి. పంతులు, మహరాజశ్రీ, ఎన్.వి.ఎస్. ప్రసాద్, మరెందరో యింకా కలసి మాట్లాడేవారుండేవారు.

ఏమైనా 40 ఏళ్లు సాగిపోయాయి.

అప్పుడు *"మిసిమి"* పత్రిక చిగురించింది.

**హోల్‌టైం సంపాదకుడుగా రవీంద్రనాథ్:**

ఇతరేతర కారణాలుగా *మిసిమి* పక్షపత్రికగా మొదలెట్టారు. కొన్ని సంచికలు వెలువరించి ఆపేయాలని తొలుత అభిప్రాయపడ్డారు. పక్ష పత్రికకకు కావసిన వ్యాసాలు నేను ప్రారంభించగా, బూదరాజు రాధాకృష్ణ, మరి కొందరు రాశారు.



టంగుటూరి
సూర్య కుమారి

అనుకున్నట్లు పక్షపత్రిక ఆపేయదలిచారు. ఆ దశలో రవీంద్రనాథ్ కుమారులు దేవేంద్ర, బాపన్న, పత్రికను కొనసాగించ వలసిందిగా, కాలక్షేపంగా వుంటుందని తండ్రికి సలహాయిచ్చారు. పక్షపత్రిక కాస్తా మాసపత్రిక అయింది.

***మిసిమి* విశిష్టత:**

తెనాలిలో పత్రికలలకు భిన్నమైన నిర్ణయం తీసుకున్న రవీంద్రనాథ్, *మిసిమి*లో కథలు, కవితలు వద్దనుకున్నారు. వ్యాసాలు, సమీక్షలు, విశ్లేషణలు, తత్వం, సైన్స్, కళావిశేషాలకు పరిమితం కావాలన్నారు.

*మిసిమి*లో విషయ నిర్ణయం జరగడంతో అనేక మంది కథకులు, కవులు నిరాశ చెందినా, రవీంద్రనాథ్ పట్టు సడలించలేదు. వాసిరెడ్డి సీతాదేవి వంటి సుప్రసిద్ధుల కథల్ని నిరాకరించ వలసి వచ్చింది.

ప్రెస్‌పనులు తన కుమారులు పూర్తిగా నిర్వహించడంతో రవీంద్రనాథ్ *మిసిమి*పై పూర్తి కాలాన్ని వినియోగించారు. టైం పత్రికలో తనకు నచ్చిన విషయాలు తెలుగు వారికి సానుకూలంగా మలచమని కొన్ని ఎంపిక చేసిన అంశాలను గోవాడ సత్యారావు వంటి వారికి అప్పగించారు.

విదేశాలలో వస్తున్న ఉత్తమ గ్రంథాలు తెప్పించి *మిసిమి*కి వాడారు. పాల్ జాన్సన్ రాసిన ఇంటలెక్చువల్స్‌ను నాతో చర్చించి, వెంకటేశ్వరరెడ్డి అన్నపరెడ్డికి యిచ్చారు. దాని ఆధారంగా మేధావుల మెతకలు శీర్షికన కొన్ని ప్రచురించారు. నేను తాత్విక, శాస్త్రీయ రచనలు అనేకం అందించగా, యథాతథంగా ప్రచురించారు.

రవీంద్రనాథ్ ప్రతిరోజూ ఫోన్లద్వారా *మిసిమి* గురించి చర్చలు జరిపేవారు. అది నిరంతర కార్యకలాపం అయింది. క్రమేణా దిన పత్రికలు, హిందూ పత్రిక *మిసిమి* ప్రత్యేకతను గమనించాయి. రాయమని అడగనిదే ఎవరికీ రాయని సంజీవ్‌దేవ్ తనకు తానుగా *మిసిమి*కి వ్యాసాలు పంపారు. సి.నరసింహా రావు వ్యక్తిత్వ వికాసంలో కొన్ని భాగాలు ప్రచురించారు.

రవీంద్రనాథ్ నేనూ కలసి హైదరాబాద్‌లో అశోక్‌నగర్‌లో వుంటున్న పురాణం సుబ్రహ్మణ్య శర్మ దగ్గరకు వెళ్ళి సంప్రదించాం. మధురవాణి అనేక వ్యక్తుల్ని ఇంటర్వ్యూ చేసినట్లుగా రాస్తే బాగుంటుందని అన్నాం. పురాణం అంగీకరించి వరుసగా రాశారు.

అందులో కొన్ని భాగాలు రవీంద్రనాథ్ సెన్సార్ చేశారు. బ్రతికున్న వారిపట్ల వివాదాంశాలు తొలగించే వారు. ఆయన ఎడిట్ చేయడాన్ని పురాణం అంగీకరించారు.



విక్రం సేట్ రాసిన సూటబుల్ బోయ్ పుస్తకం కొని కోమల వెనిగళ్లకు యిచ్చి, సమీక్షవ్యాసం రాయించారు. కమ్యూనిస్టులలో ఏటుకూరి బలరామమూర్తి పరిశీలనలు యిష్టపడే వారు. మిగిలిన వారిని నాటు కమ్యూనిస్టులని రవీంద్రనాథ్ చమత్కరించే వారు. *ఎన్‌కౌంటర్* మాగజైన్ లండన్ నుండి తెప్పించి, రిఫరెన్స్‌గా వాడారు. అది తరువాత ఇంటర్నెట్ ఎడిషన్‌గానే వచ్చింది. సైన్స్, తత్వంలో విషయాలు సరళంగా, పాఠకులకు ఆకర్షణీయంగా అందించాలనే ***మిసిమి*** ధోరణి అధునాతనమైంది. రవీంద్రనాథ్ ముద్రలు వేసుకోలేదు. రాడికల్ హ్యూమనిస్ట్ అని పిలుచుకోలేదు. 1940 నుండీ ఆయనపై మానవతా వాద ప్రభావం, ఎం.ఎన్. రాయ్ ఆకర్షణ లోతుగా వున్నమాట వాస్తవం. వాటిని ***మిసిమి***లో అత్యంత ఆధునీకరణ చేసి పాఠకులను ఆకట్టుకున్నారు. రవీంద్రనాథ్ నడిపిన ***మిసిమి*** అనిరతసాధ్యం. విశిష్ట చరిత్ర నిలబెట్టుకున్నది.

---

## అన్వేషణ

ఇద్దరు ఒక లోయలో నడిచి వెళ్తున్నారు. వాళ్లలో మొదటి వ్యక్తి, దగ్గరగా వున్న ఒక పర్వతాన్ని చూసి, 'ఆ పైన కనిపించే ఆశ్రమం చూశావా? ఈ ప్రపంచంనుంచీ ఉపసంహరించుకున్న ఒక వ్యక్తి అక్కడ నివసిస్తాడు. అతను దేవుణ్ణి కనిపెట్టడానికి అక్కడ వున్నాడు. ఈ ప్రపంచానికి దూరంగా వుండడానికి నిర్ణయించుకున్నాడు' అన్నాడు.

రెండో వ్యక్తి 'అతను ఎప్పుడయితే ఆ ఆశ్రమాన్ని వదిలిపెట్టకుండా ఉంటాడో, అప్పటిదాకా దేవుణ్ణి కనిపెట్టలేడు. ఒంటరిగావున్న ఆశ్రమాన్ని వదిలిపెట్టి అతను ప్రపంచంలోకి రావాలి. మనతో ఆనందాన్ని, బాధను పంచుకోవాలి. మనతో కలిసి ఆడాలి, పాడాలి. మరణించిన మన జనాల్ని చూసి మనం కన్నీళ్ళు పెట్టుకుంటూ వుంటే మనతో బాటు అతనూ కన్నీళ్ళు పెట్టుకోవాలి' అన్నాడు.

మొదటి వ్యక్తి రెండో వ్యక్తి హృదయాన్ని అర్థం చేసుకున్నాడు.

"నువ్వు చెప్పిందాంతో నేను అంగీకరిస్తున్నాను. అయినా యిప్పటికీ నేను ఆ సన్యాసిని మంచి మనిషిగానే భావిస్తున్నాను. కానీ ఎంతో మంది మంచి మనుషులు ఈ ప్రపంచంలో వున్నారు. ఆయన కూడా మంచి మనిషే. ఆయన యిక్కడ లేకపోవడం వల్ల ఈ ప్రపంచానికి నష్టం లేదుకదా!" అన్నాడు.

# ఆలపాటి రవీంద్రనాథ్ తో
# మధురవాణి సంభాషణలు



- పురాణం సుబ్రహ్మణ్య శర్మ

**మధుర :** కన్యాశుల్కం లోంచి నన్ను బయటకు లాగి నలుగురిలో పడేట్లు చేశారు మీరూ, మీ స్నేహితుడూ.

**రవీంద్ర:** నిన్ను ఒక వేశ్యగాకాక పెద్ద పండితురాలిని చేశాము గదా!

**మధుర:** నాకేం ఒరిగింది? మీ కోరిక తీరింది తప్ప.

**రవీంద్ర:** మధురవాణి ఒక చతురవాణిగానే కాక మేధావి గావటం నీకిష్టం లేదా!

**మధుర:** లోవల సంతోషమే మీ చిలిపితనానికి. చాలామందిని నా చేత అల్లరి పెట్టించి మీరు ఆనందించినట్లున్నారు.

**రవీంద్ర:** కాదు; గర్వించాను; ***మిసిమి*** స్థాయి నీవల్ల పెరిగినందుకు.

**మధుర:** దీనివల్ల మీరే తగువులు పడతారో?

**రవీంద్ర:** అవన్నీ శర్మగారివి. కీర్తి ***మిసిమి***ది.

**మధుర:** తడిక తోసినవాడిది తగూ అని. దెబ్బలు మంచానికి.

**రవీంద్ర:** శీర్షికా నిర్వహణం ఒక ముళ్ళకిరీటం.

**మధుర:** జీవితం ఒక శిలువ, ప్రతివాడూ ఒక క్రీస్తు అని అన్నాడో ఆధునిక కవి.

**రవీంద్ర:** చూశావా, నువ్వు కూడా కవిత్వాలు వల్లిస్తున్నావు. అంతా ***మిసిమి*** మహిమ.

**మధుర:** కన్యాశుల్కం లోంచి నన్ను బయటకు లాగి మాట్లాడించాలని మీకెలా తట్టింది?

**రవీంద్ర:** అది అనలు గురజాడ వారి అయిడియా. ఆయనెక్కడో ఒక ఇటాలియన్ పుస్తకంలో చూశాట్ట.

**మధుర:** ఏమిటి ఆయన చూసింది?

**రవీంద్ర:** ఒక వేశ్య చేత ఆకాలంలోని సమకాలీన మహానుభావుల్ని ఊహాజనితంగా ఇంటర్వ్యూ చేయించి ప్రకటించాలని. ఆ ఇటాలియన్ కర్త కోరిక గురజాడ వారు గమనించి అలాటిదేదో చేయాలనుకున్నారు.

**మధుర:** అటు తిరిగీ ఇటు తిరిగీ, ఆ కోరిక తీర్చడానికి మీరూ మీ స్నేహితుడూ నడుం కట్టారన్నమాట.

**రవీంద్ర:** మేం ఆ అయిడియా మీద పనిచేశాం గాని గురజాడ వారి ముందు మేవెంత?

**మధుర:** నృత్య సంగీతాల్లో పడికొట్టుకునే మమ్మల్ని సాహిత్య మేధావుల ప్రపంచంలోకి లాగారు. నక్క ఎక్కడ? నాగలోకమెక్కడ?

**రవీంద్ర:** సంభాషణాచాతుర్యం అంటే నీదే.

**మధుర:** చమత్కారానికి కాదు, మాధుర్యానికి నాకా ప్రసిద్ధి.

**రవీంద్ర:** మనపూర్వ సాహిత్యంలో విప్రనారాయణుడు మోహించిన వేశ్య దేవదేవి; ఆవిడ అక్కగారు మధురవాణి. వసంతసేనను చూసి గురువుగారు నిన్ను దిద్దారు కాబోలు.

**మధుర:** ఆవిడకు చారుదత్తుడు దొరికితే నేను గిరీశం గారి పాలబడ్డాను తర్వాత రామప్పపంతులు. సరే పేకాటలో అంతా.

**రవీంద్ర:** నీతో పేకాడిన వారు ధన్యులు.

**మధుర:** రామప్పపంతులు కమాను మీద వెళ్ళినపుడు మరి నాకు కాలక్షేపం కావడమెల్లాగ?

**రవీంద్ర:** నీ కాలక్షేపానికి కదా ఇంతమందితో ఈ కబుర్లు!

**మధుర:** ఏమి చమత్కారమండీ? మీ గర్ల్ ఫ్రెండ్ కోసం మీరు చేసినవన్నీ నా కోసం అంటారే?

**రవీంద్ర:** *మిసిమి* నా గర్ల్ ఫ్రెండని నీకెల్లా తెలిసింది.

**మధుర:** సానివాళ్ళకు కర్ణపిశాచి వుంటుంది.

**రవీంద్ర:** విజయనగరంలో ఆనందగజపతి మహారాజు కాలంలో మద్దెల మహాలక్ష్మి అనే వేశ్యారత్నం వుండేదట. ఆవిడ మహా గొప్ప సంగీత విద్వాంసురాలు. ఆవిడ అలవోకగా ఒక రాగం విసిరితే విని పట్టుకుందామని నారాయణదాసు గారిలాంటి హరికథా పితామహులు చూసేవారట. గురజాడ వారికి ఆవిడ నీ పాత్రకి ప్రేరణ అంటారు పెద్దలు.

**మధుర:** మొట్టమొదటి కన్యాశుల్కంలో నేనున్నానండోయ్.

**రవీంద్ర:** కాని అందులో నీ రూపం 'కలర్‌లెస్ ఇన్‌క్విటీ' అన్నారు గురజాడ.

**మధుర:** రెండో కన్యాశుల్కంలో నన్ను ఎంతగా పెంచారంటే మా గురువుగారు...(సిగ్గుపడును)

**రవీంద్ర:** నిన్ను మోహించేటంత! దాపరికం అక్కర్లేదు, అప్పారావుగారు ముని సుబ్రహ్మణ్యం గారికి రాసిన ఉత్తరంలో I am enamoured of her అన్నారు. కవి తన సృష్టిని తానే మోహించడం అపూర్వం. నిన్ను మోహించకుండా ఎవరుండగలరు? (నవ్వు)

**మధుర:** ఆవండి. "You too, Brutus?" అన్నట్టు మీరుకూడానా? (అలక)

**రవీంద్ర:** *మిసిమి* నువ్వు చదివావా?

**మధుర:** నిజం చెప్పమంటారా? అబద్ధం చెప్పమంటారా?

**రవీంద్ర:** నిజం ఎవరిక్కావాలి? అబద్ధమే చెప్పు. (ముసి ముసి నవ్వు)

**మధుర:** ఆ వ్యాసాలు మీకు మట్టుకు అర్థం అవుతాయా? నిజం చెప్పాలి.

**రవీంద్ర:** అలా ఎందుకనుకున్నావు?

**మధుర:** ఒక్కొక్కళ్ళు ఒక్కొక్క భాషలో రాస్తారు పెద్దపెద్ద విషయాలు, అవి అర్థమై చావవు ఓ పట్టాన.

**రవీంద్ర:** అటువంటి విషయాలు, సంగతులు వున్నాయని కనీసం మనవాళ్ళకు తెలియచెప్పటం *మిసిమి* డ్యూటీ. మచ్చుకి అంబేద్కర్‌ని ప్రేరేపించింది ఒక తెలుగువాడి పుస్తకమని మేం బైట పెట్టామా లేదా?

**మధుర:** అలాగే వీరేశలింగంగారిని ఉత్సాహపరిచింది సామిధేని ముద్దుకృష్ణమనాయుడని తెలిసిందీ *మిసిమి* వల్లనే కదా!

**రవీంద్ర:** దొంగా, దొరికావు! నువ్వు చదువుతావు *మిసిమి*ని. అర్థంకాదని పైకి దొంగ కబుర్లు చెబుతావు తెలివిగా.

**మధుర:** మీ పత్రికలో చాలా వ్యాసాలు కుప్పు సామయ్యరు మేడ్ డిఫికల్టు. అవునా, కాదా?

**రవీంద్ర:** ఆ విషయాలు అలాటివి. శాస్త్ర విషయాలు సులభంగా పకోడీల్లా ఎలా వుంటాయి?

**మధుర:** అయితే మీ *మిసిమి*కి స్త్రీలు పాఠకులు కాలేరు.

**రవీంద్ర:** తెలుగు వారు ఎప్పుడూ ఎదగకుండా చచ్చు కథలూ, పుచ్చునవల్లూ. పిచ్చి కవితలూ చదువుకుంటూ స్థిరోభవ వరదో భవ అని అల్లాగే వుండాలనా? *మిసిమి* చదివిన కొందరు స్త్రీలు నువ్వేమీ అనుకోనంటే 'విదుషిణీ మణులు' అంటాను – తోటి స్త్రీలకి చెబుతున్నారు. కొందరైతే వ్యాసాలు పంపేరు కూడా. ముదితల్ చదవగలేని పత్రిక కలదే? అనొచ్చు.

**మధుర:** తెలుగువాళ్ళకి ఓ పట్టాన అర్థం కాని పత్రిక నిర్వహించినందుకే మీకు ఆ అమెరికా వాళ్ళేదో పురస్కారం ఇచ్చారట – డాక్టరేటు.

**రవీంద్ర:** నీ వేళాకోళానికేం గాని, ఒకళ్లు మెచ్చి మేకతోలు కప్పుతారనీ, ఒకళ్ళు తెగడుతారనీ నేను *మిసిమి*ని నడపలేదే? నా ఆనందం కోసం, నా తృప్తి కోసం. నేను ఖాళీగా వుండకుండా ఏదో ఒకటి చెయ్యాలి కదా!

**మధుర:** మీ తాలూకా వారంతా సినిమాలు తీశారుగా. మీరూ ఓ సినిమా తీసి వుండాల్సింది. తెలుగువారికి సినిమా పిచ్చి తప్ప మరేమీ లేదు.

**రవీంద్ర:** సినిమాలు నా ఒంటికి పడవు. అయినా నన్ను ఆటపట్టించడానికి కాకపోతే నీవా ప్రశ్న నన్ను అడగడానికి నేను నీకంటికి అలా కనిపిస్తున్నానా? జీవితం గంభీరమైనది. కాలం అంతకన్నా విలువైనది కదా!

**మధుర:** అన్నట్లు ఓ మాట అంటాను కోపం తెచ్చుకోరు గదా!

**రవీంద్ర:** కోపం దేనికి? అందునా నీ మీదా?

**మధుర:** మీరు *మిసిమి* బంగరు రంగులోవున్నారు. మీ బాడీ కలర్‌కి సూటవుతుందని *మిసిమి* అని పెట్టారేమోనని మీ పత్రిక్కి.

**రవీంద్ర:** 'ఫిమినైన్స్ ఆర్ ఫూల్స్' అన్నాడు గిరీశం.

**మధుర:** ఆరోజుల్లో ధనికొండ హనుమంతరావు నడిపిన 'రేరాణి' పత్రిక వెనక మీరేనటగా సారథ్యం?

**రవీంద్ర:** అందుకనేగా, ఒక మారు మేజస్ట్రేటు కోర్టులో శిక్ష కూడా పడింది నాకు. ఫైన్ వేశారు.

**మధుర:** తెలుగు జర్నలిజంలో మేగజైన్ జర్నలిజానికి పునాదులు వేసిన వారిలో మీరొకరనుకుంటా అవునా?

**రవీంద్ర:** 'జ్యోతి' నడిపినా ఆ వెనక 'రేరాణి' నడిపినా నా ఒరవడి నాదే. సంచలనం రేపితే భావజడత్వం బద్దలయి తీరుతుంది.

**మధుర:** మీరు రాయిస్టులనుకుంటా. ఆమ్లెట్లు వేయాలంటే గుడ్లు బద్దలు కొట్టాల్సిందే శ్రీశ్రీ చెప్పినట్లు.

**రవీంద్ర:** ఫ్యామిలీ ప్లానింగ్, జనాభా సమస్య మీద వ్యాసం వేస్తే నార్లవంటివారు ఇది ఎందుకు వేశారు అని అభ్యంతరం చెప్పారు.

**మధుర:** ఎన్.టి. ఆర్.గారు ఫ్యామిలీ ప్లానింగ్ ఉపన్యాసాలు చెబితే బాగుండదు కదా!

**రవీంద్ర:** వారి కుంటుంబ సమస్యలే రాష్ట్ర జీవన్మరణ సమస్యలయాయి. రాజకీయాలు మనకెందుకు గాని నేను అందరు తత్వవేత్తల్ని ఆకళింపు చేసుకున్నా. అబ్బూరి రామకృష్ణారావు గారు, చలం అంతా రాయిస్టు వాసన చూసినవాళ్ళమే.

**మధుర:** మీరేదన్నా 'నో' అంటే, చౌదరి గారు నో అన్నారు ఏముందోనని రచయితలు పునరాలోచన చేసే స్థితి ఉంది.

**రవీంద్ర:** మరి ఇప్పటిలా కాక ఎడిటర్ ఎవరికీ తల వంచకూడదు. పోతన గారిలా 'ఇమ్మనుజేశ్వరాధములకిచ్చి...!'

**మధుర:** బౌద్ధం పట్ల మీకు ఆసక్తి హెచ్చనుకుంటా.

**రవీంద్ర:** "బౌద్ధమతాన్ని తన సరిహద్దుల నుంచి తరిమేసి ఇండియా ఆత్మహత్య చేసుకుంది." అన్నారు గురజాడ.

**మధుర:** వీరేశలింగం, నాయుడుగారు, కృష్ణశాస్త్రి ఇలా అంతా హిందూ వైదికమతం నుంచి దూరమైన వారే. మిమ్మల్నీ మీ తపననీ తెలుగువారు గుర్తించలేరు కదా!

**రవీంద్ర:** నేను సైలెంట్ వర్కర్ని. ఆరోక్లాసు దాకా మాత్రమే చదువుకున్నవాడ్ని. నాకు పుష్పగుచ్ఛాలు అక్కర్లేదు. పన్నీటి జల్లులూ అవసరంలేదు. .

**మధుర:** అవును, సూర్యచంద్రుల్ని ఎవరు గుర్తించాలి.

**రవీంద్ర:** నన్ను ములగచెట్టు ఎక్కించకు నేను మామూలు మనిషిని ప్లీజ్!

**మధుర:** మామూలు మనిషీ జిందాబాద్! పునర్జన్మ లేదన్న *మిసిమి* జిందాబాద్

అసతోమాసద్గమయ, తమసోమా మిసిమిర్గమయ

---

## భావము

నీటి వనరులైన నూతిని, బావిని సమానార్థకాలుగా భావిస్తారు, కానే కాదు. నూయివేరు, బావివేరు. ఈ మాట నన్నయ ఆదిపర్వంలోను, తిక్కన అనుశాసనిక పర్వంలోను స్పష్టం చేశారు. అంటే, రెంటినీ వివక్షించి చెప్పారు. మన ప్రయత్నంచేత నీటితో నింపి వాడుకునేది నూయి. తొట్లకొండ, ఉండవల్లి ఇంకా ఇతర బౌద్ధుల, జైనుల పూర్వం ఆవాసాలున్న కొండలపై వీటిని చూడవచ్చు. అలాగాక భూమిలోనికి త్రవ్వేది బావి. అందులో నీరు ఊరుతుంది. మొదటిది నిలువ నీరు. బావి నీరు ఎప్పటికప్పుడు ఊరుతుంది. కనుక నూతి నీటికంటే బావి నీరు శ్రేష్ఠమని నన్నయ చెప్పటం జరిగింది. ఆయనన్నమాట 'నుతజల పూరితంబులగు నూతులు నూరిటికంటె ఒక్క బావిమేలు' అని. ప్రయత్న పూర్వకంగా నీటితో నింపేది అనే భావాన్ని కూడా ఆయనే 'నుతజల పూరితంబులు' అనే విధంగా చెప్పటం జరిగింది.

# భాయా నిరాలా

- మహాదేవి వర్మ



ఆ రోజు రాఖీ పండగ. నేను ఏమీ ఆలోచించకుండానే సోదరుడు నిరాలాను హఠాత్తుగా అడిగేశాను, "మీకు ఎవరూ రాఖీ కట్టలేదా?" అని. ఆ క్షణంలో నా ఎదుట ఖాళీగా వున్న ఆయన మణికట్టు, పసుపు పచ్చని నూలుపోగులు చేత పట్టుకొని, ఏ గృహస్థునికైనా రాఖీలాగా అవి కట్టి కొంత డబ్బు సంపాదించుకొనే ఉద్దేశ్యంతో తిరిగే పురోహితుల ముఖాలు ఉండి ఉంటాయి. అయితే నా ప్రశ్నకు వచ్చిన సమాధానం మాత్రం క్షణకాలం నన్ను ఉలికి పడేట్లు చేసింది.

"ఏ సోదరి మటుకు నాలాంటి దరిద్రుణ్ణి సోదరునిగా చేసుకుంటుంది?" అని ఆయన వేసిన ఎదురు ప్రశ్నలో ఆయన ఏకాకి జీవితంలోని వ్యథే ఉండిందా లేక ఎదుటి వాళ్ళను ఉద్దేశించి చేసిన ఏదో ఒక సవాలు ఉండిందా చెప్పడం కష్టం.

నేను చేసే ఈ ప్రయత్నం ఏదో ఒక ప్రచండ ప్రభంజనాన్ని నూలుపోగుతో కట్టేసే ప్రయత్నం లాంటిదా లేక ఎగిసెగిసి పడుతూ పారే ఒక మహానదిని మైనపు ఒడ్డులకు పరిమితం చేయడం లాంటిదా అనే దాన్ని గురించి ఆలోచించే అవకాశం అప్పుడు నాకు లేదు. అయితే ఆ తర్వాతి సంవత్సరాలు నిరాలాజీ చేసిన జీవన పోరాటానికి సంబంధించినవే గాక నాకెదురైన పరీక్షలకు సంబంధించినవి కూడా అనే మాట మాత్రం సత్యం. నేను ఆ పరీక్షల్లో ఎంత వరకు సఫలత సాధించగలిగాను, అనేది నాకు తెలియదు. అయితే ప్రాపంచిక దృష్టిలో భోగభాగ్యాలు ఏ మాత్రమూ లేని నిరాలా, హృదయనిధుల విషయంలో మాత్రం పరమ ఐశ్వర్య సంపన్నుడైన సోదరుడని అంగీకరించడంలో నాకు ఏ మాత్రం సందేహం లేదు. తన సహజ విశ్వాసంతో నా పచ్చి దారపు రాఖీ బంధనానికి ఆయన కలిగించిన దృఢత్వం, దీప్తి మరెక్కడా కానరావు. పరమ అస్తవ్యస్తమైన ఆయన జీవితాన్ని క్రమబద్ధం చేయడానికి నేను చేసిన ప్రయత్నాలను గుర్తు చేసుకుంటే నాకిప్పుడు కూడా నవ్వొస్తుంది. ఒకరోజు అంతు-పొంతులేని తన దాన పరత్వం గురించిన విమర్శ విన్న తర్వాత ఇకముందు ఒక పద్ధతిని పాటిస్తానని ఆయన నాకు మాట ఇచ్చాడు.

యాదృచ్ఛికంగా అప్పుడే ఆయనకు ఎక్కడినుంచో మూడు వందల రూపాయలు అందాయి. ఆ మొత్తమంతా నా దగ్గర జమచేసి తన ఖర్చుకు సంబంధించిన బడ్జటు తయారు చేయమని ఆయన నన్ను ఆదేశించాడు.

నా వ్యక్తిగత ఖర్చుల లెక్క రాసేపని చేస్తున్నవాళ్ళకు తెలుసు అది నాకు ఎంత కష్టసాధ్యమో. వాళ్ళు నా దుప్పటి పొడవునూ పెంచలేరు, కాళ్ళు ముడుచుకోడానికి నన్ను బలవంత పెట్టనూ లేరు. ఈ విధంగా ఒక విచిత్రమైన పెనుగులాటలో నెలలో ముప్పై రోజులూ గడిచిపోతూ ఉంటాయి.

సరే, ఇక ఉప్పు పప్పు మొదలుకొని మంగలి ఖర్చు దాకా, చెప్పులు మొదలుకొని ఇంటి బాడుగ దాకా నేను తయారుచేసిన ఖర్చుల అంచనా పట్టిక నిరాలాజీకి నచ్చినప్పుడు జీవితంలో మొదటిసారిగా నా అర్థశాస్త్ర పరిజ్ఞానంపైన నాకు గర్వం కలిగింది. అయితే మరుసటి రోజు నుంచే నా ఈ గర్వం వ్యర్థమని తెలిపోసాగింది. ఆయన ఉదయమే వచ్చాడు. "యాభై రూపాయలు కావాలి... ఒక విద్యార్థి పరీక్ష ఫీజు కట్టాలి, లేకపోతే ఆ అబ్బాయి పరీక్ష రాయలేడు" అంటూ. ఇక సాయంత్రం అయ్యేటప్పటికి ఒక సాహితీ మిత్రునికి తప్పనిసరిగా అరవై ఇవ్వవలసిన అవసరం ఏర్పడింది. మరుసటి రోజు లక్నోలో ఉండే ఒక జట్కావాని తల్లికి నలభై రూపాయలు మనియార్డరు పంపవలసి వచ్చింది.

మధ్యాహ్నానికంతా దివంగతుడైన ఒకానొక మిత్రుని అన్న కూతురు పెళ్ళికిగాను వంద ఇవ్వడం తప్పనిసరి అయింది. ఇంతకూ సారాంశం ఏమిటంటే - మూడోరోజు నాటికి ఆయన

హిందీ నుంచి అనువాదం : డా. జె. లక్ష్మిరెడ్డి, ఫోన్ : 09811589430

డిపాజిట్ చేసి ఉంచిన డబ్బంతా అయిపోవడంవల్ల ఆయన అదాయ వ్యయాల వ్యవస్థాపకురాలుగా ఈ దానాల పద్దులు నాపైకొచ్చి పడ్డాయి. ఒక వారం దినాల్లో నాకర్థమైపోయింది. లేదనకుండా దానం చేసే ఈ గొప్ప దానపరుణ్ణి ఆపకపోతే నన్ను కూడా తనున్న స్థితిలోకి తీసుకెళ్ళే దాకా విశ్రమించడని. ఆ తర్వాత ఆయన బడ్జటు తయారుచేసే దుస్సాహసం మరెప్పుడూ నేను చేయలేదు. కానీ ఆయన అస్తవ్యస్తతకు అడ్డుపుల్లవేసే నా స్వభావాన్ని మాత్రం నేనిప్పటికీ మార్చుకోలేక పోయాను.

ఎంతో ప్రయత్నం మీద తయారు చేయించిన రజాయీ, కోటు లాంటి నిత్యావసర వస్తువులు కూడా మరుసటిరోజే ఇతరుల కష్టాలు తొలగించేందుకు అంతర్ధానమై పోతున్నప్పుడు నిమిత్తం మాత్రమే అయిన డబ్బు గురించి ఇక చెప్పేదేముంది?

అక్కడ గూట్లో సగం కాలిన బట్ట వత్తితో నిండి ఉండినా, నూనె లేని మట్టి దీపం తన పేరును సార్థకం చేసుకొనేందుకు వెలిగే ప్రయత్నం చేస్తున్నది. అది పడే ప్రయాసకు గనక గొంతు లభిస్తే అది కిరసనాయిలు దుకాణం ఎదుట లైనులో అందరికంటే వెనక నిలబడినా అందరికంటే జానెడు ఎత్తుగా కనిపించే ఆ ఇంటి యజమాని చేసిన సుదర్ఘీమైన నిష్ఫల నిరీక్షణకు సంబంధించిన కథ మనకు తప్పక చెప్పి వినిపించేదే. వంటగదిలో సగం కాలిన రెండు-మూడు కట్టెలు, బోర్లించిన పెద్ద గిన్నె, కొక్కెం నుంచి వేలాడుతున్న చిన్న పిండి సంచి, మొదలైనవి ఉపవాస చికిత్స (లంఖణం పరమౌషధమ్) వల్ల కలిగే లాభాలను వ్యాఖ్యానిస్తున్నాయా, అన్నట్లు కనిపించాయి.

ఏ వెలుగు, సదుపాయాలులేని ఆ ఇల్లు ఇంటి యజమాని విశాల విగ్రహంతోను, అంతకంటే విశాలమైన ఆయన ఆత్మీయతతోను నిండి ఉండింది. తన బాగోగుల గురించిన చింత ఏ మాత్రమూ లేని నిరాలాజీ అతి నిష్ఠా గరిష్ఠ వైష్ణవుడైన తన అతిథి గుప్తాజీ కోసం మాత్రం కొత్తకుండ ఒకటి కొనుక్కొని గంగ నీళ్ళు తీసుకొచ్చాడు. పంచెలు, దుప్పట్లు ఇంట్లో ఏవి ఉంటే అవన్నీ చెక్క పలకల మంచంపైన పరిచి ఆయన్ను దానిపైన ప్రతిష్ఠింప చేశాడు.

సంప్రదాయ వాది (గుప్తాజీ), విప్లవవాది (నిరాలాజీ) అయినా ఆ ఇద్దరు మహాకవులు నక్షత్రాల నీడలో ఏమేమి చర్చలు జరుపుకున్నారో నాకు తెలియదు గానీ, ఉదయం గుప్తాజీని రైల్లో కూర్చోబెట్టి వెనక్కి వెళ్ళేప్పుడు రాత్రి ఆయన సుఖంగా నిద్రపోయాడనే సమాచారం నాకు చేరవేయడం మాత్రం నిరాలాజీ మరిచి పోలేదు.

ఒకరోజు అకస్మాత్తుగా వచ్చి "నా జట్కాబండ్లో కొన్ని కట్టెలు, రవ్వంత నెయ్యి వగైరా పెట్టించు... అతిథులు వచ్చారు, ఇంట్లో సరుకులేమీ లేవు" అన్న సందర్భాలు చాలానే ఉన్నాయి.

భోజనానికి అతిథులు వచ్చారని విని ఆయన కళ్ళల్లో చిన్న పిల్లల్లాంటి ఉత్సాహం పొంగి వచ్చేది. మరి తమ స్వంత ఇల్లుగానే భావించి వచ్చిన వాళ్ళతో భోజనానికి మరో చోటికి వెళ్ళమని ఎలా చెప్పడం?

భోజనం తయారు చేయడం మొదలుకొని ఎంగిలి పాత్రలు కడిగేదాకా అన్ని పనులు తన అతిథి దేవుని కోసం ఆయన ఆనందంగా చేస్తాడు. ముప్పై మూడు కోట్ల దేవతలున్న దేశంలో ఇలాంటి అతిథి దేవుళ్ళ సంఖ్య తక్కువగా మాత్రం ఉండదు.

అప్పట్లో శ్రీ సుమిత్రానందన్ పంత్ (జ్ఞానపీఠ పురస్కారం పొందిన గొప్ప హిందీ కవి, నిరాలాకు, మహాదేవి వర్మకు సమకాలికుడు) ఢిల్లీలో టైఫాయిడ్‌తో బాధపడుతూ ఉన్నాడు. అప్పుడు, జరిగిన దాన్ని మామూలు విషయంగానూ, జరగని దాన్ని వార్తగాను భావించే ఒక వార్తా పత్రిక ఆయన కన్నుమూశారానే అబద్ధపు వార్త ప్రచురించింది.

నిరాలాజీ ఎంత అకస్మాత్తుగా వచ్చి పడ్డాడంటే ఈ వార్త ఆయనకు తెలియకుండా ఉంచే అవకాశం నాకు లేకపోయింది. వార్త నిజమై ఉంటుందనే నమ్మకం నాకు లేదు. కానీ నిరాలాజీ ఇలాంటి సందర్భాల్లో ఆలోచించే శక్తి మూర్తిగా పోగొట్టుకుంటాడు. ఆయన తడబడుతూ వచ్చి ధమ్మని సోఫాపైన కూలబడి పోయాడు. ఏదో అవ్యక్త వేదనా తరంగ స్పర్శతో శిలాప్రతిమగా మారిపోతున్నాడేమో అన్నట్లు కనిపించాడు.

వార్త వల్ల నేను స్వయంగా చలించిపోయి ఉండి కూడా నిరాలాజీకి ఊరట కలిగించేందుకు స్థిర చిత్తురాలిని కావలసి వచ్చింది. అసలు సమాచారం ఏమిటో తెలుసుకోడానికి నేను ఢిల్లీకి టెలిగ్రామ్ పంపానని విని ఆయన వ్యథాభరిత నిరీక్షణలో రాత్రి నా ఇంటి గేటు మూసే సమయం అయ్యేదాకా అలాగే కూర్చుండి పోయాడు. ఉదయం నాలుగు గంటలకే వచ్చి గేటు కొట్టి టెలిగ్రామ్‌కు జవాబు ఏమైనా వచ్చిందా అని ఆయన

అడిగినప్పుడు ఆయన రాత్రంతా పార్కులో నీలాకాశం కింద, మంచులో తడిసిన గడ్డిపైన కూర్చొని ఉదయం కావడం కోసం ఎదురుచూస్తూ గడిపాడని నాకు అర్థమైంది. వ్యథతో మూగపోయిన గొంతు కొంత పెగలగానే అతికష్టం మీద ఆయన ఇలా అన్నాడు – "ఇక నేనూ పడిపోతాను, పంత్ ఉండగా దారి కొంచెం సులభ సాధ్యంగా ఉండేది. ఇప్పుడైతే ఆలోచిస్తేనే అలసట వచ్చేస్తూంది."

నిరాలాజీ విషయంలో మాత్రం ఆయన సుహృద్భావం, ఆయన వ్యతిరేకత (శ్రీ పంత్ పట్ల నిరాలాజీకి కొంత స్పర్ధాభావం కూడా ఉండేది) రెండూ ఒకే ఆత్మీయతాభావ తొడిమపైన విచ్చిన రెండు పుష్పాలు. అవి విచ్చినపుడు ఆ తొడిమను శోభాయమానంగానూ చేస్తాయి, రాలిపోయి దాన్ని ఒంటరిగానూ, శూన్యంగానూ చేస్తాయి. మిత్రుడే ఎందుకు? తన కొరతతో ఆయన్ను వ్యాకులపరచని విరోధి కూడా ఎవరూ లేరు.

శిథిల శరీరంతో, అలసిన మనసుతో, ఉన్న నిరాలాజీ మాసిన, చినిగిన అధోవస్త్రం చుట్టుకొని, అలాంటిదే పాతబడి పిగిలిపోయిన ఉత్తరీయం పైన వేసుకొని మట్టి కొట్టుకున్న కాళ్ళతో నా ఇంటి ద్వారం ఎదుటికి వచ్చి నిలబడ్డాడు. ఆయన రచించిన 'అపరా' అనే కవితా సంపుటికి 2100 రూపాయల బహుమతి వచ్చినట్లు తెలిసిన తర్వాత ఆయన నేను నడిపే సంస్థ తరఫున ఆ డబ్బు తెప్పించి పెట్టమని కొద్దిరోజులు మునుపు నన్ను కోరి ఉండినాడు. ఇప్పుడు ఆయన కీర్తి శేషులు మున్షీ నవజాతిక్ లాల్ భార్యకు ప్రతినెలా యాభై రూపాయల చొప్పున పంపే ఏర్పాటు చేయమని చెప్పడానికి వచ్చాడు.

'ఆ డబ్బులో కొంత భాగమైనా మీరు మీ స్వంత అవసరాలకోసం వాడుకోవచ్చు కదా' అన్న ప్రశ్నకు అదే సరళతతో జవాబిచ్చాడు-- "అది సంకల్పం చేసిన డబ్బు. దాన్ని నా కోసం వాడుకోవడం మంచిది కాదు." ఆయన జీవితాన్ని క్రమబద్ధం చేసేందుకు నేను చేసిన ప్రయత్నాలన్నీ విఫలమైనాయి. అయితే ఈ రోజు దాన్ని గురించి నాకు చింతలేదు. ఒకవేళ ఆయన జీవితం మనం కల్పించుకున్న మూసలో ఇమిడిపోతే ఇక ఆయన ప్రత్యేకతేముంటుంది?

ఒక పూటే భోజనం చేయడం, స్వయంగా వంట చేసుకోవడం లాంటి ఆయన పాటించే నియమ-నిష్ఠలకు నేను అలవాటు పడ్డాను. ప్రశ్నలకు జవాబివ్వడంలో నిరాలాజీలో సహనం తక్కువగా ఉండేది. నా మౌనంలో నుంచి కూడా పెద్దగా వినిపిస్తూ ఉండిన దిగులు కారణంగానే ఆయన తన ఉద్దేశ్యాన్ని స్పష్టంగా చెప్పాడు- "ఇక నేను సన్యాసం తీసుకుంటాను" అని. నేను ఆలోచిస్తూ ఉండగానే చిరంజీవి వసంత్ నవ్వుతూ ఇలా అన్నాడు : "అలా అయితే ఇక మీరు మధుకరీ (సన్యాసులు భిక్షలో స్వీకరించదగిన వండిన అన్నం) తినవలసి ఉంటుంది కదా!"

విచారంగానీ, పశ్చాత్తాపంగానీ ఏ మాత్రం లేని వినోద – ప్రశాంత భావంతో నిరాలాజీ ఇలా అన్నాడు : "మధుకరీ ఇప్పుడు కూడా తింటూనే ఉన్నాను కదా!" ఎవరు ప్రసాదించిన అక్షయ నిధులతో సాహిత్య భాండాగారం సుసంపన్నమై ఉందో, ఆయన భిక్షాటన చేస్తూ జీవితం సాగించాడనే చేదు నిజాన్ని భావి తరాలు నమ్ముతాయా? చెప్పడం కష్టం. కానీ ఒక ఏకాదశినాడు ఉదయం స్నానం, హోమం వగైరా ముగించి బయలుదేరేప్పటికి ఆయన కాషాయ వస్త్రాలు ధరించి ఉన్నాడు. పై పంచె లేకపోవడం వల్లా, వస్త్రాలు చాలా ముదురు రంగులో ఉండడంవల్లా ఆయన చేతులు, ముఖము వగైరా మాత్రమే కాదు, ఆయన విశాల శరీరం కూడా కాషాయంగా మారిపోయి నులివెచ్చని ఎండలో మెరిసే ఒక ఎర్రమట్టి కొండ శిఖరం లాగా ఆయన కనిపించాడు.

ఆయన అన్నాడు : "ఇప్పుడు బాగుంది. ఎక్కడికి పోయినా, ఒక వేపచెట్టు క్రిందో, రావి చెట్టు క్రిందో, కూర్చోవడం, రెండు ముద్దలు అడుక్కొని తినడం, పాటలు-పద్యాలు రాయడం చేస్తే సరి!" ఈ సరికొత్త అధ్యాయం ఎప్పుడు, ఎలా ముగుస్తుందో, అని ఆలోచిస్తూ నేనన్నాను, "మీరు సన్యాసం తీసుకోవడం వల్ల నాకు కలిగే లాభం ఒకటే. మీ సబ్బుకయ్యే డబ్బులు మిగులుతాయి. కాషాయ వస్త్రాలు మాసినట్లు కనిపించవు.

నిరాలాజీ తన శరీరం, జీవితం, సాహిత్యం, అన్నింటిలోనూ అసాధారాణమైనవాడే ('నిరాలా' అంటేనే విచిత్రమైన, అసాధారణమైన అని అర్థం). పరస్పర విరుద్ధమైన అంశాలు కూడా ఆయనలో సామంజస్యంతో కలిసి ఉంటాయి. ఆయన ఒడ్డు-పొడవు చూసే వాళ్ళ మనసులో బెదురు పుట్టిస్తే, ఆయన ముఖంలోని సరళ ఆత్మీయత ఆ బెదురును మటుమాయం చేస్తూ ఉంటుంది. ఆయన దృష్టిలో దర్పం, విశ్వాసం, రెండింటి వెలుగు-నీడలు కలిసి ఉంటాయి. ఆ దర్పానికి ఏదో చౌకబారు మానసిక ప్రవృత్తితో ఏ సంబంధమూ

ఉండదు. దాన్ని అహంకారం యొక్క వెకిలి ప్రదర్శన అని కూడా అనడానికి వీలులేదు. నిర్విరామంగా పోరాటం చేయడంవల్ల, నిరంతరంగా వ్యతిరేకతను ఎదుర్కోవలసి వచ్చినందువల్ల ఆయనలో జన్మించిన ఒక రకమైన ఆత్మస్థైర్యాన్నే దర్పంతో కూడిన ఆయన దృష్టిలో చూస్తాం.

ఒక్కోసారి ఆ దర్పం వ్యక్తి పరిధిని దాటి ఎంతగా వ్యాప్తి చెందుతూ పోతుందంటే దాన్ని మనం, మనందరిదీ అని, ప్రతి సాహిత్యకారునికి చెందిందనీ, మొత్తం సాహిత్యానికి సంబంధించిందనీ భావించవచ్చు. అందువల్ల ఆ దర్పం ఎప్పుడే గాని భరించరానిదిగా అనిపించదు. ఏ గొప్పతనంలో మనకూ కొంత భాగం ఉంటుందో, దాన్ని ఇతరుల్లో చూసినప్పుడు అది మనలో అల్పత్వానుభూతిని కలిగించదు. అందువల్ల దానితో మనకు విరోధం కూడా ఎప్పుడూ కలగదు. ఇతరుల మాటలు నమ్మకుండా వాళ్ళ రహస్యాన్ని పరిశీలించి ఛేదించే తీక్షణ సందేహ దృష్టి నిరాలాజీలో లేదు. ఆయన చూపులో సహజ విశ్వాసం తొణికిసలాడుతూంటుంది. ఒక వ్యక్తి తన గురించి ఏమి చెప్పడానికి ఇష్టపడతాడో, అది మాత్రమే సత్యమని భావిస్తూ ఆయన ఎంతదాకా వెళ్ళిపోతాడంటే ఆ వ్యక్తి నిజం తప్ప మరేదీ చెప్పడానికి ఇష్టపడడు.

లౌకిక దృష్టితో చూసినప్పుడు మానవ హృదయంలోని పరమ నిగూఢమైన భావాలను విశ్లేషించే సామర్థ్యం కలిగిన ఒక కళాకారునిలో ఇలాంటి సరళత ఆశ్చర్యం కలిగించేదిగా ఉండవచ్చు. అయితే కళాసృష్టికి ఇది అతి సహజమైన సాధనం.

ఒక అన్యాయానికి ప్రతీకారం చేయడానికి ఆయన కలం కంటే ముందు ఆయన చెయ్యే పైకి లేయవచ్చు, లేదా కలమే చెయ్యికంటే కూడా బలమైన దెబ్బకొట్టవచ్చు. అయితే ఆయన కళ్ళలోని స్వచ్ఛత పైన ద్వేషం యొక్క మలిన ఛాయ మాత్రం ఎన్నడూ కనిపించదు.

క్రూరత్వం, భయం రెండింటి సంబంధం చెట్టు వ్రేళ్ళల్లో అవ్యక్తంగా ఉండే రసానికి, ఆ చెట్టు ఫలంలో వ్యక్తమయ్యే రుచికి ఉండే సంబంధం లాంటిది. నిరాలాకు ఎవరన్నా భయంలేదు. అందువల్ల ఎవరిపట్లనైనా క్రూరంగా ఉండడం ఆయనకు చేతకాని పని. విద్యుల్లత లాంటి తీక్షణమైన ఆయన వ్యంగ్యం వెనక సుహృద్భావ జలంతో నిండిన మేఘం ఉంటుంది. ద్వేషం మనిషి అసమర్థతకు నిదర్శనం. దేన్నుంచి మనలను రక్షించుకోడానికి అప్రమత్తంగా ఉంటామో, దాని పట్లనే మనకు ద్వేషం ఉండగలుగుతుంది. మధు పాత్రను పగలగొట్టి పారేయగలిగిన వానికి మదిర పట్ల ద్వేషం ఉంచుకోవలసిన పనేముంది? కానీ ఎవరైతే అది లేకుండా ఉండలేక, దాన్నుంచి తప్పించుకొనేందుకు కావలసిన మనోస్థైర్యాన్ని కూడ దీసుకోవాలని అనుకుంటాడో, అతడు దాని దోషాల ఇటుకలను ఒక్కోదాన్నీ పేర్చి, వాటిపైన ద్వేషం యొక్క నల్లరంగు పూసి, తనకు రక్షణగా ఒక గోడను నిర్మించుకుంటాడు. మన నరక కల్పన మూలంలో కూడా మనలను కాపాడుకొనే ఈ నిస్సహాయ ప్రయత్నమే ఉంది. సంరక్షింపబడిన భయం లేకపోతే సురక్షితమైన ద్వేషం ఉండడానికి వీలు లేదు.

ఉన్నతి పథంలో ఎదురయ్యే కష్టాల గురించిన అవగాహనే గొప్ప విప్లవకారులకు వారి బాటలో ప్రేరణనిస్తుంది. నిరాలాజీ ఆలోచనల్లో అతీంద్రియ దృష్టి కలవాడైతే ఆచరణలో విప్లవకారుడు. తేలిక వస్తువులతో పాటు బరువైన వస్తువులను కూడా ఎగురవేసుకొని పోయే ఝంఝానిలం లాంటి వాడాయన. సుగంధం లభించకపోతే దుర్గంధ భారాన్నైనా సరే మోసుకు పోయే మందసమీరం లాంటివాడు కాదు. దేన్నైతే ఆయన నిరుపయోగమైందిగా భావిస్తాడో, దానిపట్ల ఆయనకు రవంత కుండా మమకారం ఉండదు. బద్దలు కొట్టవలసిన వస్తువులతోపాటు సురక్షితంగా ఉంచవలసిన వస్తువులు కూడా ధ్వంసమై పోయినా ఆయనకు చింతలేదు.

మనిషిలోని సంచయ ప్రవృత్తి కారణంగా అతడు ఉపయోగం లేని వస్తువులను కూడా ప్రోగుచేసుకొని ఉండాలనుకుంటాడు. ఈ స్వభావం వల్లనే అనేక కరుడుగట్టిన సంప్రదాయాలు కూడా అతని జీవితంలో ఏదో కొరతను పూరిస్తున్నట్లు కనిపిస్తుంటాయి. తిరుగుబాటుతనం నిరాలాజీ స్వభావంలోనే ఉండడం వల్ల ఇలాంటి కరుడుగట్టిన సంప్రదాయాలపైన దెబ్బకొట్టడం ఆయనకు ఎంత సునాయాసమైన పనిగా కనిపిస్తుందో, అంతే చిత్రంగానూ కనిపిస్తుంది. ఇతరుల్లో దృఢంగా పాతుకు పోయిన గుడ్డి నమ్మకాలపైన దెబ్బకొట్టి వాళ్ళు ఉక్రోశ పడినప్పుడు ఆయన హోలీ పండగ రోజున ఒకరి మూడు కాళ్ళ కుర్చీతో పాటు మరొకరి సర్వాంగ సంపూర్ణమైన మంచాన్ని, ఇంకొకరి విరిగిన టీపాయ్‌తోపాటు మరొకరి కొత్త మేజాను హోలికాగ్నిలో స్వాహా చేసిన తుంటరి పిల్లవాని లాగా సంతోషించేవాడు.

మిగతా 18వ పుటలో....



New Delhi,
March 13, 1954.

My dear Krishna,

I wonder if you know the case of Nirala, a Hindi poet of Allahabad. He has done good work in the past and even now sometimes writes well in his lucid moments. Often he is not lucid at all. His old books are popular and some, I believe, are text-books. But, in his folly or extremity, he has sold all those books for a song to various publishers getting just 25 or 30 or 50 rupees for a book. The whole copyright was supposed to be sold. Publishers have made large sums of money and continue to make it and he gets nothing for it and practically starves. This is a scandalous case of a publisher exploiting a writer shamelessly. Personally I think that, even in strict law, this kind of arrangement might be capable of being challenged.

Anyhow, this leads me to say that our Akadamy should immediately think about an amendment of the copyright law. Some attempts were made, I remember, by me a year or two ago and I wrote to our Law Ministry, but nothing much came of it. I think you might collect material for this and prepare a note.

Meanwhile, Nirala deserves some financial help. It is no good giving the help to him directly because he gives it away to others immediately. In fact, he gives away his clothes, his last shirt and everything. Mahadevi Verma and some others in Allahabad of a Literary Association there try to look after him and give him some money too. I think we should arrange to pay Rs.100/- a month for him and this money should be sent to Mahadevi Verma.

This might well be out of the fund which the Education Ministry has for such purposes. Will you please mention this case to Maulana Saheb and, if he agrees, his Ministry can process it.

You can get more particulars about Nirala from Mahadevi Verma.

Yours sincerely,

Jawaharlal Nehru

Shri Krishna Kripalani,
Secretary, Sahitya Akadamy,
35/1 Ferozeshah Road,
New Delhi.

My dear Panditji,

I have shown your letter of March 13, regarding the Hindi poet Nirala, to Maulana Saheb who has agreed that a sum of Rs.100/- a month should be sanctioned for him and paid to Srimati Mahadevi Verma. The Ministry of Education has been asked to take the necessary action in this matter.

As regards amendment of the copyright law, I have discussed the matter with Shri Humayun Kabir who assures me that the matter is already under consideration of the Education Ministry which has set up a committee to suggest the necessary amendments. The file is at present with the Home Ministry. As soon as the file is received back the Committee will be asked to give special consideration to the point suggested by you. In the meanwhile I shall try to collect further material on this subject.

Yours sincerely,

( K.R. Kripalani )

Shri Jawaharlal Nehru,
Prime Minister,

NEW DELHI.

15వ పుట తరువాయి...

## భాయీ నిరాలా

ఆయన వ్యతిరేకత ద్వేష పూరితమైంది కాదు. అయితే దెబ్బ మాత్రం బలంగా పడుతుంది. అంతేకాక ఆయన సంకల్పానికి, ఆయన చేసే కర్మకు మధ్య సంకల్పం యొక్క ఔచిత్యాన్ని, కర్మయొక్క సౌందర్యాన్ని వ్యాఖ్యానించేందుకు ప్రత్యక్షంగా కనిపించే లింకులు ఉండవు.

ఆయన్ను అర్థం చేసుకునేందుకు బౌద్ధికత ఎంత అవసరమవుతుందో, హృదయం యొక్క సంవేదనశీలత కూడా అంతే అవసరం. అలాంటి సమతూక దృష్టి దుర్లభం కాబట్టి ఆయన్ను పూర్తిగా అర్థం చేసుకున్నవాళ్ళు అరుదుగానే కనిపిస్తారు.

ఆయన వినమ్ర ఉదారతను ఎంత పొగిడినా తక్కువే అనే వాళ్ళు ఎంతమంది ఉంటారో, ఆయన ఉద్దండ ప్రవర్తనను ఎంత నిందించినా తక్కువే అనే వాళ్ళు కూడా అంతేమంది ఉంటారు.

మానవజాతి అవివేక చరిత్ర చాలా క్రూరమైంది, చాలా విస్తృతమైంది కూడా. దాదాపు అన్ని యుగాల్లో మానవుడు తమలో శ్రేష్ఠతముడైన వ్యక్తిని తనకర్థం కాలేదనే కారణంగా ఒక్కోసారి బహిష్కరించి, ఒక్కోసారి విషమిచ్చి, ఒక్కోసారి ఉరికంబమెక్కించి మరోసారి తుపాకి గుండుకు గురిచేసి, క్రూరత్వం, మూర్ఖత్వం కలగలిసిన తన చరిత్రలో కొత్త పుటలు జోడించాడు. నిరాలాజీ తన యుగంలోని విశిష్టమైన ప్రతిభావంతుడు. అందువల్ల తన యుగం ఇచ్చిన శాపం ఆయన కూడా సహించవలసి రావడంలో ఆశ్చర్యం ఏమీలేదు.

సమాజంలో బయటి దెబ్బలను ఆపే డాలుగా ఉపకరించే కుటుంబం యొక్క రక్షక వలయం ఆయన జీవితం చుట్టూ లేదు. ఆయన శైశవం కూడా తల్లి, సోదరి, సోదరుడు మొదలైన వారి కోమల సాహచర్య లేమిలోనే గడిచింది. జీవన వసంతం కూడా భార్యా వియోగం కారణంగా ఆయనకు ఆకు రాలుకాలమే అయింది. ఆర్థిక కారణాలు మాతృహీనమైన తన సంతానం పట్ల కర్తవ్యం నెరవేర్చే సదుపాయం ఆయనకు ఇవ్వలేదు. కూతురి అంతిమ క్షణాల్లో అసహాయ ప్రేక్షకుడుగానే ఆయన ఉండిపోయాడు. కుమారునికి తగిన విద్య చెప్పించలేక పోయినందువల్ల అతని ఉపేక్షకు గురి అయ్యాడు.

ప్రతికూల పరిస్థితులను సహించగలగడానికి మనం అంగీకరించే 'రాజీ' అనే ఓటమిని ఆయన ఎన్నడూ అంగీకరించలేదు. సహజంగా ఆయనకబ్బిన అచంచల శూరత్వం ఆత్మరక్షణా ప్రయత్నాన్ని కూడా పిరికితనమే అంటుంది. ఆయన ఈ శూరత్వం రాజకీయ చతురత కాదు. అది అచంచల సాహిత్య దీక్షకు మరోపేరు. కపట వ్యూహం అండతో లక్ష్యాన్ని చేరడాన్ని సాహిత్యం లక్ష్య సాధనగా భావించదు.

తన మార్గంలోని అన్ని ప్రత్యక్ష - పరోక్ష ఆటంకాలను సవాలుచేస్తూ, అన్ని దెబ్బలను హృదయంపైన సహిస్తూ ఎవరైతే లక్ష్యం దాకా చేరుతాడో అతన్నే యుగకర్త అయిన సాహిత్యకారునిగా మనం భావించగలం. నిరాలాజీ అలాంటి విప్లవకారుడైన సాహిత్యకారుడే. ఏ అనుభవాల కాటువలన విషం సామాన్య మానవుని ఆత్మను మూర్ఛిల్ల చేసి అతని జీవితాన్నంతా విషమయం చేసేస్తుందో, దాన్నుంచే ఆయన సంతత జాగరూకతను, మానవతామృతాన్ని పొందాడు.

ఏ ఒక్కరి వ్యథ కూడా ఆయన హృదయంలో గంభీరమైన ప్రతిధ్వని పుట్టించలేనంత తేలికపాటిది కాదు, ఏ ఒక్కరి అక్కర కూడా ఆయనకు తన సర్వస్వాన్నీ దానం చేయడానికి ప్రేరణ కలిగించలేనంత చిన్నదీ కాదు.

తన అమూల్యతకు తోడుగా నిలిచేందుకు బంగారం గానీ, తన సౌందర్యాన్ని ప్రతిష్ఠింప చేసుకోడానికి ఒక ఆభరణ రూపంగానీ అవసరమయ్యే ఏదో దుర్లభమైన ముత్యపు చిప్పలోని సర్వాంగ సుందరమైన ముత్యం కాదు నిరాలాజీ. విశాలమైన మోటు పరుసవేది శిల ఆయన. ఇతరుల విలువ పెంచడంలోనే పరసవేది విలువ ఉంది. పరసవేది విలువను ఎవరు పెంచనూ లేదు, తగ్గించనూ లేదు. సాహిత్యకారుని జీవితాన్ని విశ్లేషించడం అతని సాహిత్యానికి విలువ కట్టడం కంటే కష్టమైన పని. సాహిత్యానికి గీటురాయి అందరూ అంగీకరించేదిగా ఉంటుంది. కానీ ఆ సాహిత్యానికి సారవంతమైన భూమిగా ఉండే అతని జీవితం విమర్శకుని ప్రత్యేకమైన దృష్టి బిందువుకు మూడు పువ్వులు, ఆరు కాయలుగా విస్తరిల్లే అవకాశం ఇవ్వగలుగుతుంది.

అందువల్లనే గొప్ప కళాకారుల యథార్థ చిత్రాలు అనేక విధాలుగా వ్యాఖ్యానింపబడడం ఆశ్చర్యం కలిగించే విషయం కాదు. ❁



## కృష్ణాపత్రిక కర్త

# ముట్నూరి కృష్ణారావు

- యు.ఎ.నరసింహమూర్తి

ముట్నూరి కృష్ణారావు తెలుగు పత్రికా సంపాదకులలో భీష్మాచార్యుని వంటివాడు. కృష్ణాపత్రిక అతని కీర్తిపతాక. ముట్నూరివారి సంపాదకీయాలకు ఆధునిక తెలుగు సాహిత్యంలో ఒక విశిష్టస్థానం ఏర్పడింది. దినపత్రిక సంపాదకీయాలకు వార, పక్ష, మాసపత్రికల సంపాదకీయాలకు మౌలికమైన భేదమొకటి ఉంటుంది. దినపత్రిక సంపాదకీయం నన్నయగారు చెప్పినట్లు "సకలగమ్య సుతీర్థమై" ఉండాలి. అవి వార్తా ప్రధానములైనవి. కళా సాంస్కృతిక విద్యా, వైజ్ఞానికాది సమస్త సామాజిక విషయాలతో పాటు సాహిత్యప్రధానాలైన పత్రికల సంపాదకీయాలు జనరంజకాలుగా ఉంటూనే పాఠకుల సర్వతోముఖ వికాసానికి ఉపకరించే వివిధ శైలీవిన్యాసాలతో ఉండవచ్చును. ముట్నూరి కృష్ణారావు ప్రజ్ఞ సర్వంకషమైనది. అందునా ఆధ్యాత్మిక విషయ బోధతో బహునిపుణమైనది. సంపాదకీయాలలో ఉపయోగించదగిన శైలీలక్షణాలను గూర్చి వారు ప్రత్యక్షంగా కాకపోయినా రైటానరబుల్ శ్రీనివాసశాస్త్రి ఉపన్యాసశైలిని విశ్లేషించే సందర్భంలో పరోక్షంగా తెలియజేశారు.

"చక్కటి పదప్రయోగము, వాక్య విన్యాసము, నిర్దుష్టశైలి, వ్యాకరణ విశేషములు, అలంకార సౌష్ఠవము మొదలగు శాబ్దిక చాతుర్యము సామాన్యముగా నీ యుపాధ్యాయుల సొమ్మై యుండును." (శ్రీనివాసశాస్త్రి, 2-7-1921) ఉపన్యాసశైలి ఎలాగుండాలో ప్రాచీన గ్రీకు, రోమన్ రచయితలు చెప్పిన బాటలోనే ఇక్కడ అధ్యాపకశైలిని గూర్చి ముట్నూరివారు వివరించారు. శైలికి రూపమేకాదు, ఆత్మకూడా ఉంటుందని ముట్నూరి సూచనప్రాయంగా ఇలా తెలియజేశారు. పై సంపాదకీయంలోనే శ్రీనివాసశాస్త్రి ఉపన్యాసశైలిలో ఉండే లోపాలను ముట్నూరి ఇలా ఎత్తి చూపించారు.

"వానిలో చిత్త సంస్కారమగు భావములుగాని, సంశయములను బారద్రోలు తర్కముగాని, క్రొత్తమార్గములను దీయు ఊహాలుగాని, ఒక సిద్ధాంతము బలపరచు హేతువాదము గాని, కనుపడదు. చక్కటి పద ప్రయోగములు, సమాసముల కూర్పు, పునరుక్తి దోషములను గప్పిపుచ్చు వాక్యవిన్యాసము - ఇవి తప్ప యింకొకటి గనుపించదు."

పై వాక్యాల వలన రసభావాలు, తర్కము, హేతు వాదము, ఊహ, భావన వంటి లక్షణాలు శైలికి ఆత్మస్థానీయాలని; పదప్రయోగము, సమాసములకూర్పు, వాక్యవిన్యాసము, వంటివి శైలికి రూపాన్నిస్తాయని ముట్నూరి వారు భావించినట్లు తెలుస్తుంది.

1905 నుండి 1941 వరకు ముట్నూరి కృష్ణారావుగారి సంపాదకీయాలు లభిస్తున్నాయి. ఈ సంపాదకీయాల శైలి ఏకరాశిగా ఉండదు. చాలా వ్యత్యాసాలతో కూడి ఉంటుంది. విషయ ప్రకటనంలోను, తాత్త్విక గాంభీర్యంలోను ఉదార ఆశయాలతోను, నిశిత విమర్శతోను నిండిన ఈ సంపాదకుని ఆత్మ ఒకరీతిగా ఉన్నా, రూపంలో మాత్రం ప్రారంభశైలికి, పరిణతశైలికి మధ్య ఎంతో భేదం కనిపిస్తుంది. ముట్నూరి వారు గ్రాంథికవాది. వీరి సంపాదకీయాలన్నీ ఇంచుమించుగా

యు.ఎ.నరసింహమూర్తి, ఫోన్ : 9963421460

గ్రాంథికశైలిలోనే ఉన్నాయి. ప్రారంభ రచనలన్నింటిలో బరువైన గ్రాంథికం, కాల్పనిక ధోరణి, సంస్కృతాంధ్ర ప్రభావంతో కూడిన వాక్యవిన్యాసం, దీర్ఘసంస్కృత సమాసాలతో కూడిన నాలుగైదు పంక్తులు వాక్యాలు కనిపిస్తూ ఉంటాయి. అరుదుగా మారుమూల ప్రయోగాలు కూడా ఉంటాయి. పరిణతశైలి వాస్తవికతకు నిబద్ధమై సరళ గ్రాంథికంలో చిన్న చిన్న నిశ్చితార్థక వాక్యాలతో శక్తివంతములు, గంభీరములు, తాత్త్వికములు అయిన వాక్యాలతో, నిశిత విమర్శతో ఖండితశైలితో ఉంటాయి. ఈ సంపాదకీయాలే ఆయనకు శాశ్వతకీర్తిని సంపాదించినవి. "సాధన సాధ్యములు పరస్పరము సహకారకములు". (పండిత జవహర్‌లాల్ 8-2-1936)

"పాశ్చాత్య తత్త్వశాస్త్రము మనోరాజ్యము నతిక్రమించలేదు".

"కార్య కారణముల కతీతమైన పరమతత్త్వము యోగసాధకులకే లభ్యము".

"ఆ విధేయత వివేకానందుని యందు పూర్తిగ మూర్తీభవించినది. ఇయ్యది ఆధునిక కాలము యొక్క లక్షణము".

"భారతవర్ష సభ్యత పరప్రకృతిపై నెలకొల్పబడుటకు బ్రయత్నింపబడినది". ( పూర్వ పాశ్చాత్య సమన్వయము.)

"మానవుని పరిణతావస్థయే దేవత్వము".
(గాంధి-రవీంద్రులు 14-5-1921)

"సత్యము సామంజస్యము యొక్క రూపాంతరము".
(14-5-1921)

"ఆత్మసౌరభము మాటలకు పట్టుబడునది కాదు".
(రఘుపతి వెంకటరత్నం నాయుడు, 23-11-1929)

ఇలాంటి వాక్యాలు ముట్నూరి వారి పరిణతశైలిలో ఎక్కడ చూసినా కనిపిస్తాయి. సరళత, సంక్షిప్తత ఈ వాక్యాలకు బలాన్నిచ్చాయి. చూడడానికివి చాలా చిన్నవాక్యాలుగా కనిపిస్తాయి. తరచినకొద్దీ పెరిగే మహార్థం ఇందులోని ప్రతివ్యాకంలోను ఇమిడి ఉంది. ఈ వాక్యాలు సామాన్యులకు చేరువలో లేవు. ఆధ్యాత్మ విద్యాసంపన్నులు మాత్రం వీటిని అర్థం చేసుకోగలరు. తన సంపాదకీయశైలితో తెలుగువారికి ఆ సంపన్నత కలిగించాలని ముట్నూరి వారి ఆశయం.

కేవలం ఇటువంటి చిన్న వాక్యాలే కాక పదగుంఫనతో కూడిన పెద్దవాక్యాలు కూడా వీరి పరిణతశైలిలో కనిపిస్తాయి. "వార్ధక్యమున దృష్టి మందగించుచున్న కొలది, అవయవముల పుష్టి తగ్గుచున్నకొలది, జరాభారము హెచ్చుచున్నకొలది, శరీరము పండువలె వ్రాలుటకు సమీపించిన కొలది నౌరోజిగారి యాత్మ నిర్మలమై, శాంతి వంతమై, తేజోవిలసితమై, భారతజనని యొక్క విగ్రహమును ప్రతిఫలింపజేయుచున్నది. ఇట్టి మహనీయులకు వృద్ధాప్య మేద?" (నౌరోజీవర్ధంతి, 6-9-1913)

పై వాక్యంలో ఆరంభంతో వరుసగా నాలుగు సమానప్రమాణం గల వాక్యాంశాలు, ముగింపులో వరుసగా మూడు సమానప్రమాణం గల పదాలు కూర్చడం జరిగింది. వాక్యంలోని వేగాన్ని, సమతూకాన్ని పెంచే ఈ శైలిని" పదగుంఫన శైలి అంటారు. దీనిని ఇంకా రమ్యతరం చేయాలనుకున్న రచయిత ఆరంభంలో ఉన్న నాలుగు వాక్యాంశాలకు క్రమంగా సమర్థంగా ఉంటే నాలుగు పదాలను ముగింపుతో ఉపయోగిస్తూ ఈ వాక్యంలో కనిపించే వేగానికి మరికొంత తూగును, ఊపును జతచేస్తాడు.

ముట్నూరి వీరేశలింగం మరణించిన తరువాత రాసిన సంపాదకీయశైలిని (31-5-1919), కృష్ణశాస్త్రి వీరేశలింగంపై రాసిన వ్యాసాన్ని, తులనాత్మకంగా పరిశీలించిన వారికి, వాస్తవిక వాదశైలికి, కాల్పనికశైలికి గల భేదం, సరళశైలికి, అలంకారిక శైలికి గల వ్యత్యాసం తెలుస్తుంది. గురజాడ మరణానంతరం ఆయన వాదాన్ని, ఆయన రచనలను పరిపూర్ణంగా సమర్థిస్తూ, శ్లాఘిస్తూ ముట్నూరి ఒక సంపాదకీయం రాసారు. కానీ ఈ సమర్థనమంతా గ్రాంథిక శైలిలో ఉండడం ఒక విరోధాభాసంగా కనిపిస్తుంది. జవహర్‌లాల్ కాంగ్రెస్ అధ్యక్షుడైన సందర్భంలో ముట్నూరి "అలతి అలతి తునియల కాహళ సందించిన రీతి" తిక్కనగారి శైలీమార్గాన్ని తలపించేలా ఒక సంపాదకీయాన్ని (8-2-1936) రాశారు.

"జవహర్‌లాలు తత్వము మాట్లాడదు. వైరాగ్యము బోధింపదు. కవితలుసెప్పదు. సభ్యతలను విమర్శింపదు. కేవలము ఒకటే మాట-సూటి అయిన మాట - నసాళమునకు అంటే మాట. ఎట్టి రాజ్యతంత్రజ్ఞుని అయినను తలవంచుకొనునట్లు చేయగలమాట".

మూడు నాలుగు పదాలకు మించిన వాక్యాలు ఇక్కడ లేవు. ఇటువంటి రచన శైలికొక బిగువును కూరుస్తుంది. ఒక ఉత్కంఠను పుట్టిస్తుంది. ప్రశంసలో కంటే విమర్శలో ముట్నూరి శైలి ఇంకా పదునెక్కుతుంది. సహేతుకము, జాతీయవాద పూరితము, నిర్వ్యాజ్యము, అకలుషము, సత్య నిష్ఠము అయిన ముట్నూరి విమర్శధాటికి వివేకానందుడు, శ్రీనివాస శాస్త్రి, కట్టమంచి రామలింగారెడ్డి, వాయిడ్ జార్జి-వంటి మహా మహులు కూడా నిలువ లేకపోయారు.

ఇటువంటి సందర్భా లలో నిష్కర్షతో కూడిన ఖండితశైలిని మాత్రమే కాక వెటకారం (Sarasm) నిండిన హాస్య శైలిని కూడా ముట్నూరి ఉపయో గించడం మనం చూస్తాం.

"శ్వేత ద్వీపవాసుల పవిత్రభాషలో, బ్రిటిషు సచివ రేణ్యుల సమ్ముఖమున దిగ్భ్రమ జెందునట్లు వాక్చాతుర్యమును ప్రదర్శించిన శ్రీనివాస శాస్త్రి భారత వర్షము యొక్క కీర్తి చంద్రికలను రవియస్తమింపని అఖండ బ్రిటిషు సామ్రాజ్యము నందంతట విస్తరిల్లునట్లు చేసి ధన్యులై నందుకు ముప్పదికోట్లు భారతీయుల పక్షముననను వారికి నమ స్కరించు చున్నాము".




బ్రిటిష్ పార్లమెంటులో బ్రిటిష్‌వారిపట్ల తనకుగల అత్యంత విధేయతను ప్రదర్శిస్తూ వారికి ఆనందం కలిగించడమే ధ్యేయంగా రసవత్తరంగా ఉపన్యసించి వారి ప్రశంసల నందుకొన్న శ్రీనివాసశాస్త్రి బానిస బుద్ధిని ఖండిస్తూ రాసిన ఈ వాక్యంలోని ప్రతి పదం వెనుక మోయలేనంత వెటకారం దాగి ఉంది.

ఈ వెటకారాన్ని విడిచి పెట్టి ఖండితశైలిలో "వీరికి వచ్చినది ఇంగ్లీషుభాష. అందు పండితులు హర్షించునట్లుగా మాట్లాడగలరు. కాని భాషా ప్రాగల్భ్యమునకు దగిన విషయ పరిజ్ఞానము లేదు". - అని చెప్పిన తీరుగా సూటిగా విమర్శకు దిగిన సందర్భాలు ముట్నూరి సంపాదకీయాలలో ఎక్కువగా ఉన్నాయి.

బలమైన గ్రాంథికశైలిలో రాసే రోజులలో 'కాంగ్రెస్' అనే మాటకు బదులుగా 'మహాజనసభ' అనే సమాసాన్ని వాడుకచేసిన ముట్నూరి పరిణతదశలో తన సంపాదకీయాలలో ఇంగ్లీషు పదాలను ధారళంగా వాడారు.

"కాంగ్రెస్ నేదు ఫ్రెంచి విప్లవము నాటి లిబర్టీ, ఈక్వాలిటి, ఫ్రెటర్నిటీయను త్రిపుటికి ఆంటే-ఇంపీరియలిజము, ఆంటీ-కేపటలిజము, ఆంటీ-మిలిటరిజము అను ఉద్యమత్రయ రూపమున నవ్యభావము పూరించి లోకహితైషుల నెల్ల ఆందోళన పరచుచున్నది".

1936 నాటి విద్యావంతు లైన తెలుగువారి మనఃస్థితికి ఈ వాక్యం అద్దం పడుతుంది. ఇందులో తెలుగు పదాలు ఎక్కువగా ఉన్నా, ఇంగ్లీషు పదాలను తెలుగు చేయడం ఏమంత పెద్ద కష్టంకాదు. అయినా ముట్నూరి ఆపని చేయలేదు. ఏ పదాలు విద్యావంతులను సులభంగా ఆకర్షిస్తాయో, సుబోధకంగా ఉంటాయో వాటినే ఉపయోగించాలనే పూనికను ఆయన కనబరచారు.

ఒక వంక సంప్రదాయానికి చిహ్నంగా కనిపించే గ్రాంథికపదాలు, ఇంకొక వంక ఆధునికత ప్రభావంతో చొరబడ్డ ఆంగ్ల పదాలు కలగలసి ఇక్కడొక వింతశైలి ఏర్పడింది. "బుద్ధిగ్రాహ్య మంతీంద్రియమ్" వంటి సంస్కృత వాక్యాలు ముట్నూరివారి సంపాదకీయాలలో ఎక్కడో గాని కనబడవు.

ముట్నూరి కృష్ణారావుగారు పరిణతదశలో రాసిన సంపాదకీయాలలో కాల్పనికధోరణికి చెందిన తెగబారెడు వాక్యాలు రాయడం మాని విషయప్రధానంగా సంక్షేపంగా సూటిగా సరళంగా ఉండే చిన్న వాక్యాలతో కూడిన శైలిని అనుసరించారు.

సంస్కృత సమాసాల జోరు తగ్గింది. ఇంగ్లీషు పదాల హొరు పెరిగింది. అసహనమైన వాక్యాలతో పాటు వాక్యదోషాలు, పదదోషాలు తొలగిపోయాయి. గుణాత్మకమైన పరిణామం కారణంగా తెలుగుసాహిత్యంలో వాటికి స్థిరమైన స్థానం లభించింది. ❂

# వీరగంధము తెచ్చిన వీరులపాడు

*- పాటిబండ్ల వెంకటపతిరాయలు*



"మా ఊరి గురించి చెప్పడానికేముంది? ఇదో చిన్న ఊరు, దీనికి చరిత్రా? పాడా?" అంటూ నిర్లక్ష్యంతో తిరస్కార భావంతో మాటలాడే వారు మనలో ఎందరో ఉన్నారు. "నా తల్లిదండ్రులు, నావంశం, నా అభిజాత్యాన్ని సూచిస్తున్నట్లు, నా ఊరు గురించి కూడా నేను తెలుసుకోవాలి. దాని చారిత్రక ప్రాధాన్యతను వెలికి తీయాలి, ఆ మట్టిలో జన్మించినందుకు గర్వించాలి అంటూ నడుం బిగించారు పాటిబండ్ల వెంకట పతి రాయలు. మా ఊరికి ఈ పేరు ఎలా వచ్చింది? దీనిని ఎవరు ప్రతిష్ఠించారు? ఊరిలో జనవాసం ఎప్పటినుండి ఉంది? ఇలా ప్రాథమిక ప్రశ్నలు వేసుకుంటూ అన్వేషణ సాగించారు. ఎన్నో వివరాలను శాస్త్రీయంగా, ప్రణాళికా బద్ధంగా విశ్లేషిస్తూ గ్రామచరిత్రను పుస్తకంగా ఆవిష్కరించ గలిగారు.



కేవలం ఆరువందల తొంభై ఒక్క గడప గల్గిన ఈ ఊరు గురించి ఇంత శ్రమపడాలా? ఇంతకాలం వెచ్చించాలా అనే భ్రమలో ఎవరైనా ఉంటే మీరు ఆ పుస్తకం చదవండి. అది మీకు రిమ్మ తిరిగేలా సమాధానమిస్తుంది. ఊరి పేరు "వీరులపాడు" మరి ఇది ఈర్లపాడుగా ప్రభుత్వరికార్డులలో ఎందుకు రికార్డయింది? ఇలా మొదలయింది ఆ అన్వేషణ. ఒక ప్రదేశం గురించి తెలుసుకోవాలంటే అందుకు ముఖ్యమైన ఆధారాలు శాసనాలు, ఒక నాటి శిథిలాలు, ప్రాచీన రచనలలో వాటి ప్రస్తావన, ప్రభుత్వ రికార్డులు, ఆ ఊరిలో నివసిస్తున్న వృద్ధవాణి వాక్కులు, వీటన్నిటినుంచీ ఆయన విషయాలను సేకరించారు. ఎంతో ప్రాచీనమైన యీ జననివాస ప్రదేశంలో నేడున్న గ్రామాన్ని ఎవరు ప్రతిష్ఠించారు? ఇది మనముందు నిలచియున్న ప్రశ్న. దీనిని గొల్లలు ప్రతిష్ఠించారని వృద్ధవాణి చెప్పుచున్నది. ఒకపుడెపుడో గొల్లలు తమ గోవులతో, జీవాలతో ఈ ప్రదేశానికి వచ్చారట. ఆ ప్రదేశం చిలప అడవులతో, పచ్చికబయళ్ళతో ఉండడం, సమీపంలో కట్టెలేరు ప్రవహించడం గమనించి వారా ప్రదేశాన్ని నివాసానికి అనువైన ప్రదేశంగా నిర్ణయించు కొన్నారట. వెంటనే వారొక శుభముహూర్తాన బొడ్డురాయిని పాతి, గ్రామాన్ని ప్రతిష్ఠించి ఆ గ్రామానికి తమ పితృదేవతల పేరిట 'ఈర్లపాడు' అని నామకరణం చేసారట. ఇది నిజమోకాదో మనకు తెలియదు కాని, తెలిసేటంత వరకు మన మీ వృద్ధవాణినే నమ్మవలసి ఉంది.

పూర్వం మానవులు తెగలుగా జీవించుచుండేవారు. ఆ తెగలలో ఒక్కొక్క తెగకు ఒక్కొక్క నాయకుడుండేవాడు. ఆ తెగలోని వారందరు ఆ నాయకునకు ప్రథమస్థానాన్ని ఇచ్చి గౌరవించు చుండేవారు. తరువాత తెగల స్థానంలో కులాలకు ప్రాధాన్యం వచ్చింది. ఆ సమయంలో కులపెద్ద గౌరవించబడు చుండేవాడు. అటు తరువాత కుటుంబ పెద్దల కాస్థానం లభించింది. అప్పటినుండి మృతులైన ఆ పెద్దలను 'ఈర్లు'గా భావించి పూజించుచుండేవారు. ఈ సంప్రదాయం అన్ని కులాలలోను ఎంతో కొంత కన్పించుచుండేది. ఈ రచయిత బాల్యంలో కొత్తగా యీనిన గేదెపాలను చిలుకుటకై

పాటిబండ్ల వెంకటపతిరాయలు, ఫోన్ : 040-23548040

నూతనంగా కవ్వం కట్టబడినపుడు కమ్మవారిండ్లలో గూడ వీర్లు పెట్టుకొనుచుండేవారు. అందుచేత ఆనాడు గోపాలురైన గొల్లవారో మరొకరో ఆ గ్రామన్ని ప్రతిష్ఠించి, ఆ గ్రామానికి తమ పితృదేవతలపేరిట, ఈర్లపాడు లేక ఈరల్లపాడు అని నామకరణం చేసి తమ జీవనం కొనసాగించారని చెప్పవచ్చును.

ఆ ఊరి గురించి బోలెడంత ఫోక్‌లోర్ ఉంది. దానిని తీసుకున్నారు. వాటినుంచి వాస్తవాలను, వడగట్టారు. పుక్కిటి పురాణగాథలు ఆధార రహితంగా ఉంటే పక్కకు తోసేసారు. నిజాలను నిగ్గు తేల్చి మనముందుంచారు. ఈ పుస్తకానికి రాసిన ముందు మాటలో “వ్యక్తుల, స్థల, కాలనిర్ణయాలలో 5, 10 సంవత్సరాల తేడా యుండిన యుండవచ్చు. గానీ పూర్తి అసత్యాలు మాత్రం కానేరవు. వ్యక్తుల వ్యక్తి గతములైన గుణదోషాదులలో అవి ఊరి సాంఘిక జీవనంలో ప్రభావం చూపనంత వరకూ వానిని వదిలివేసి, వారాచరించదగిన కార్యక్రమాలకే ప్రాధాన్యతనిచ్చేను. కొందరు మిత్రులు నీగురించి విశేషాల నేమీ ఇందులో పేర్కొనలేదు! అది గ్రామచరిత్రకు లోపంకాదా అని ప్రశ్నించారు. “నన్ను గురించి నేను వ్రాసుకోడానికి నా మనస్సు అంగీకరించ లేదు. గ్రామ కార్యక్రమాలలో నాకుగల సంబంధమును, సందర్భాను సారంగా మాత్రమే వివరించాను” అని పేర్కొన్నారు. సందుదొరికితే సొంతడబ్బా కొట్టుకునే ఈ వ్యవస్థలో, గ్రామచరిత్ర పేరుతో ఆత్మకథను వ్రాసే స్వోత్కర్షను ఆమడ దూరంలో ఉంచారు.


వెంకటపతిరాయలు

ఈ గ్రామ చరిత్రను 1800 సం॥ అనగా వాసిరెడ్డి వెంకటాద్రి నాయుడు అమరావతీ సంస్థానాన్ని ఏలిన రోజులతో ప్రారంభించి 1990 సం॥తో ముగించారు. ఈస్టిండియా కంపెనీ పరిపాలన, బ్రిటిష్ వారి ప్రత్యక్ష పరిపాలన, స్వాతంత్ర్య పోరాటకాలం, తెలంగాణా రైతు ఉద్యమం, ఇలా అనేక ఉద్యమాలు, వాటి ప్రభావాన్ని ఆయన విశదపరిచారు. ప్రాచీన సంస్కృతిలోని ఉన్నత ఆశయాలను ఆయన గౌరవించారు. వర్తమానాన్ని ఆయన ఈసడించలేదు. శాస్త్రీయ ప్రగతిలోనున్న సౌలభ్యాలను ప్రశంసించారు. భూత వర్తమాన కాలంలోని విలువలకు ఆయన వారధిలా నిలిచారు. గ్రామీణ జీవితంలో ఉత్థానపతనాలను వివరించారు. దానితోపాటు గ్రామీణ జీవితంలో ఉన్న లోటుపాట్లను బయటకు తీశారు. అంతకంతకూ గ్రామాలను విడచి వలస పోతున్న మేధావుల నిష్క్రమణతో అంధవిశ్వాసం, మూఢనమ్మకాలు తిరిగి పునః ప్రతిష్ఠించ బడతాయని అందరినీ హెచ్చరించారు. పల్లెటూర్లలో క్రమేపీ ఆవరిస్తున్న నిస్తేజం నిస్పృహలపై ఆవేదన వ్యక్తం చేశారు.

అతిచిన్న గ్రామమైన వీరులపాడుకు ఘనమైన చరిత్ర ఉంది. వీరులపాడు తెలంగాణా ప్రాంత తీరంలో ఉండడముతో 1946-48 సంవత్సరముల మధ్య నడచిన తెలంగాణా రైతుల సాయుధ పోరాటానికి తోడ్పాటునిస్తూ తన వంతు పాత్రను పోషించింది. ఆ పోరాట కాలంలో తెలంగాణా, ఆంధ్రా రెండు ప్రాంతాలకు చెందిన నాయకులు తరుచుగా కలుసుకొంటూ; భవిష్యత్ కార్యాచరణపై చర్చించి నిర్ణయాలు తీసుకొనేవారు. అందుకే దీనిని 'రెడ్‌విలేజ్' అని పిలిచేవారు.

మొదట్లో గాంధీ అభ్యుదయ వాదానికి, తరువాత కమ్యూనిస్టు భావాలకు ఎలా, ఎందువల్ల ఆ ఊరిలోని ప్రజలలో మార్పు వచ్చిందో దానికి కారణాలేమిటో వివరించారు. భారతీయ రాజకీయరంగం త్యాగాన్ని వదలి పదవీవ్యామోహ దిశగా ఎలా దిగజారుతూ వచ్చిందో వివరించారు.

ఈ గ్రామచరిత్రను ఆయనొక రీసెర్చి గ్రంథంగా తీసుకుని వచ్చారు. విశ్వవిద్యాలయంలో అధ్యాపకులూ విద్యార్థులు కలిసి చేయవలసిన పని ఆయన ఒంటి చేతితో చేశారు. ఈ పుస్తకం చదివిన తరువాత మన ఊరి గురించి కూడా ఇలా చెప్పాలి అనే భావన అప్రయత్నంగా అందరిలో కలుగుతుంది. ప్రతి ఊరుకు చరిత్ర ఉంటుంది. తనదైన కొన్ని ప్రత్యేకతలు ఉంటాయి. వాటిని మనం సేకరించకపోతే అవి కాలగతిలో కరిగిపోతాయి. ఇప్పటికే క్షమించరాని మన నిర్లక్ష్యంతో మన వారసత్వ సంపదను పోగొట్టుకున్నాము.

పాటిబండ్ల వెంకటపతి రాయలు గారి ప్రస్తుత వయస్సు 97 సం॥లు. చెక్కుచెదరని ఆరోగ్యంతో అలుపెరగని

ఉత్సాహంతో మనముందు తచ్చాడుతూ ఉంటారు. ఆయన ఆరోగ్యం వెనుక ఆరోగ్యవంతమైన మనస్సుంది. అదొక మమతలకోవెల, మొత్తం ప్రపంచాన్ని ప్రేమించే మానవతా వాదం.

ఈ పుస్తకం ప్రస్తుతం అలభ్యం. మొదటి ముద్రణ 1992లో, ఇప్పుడీ పుస్తకాన్ని తిరిగి ప్రచురించ వలసిన అవసరం ఉంది. ప్రచురించబోయే ముందు సాహిత్యపిపాసయిన ఆయనతో మరోసారి ముచ్చటించి మరిన్ని విషయాలు పొందుపరిచి ఈ చరిత్రకు సంపూర్ణత చేకూర్చ వలసిన అవసరం ఉంది. వెంకటపతిరాయనికి తెలుగు, హిందీ భాషల్లో పాండిత్యం ఉంది. మిత్రబోధ, ఆలయాలు అచటి విశేషాలు, ఆంధ్ర ప్రదేశ్, బుద్ధంశరణం గచ్ఛామి ఆయన ఇతర రచనలు.

అధ్యాపక వృత్తిలో ఉంటూ ఊరిలో జరిగిన ప్రతి అభ్యుదయ కార్యక్రమంలోనూ పాల్గొన్నారు. గాంధీజీ ఆధునిక విధానాలపట్ల అంతసానుభూతి లేకపోయినప్పటికీ వారి శాంతియుత సత్యాగ్రహోద్యమాన్ని, అహింసావాదాన్ని పోరాట విధానంగా అంగీకరించి ఆమేరకు ఎన్నో కార్యక్రమాలలో పాల్గొన్నారు. 1914 డిసెంబరు 28వ తేదీన జన్మించారు. ఆ ఊరు త్రిపురనేని రామస్వామి చౌదరిగారి అత్తవారి ఊరు. తెలుగులో మొట్టమొదటి డబ్బింగ్ చిత్రం నీల్ ఆవుర్ నందా నిర్మాతలైన వారూ వీరులపాడు వాస్తవ్యులే.

ఇంతవరకూ వ్రాయబడ్డ చరిత్ర అంతా విజేతల విజయవిన్యాసాలే. కానీ దేశ చరిత్రకు గ్రామ చరిత్రలే మూలాధారాలవుతాయి. చరిత్రలో కొత్త కోణాలు ఆవిష్కరించ బడతాయి. గతితార్కికంగా ఆలోచించినపుడు ఈనాటి వర్తమాన సమస్యల యొక్క పునాదులు ఎక్కడ ఉన్నాయో తెలుస్తాయి. మనం ఇప్పుడు చరిత్రపై ప్రసరిస్తున్న కొత్తవెలుగులో చరిత్రను చూద్దాం. రాజరికపు యుద్ధాలు, రాణివాస ప్రేమపురాణాలు, జమాఖర్చులు లేక సామాన్య జనం నుంచి వచ్చిన అసమాన వ్యక్తుల సాహసం, త్యాగనిరతి, అభ్యుదయ పంథాలకు ఎక్కువ ప్రాధాన్యతనిస్తున్నారు.

## క్రీడా విశేషాలు

వీరులపాడు గ్రామంలో ని క్రీడలు చిరకాలం నుండియు ఆడబడు చుండేవి. అవి దేశీయములు. వానిలో 1. వామనగుంటలు, 2. పచ్చీసు, 3. పులిజూదము, 4. చెడుగుడు, 5. కుప్పల బలిగుడుం, 6. బిళ్ళంగోడు 7. కుందుకుట్టు, 8. టొక్కు, 9. కోతికొమ్మచ్చి, 10. జొన్నకంకి, 11. బంతియాట, 12. చిమ్మళ్లాట, 13. పిల్లి ఆట, 14. బచ్చాలాట, 15. బొంగరాలాట, 16. గోలీలాట, 17. అచ్చనగిల్లలు, 18. తొక్కుడుబిళ్ళ, 19. చెమ్మచక్క 20. కీలుకుచ్చు, 21. గద్ద–కోడిపిల్లలు, 22. గుడుగుడుగుంచం, 23. కాళ్లాగజ్జ, 24. బొమ్మల పెండ్లి, 25. పాపలాట, 26. వెన్నెల కుప్పలు, 27. దాగుడుమూతలు, 28. లౌటు, 29. దోకుడుబార, 30. ఉప్పుపట్టెలాట, 31. పేకాట, 32. ఓకులాట మొదలైనవి ముఖ్యమైనవి.

వానిలో వామనగుంటలు స్త్రీ పురుషులుభయులు నాడుచుండగా, పచ్చీసును స్త్రీలు మాత్రమే ఆడుచుండేవారు. పులిజూదం, యువకులను, వృద్ధులను గూడ ఆకర్షించు చుండేది. చెడుగుడు నుండి గోలీలాట వరకున్న ఆటలను యువకులు, బాలురు ఆడుచుండగా, అచ్చనగిల్లలనుండి బొమ్మన పెండ్లివరకున్న ఆటలను యువతులు, బాలికలు ఆడుచుండేవారు. ఇటులనే పాపలాట నుండి దోదోకుడు బార వరకున్న ఆటలను బాలబాలికలుభయులు ఆడుచుండగా పేకాట యువకులు, వృద్ధులును, ఉప్పుపట్టె లాటను ఓకులాటను బాలురును ఆడుచుండేవారు. ఈ యాటలకు క్రీడాంగణాలుగా ఇంటిముంగిళ్లు, వీధులు, డొంకలు ఉపయోగపడుచుండేవి.

1940 వరకు కొనసాగిన యీ యాటలను గ్రామంలోని వృద్ధులు, తదితరులు ఎంతో ఉత్సాహంతో చూచుచు, ఆయాటగాండ్రను ఉత్సాహరపచు చుండేవారు. ఆ తరువాత గ్రామంలో పెరిగిన విద్యావ్యాసంగం, రాజకీయ ఉద్యమాల కారణంగా, క్రమంగా ఈ ఆటలు వెనుకంజ వేసాయి. 1950 తరువాత నీ దేశీయ ఆటలలో కొన్ని అంతర్ధానాలయ్యాయి. మరికొన్ని నియమాలు మార్చుకొని కబాడీకాగా, టొక్కు ఖోఖోగా మారినది. అదే విధంగా నియమాలు మార్చుకొని కుందుకుట్టు ఆటయు, ప్రాచీన రీతిలో గోలీలాట, గద్దా–కోడిపిల్లలాట, అచ్చనగిల్లలు, చెమ్మచక్క, తొక్కుడుబిళ్ల, దాగుడుమూత వంటి ఆటలును ఆడబడసాగాయి. ఇవిగాక కొన్ని కొత్త ఆటలు ప్రవేశించాయి. వీనికి నియమబద్ధములైన క్రీడాంగణము అవసరమైనాయి. అందుచే అటువంటి క్రీడాంగణాలు హైస్కూలు మైదానంలోను, ఇతర ప్రదేశాలలోను ఏర్పడసాగాయి. 1950కి పూర్వం గ్రామంలో

రాత్రి అనక పగలనక ఎపుడు తీరిక లభించిన అపుడు ఆటలు ఆడుచుండేవారు. కాని ఇపుడో ఈ యాటలన్నియు నియమిత సమయంలోనే ఆడబడసాగాయి. పూర్వం ఆయాటలలో నిపుణులైన వారిని వృద్ధులు, ఇతరులు ప్రశంసించుచుండేవారు. కాని వారికి బహుమతుల నొసగు ఏర్పాటు ఉండేదికాదు. ఇపుడటులు గాక బహుమతులీయసాగారు. ఆయాటలిపుడు గ్రామ వ్యాప్తంగానే గాక, తాలూకా, జిల్లా వ్యాప్తంగా గూడ ఆడబడుచున్నాయి.

## ఆభరణాలు

స్త్రీలలోనీ ఆభరణాభిలాష మరింత ఎక్కువగా ఉండేది. వారు తలనుండి పాదాలవరకు వివిధ ఆభరణాలను నిండుగా ధరించవలెనని అభిలాష పడుచుండేవారు. ఆయభిలాషతో వారు 1935కు పూర్వం శిరోభూషణాలుగా కాటుకకాయ, తమలపాకు, పోకచక్క, సవరకుప్పెలు, తిరుగుడుపువ్వు, నాగరం, నక్షత్రం, గుంట చామంతిపూలు, రాగిడి, చంద్రవంక, జడగంటలు, జడకుప్పెలు, కొప్పుగొలుసులు, జడబిళ్లలు, జడపువ్వులు మొదలైనవియు, కర్ణాభరణాలుగా పచ్చలు, కాశీబుట్టలు, ముత్యాలు గోబాణీలు, తాలకలు, జూకాలు, వివిధరకాల పోగులు, ఏడు రాళ్లపోగులు, ముత్యాలపోగులు, చంపసరాలు, బుట్టలు, మొదలైనవియు. నాసికారభరణాలుగా బులాకీలు, పెద్దపుడకలు, చిన్నపుడకలు, మొదలైనవియు, కంఠాభరణాలుగా కంటెలు, కాసులపేర్లు, ముదుగుపట్టెలు, పలకసరి పట్టెడలు, గజ్జెల పట్టెడలు, గుంపుల గొలుసులు, పైనాల పూసలు, బిళ్లలపట్టెడ, పులిచేరు, నాను, జగినీ గొలుసులు, కడ్డీలపట్టెడలు, దారాలపట్టెడలు, గోవర్ధన గొలుసులు మొదలైనవియు, ముంజేతుల ఆభరణాలుగా మురుగులు, మురిడీగొలుసులు, బంగారుగాజులు, మట్టిగాజులు, మొదలైనవియు, దండచేతి ఆభరణాలుగా వివిధరకాల తాబేదులు, అరవంకలు, మొదలైనవియు, అంగుళ్యా భరణాలుగా వివిధములైన ఉంగరాలను, నెన్నడుము సొమ్ములుగా సాదావడ్డాణము, గజ్జెల వడ్డాణము మొదలైనవియు, పాదాభరణాలుగా అందెలు, కడియాలు, గొళ్లెపుగొలుసులు, కాటుక కాయ గొలుసులు, పొట్టి గొలుసులు, పట్టాలు మొదలైనవియు ధరించుచుండేవారు. వివాహచిహ్నాలుగా వారు మెడలో బంగారు సూత్రాలు, నల్లపూసలు, కాలివ్రేళ్లకు మెట్టెలు, పిల్లేళ్లు పెట్టుకొను చుండేవారు.

## వ్రతాలు

వ్రతాలలో 1. మంగళగౌరీ వ్రతం 2. వరలక్ష్మి వ్రతం 3. అలంకార వ్రతం 4. ముఖం దోసిళ్ల వ్రతం 5. చిట్టిబొట్టు వ్రతం 6. ఉదయ కుంకుమ వ్రతం 7. విష్ణుక్రాంత వ్రతం 8. గంటుపడని గౌరీవ్రతం 9. మాఘ వ్రతం 10. నందినారాయణ వ్రతం 11. ముప్పదిమూడు పున్నముల నోము 12. పచ్చిపాలనోము 13. పదహారు ఫలాలనోము 14. గాజుల గౌరి నోము 15. ఉప్పుగౌరీ వ్రతం 16. పసుపు గౌరీ వ్రతము 17. కుంకుమ గౌరీ నోము 18. కాటుక గౌరి నోము 19. చంచలికాయ నోము 20.తపుడు నోము 21. తంగెళ్ల గౌరి నోము 22. మారేడు దళం నోము 23. నిత్యదానం నోము 24. పదహారు కుడుముల తద్దె 25. ఉండ్రాళ్లతద్దె 26. అట్లతద్దె 27. సత్యనారాయణ వ్రతము ముఖ్యములైనవి. ఇవిగాక 1930 తరువాత ఆచరించిన వ్రతం 'బొమ్మలకొలువు' ఒకటి ఉంది. పుస్తకంలోని 4వ అనుబంధములో ఈ వ్రతాల వివరాలు ఇచ్చారు. తప్పనిసరిగా చదవాల్సిన పుస్తకం. ⓜ



## పాల్కురికి సోమనాథుని
# దళితజనోద్ధరణము

*- పండితారాధ్యుల సీత*

ప్రాచీన సాహిత్యమున అభ్యుదయ భావములతో దళితజనోద్ధరణకు నడుము కట్టిన ఏకైక కవి పాల్కురికి సోమనాథుడు. నిజము చెప్పవలెనన్నచో నేటికి మూడువేల సంవత్సరముల నుండి ఈనాటి వరకు గల సామాజిక ఉద్యమములలో, సాహిత్య ఉద్యమములలో అత్యంత విశేషము చెప్పదగినది కులవ్యవస్థపై ఎదురు తిరగ గలుగుటయే. ఆ విధముగ భారతీయ చరిత్రలో కులవ్యస్థ ఖండనమును ముగ్గురే చేయగలిగినారు. అందు మొదటివాడు గౌతమ బుద్ధుడు. ఆయన ఉద్యమములో మానవత్వమునకే పట్టము కట్ట బడినది. కనుకనే నేడు నూరుకోట్లను మించిన బౌద్ధులు కులజాడ్యమునకు దూరముగా మనగలుగుచున్నారు. తరువాతి కాలములో వీరశైవమున బసవేశ్వరుడు ఒక్కడే వర్ణవ్యవస్థపై తీవ్రమైన తిరుగుబాటు చేయగలిగినాడు. వాని ధర్మమాయని నేడు కర్ణాటక రాష్ట్రమున కోటిమంది వీరశైవులు కులాతీతభక్తి తత్త్వముతో మానవత్వమును సంతరించుకొనగల్గినారు. ఆధునిక కాలమున మహాత్మాగాంధీ ఒక్కడే కొంతవరకు కులవ్యవస్థకు పైన ఎదగ గలిగినాడు.

ముఖ్యముగ 11, 12 శతాబ్దములు దక్షిణ భారతమును ఒక ఊపు ఊపగల్గినది. బసవని వచనములతో కన్నడరాష్ట్రము మతమును గూర్చి, దానికి సంబంధము లేకపోయినను మతములోని కీడ్పిన కులవ్యవస్థను గూర్చి నూతనముగ ఆలోచింప మొదలిడినది. అరవదేశమున అరువది ముగ్గురు నాయనారులు పూజలందుకొనిరి. 12, 13 శతాబ్దములలో బళ్లకొలది సాహిత్యమును సృష్టించి, పాల్కురికి సోమనాథుడు ఆంధ్రరాష్ట్రమున బసవని భావములను తీవ్రముగ ప్రచారమొనర్చినాడు. ముఖ్యముగ శివభక్తి కలిగి, 'లింగధారణదీక్ష' అనెడి చిన్న మార్పుతో దళిత జాతుల వారినందరను అగ్రవర్ణస్తుల సరసను కూర్చుండబెట్టి బసవేశ్వరుడు, పాల్కురికి సోమనాథుడును జాతీయ సమైక్యమును సాధించగలిగినారు. పాల్కురికి సాహిత్యమునుండి దళితజనోద్ధరణకైన సందర్భములను చూపుటే ప్రస్తుత వ్యాసలక్ష్యము.

1. లింగధారణకు పూర్వము భక్తుడు ఏకులమువాడైనను లింగధారణదీక్షనందిన పిదప భక్తులందరును భక్తిగోత్రులుగ, శివకులజులుగ పిలువబడుదురని సోమన తన్ను పరిచయ మొనర్చుకొనుటలోనే వివరించినాడు.

**ధర "సుమా మాతా పితా రుద్ర" యనెడు**
**వరపురాణోక్తి నీశ్వరకులజుండ**
**శరణగణాశ్రయ సకలస్వరూప**
**గురులింగవరకరోదర జనితుండ**
**భక్తకారుణ్యాభిషిక్తుండు బాశ**
**ముక్తుండ గేవల భక్తిగోత్రుండ**
**భ్రాజిష్ణుడగు విష్ణురామిదేవుండు**
**దేజిష్ణు వగు శ్రియాదేవి యమ్మయును**
**గారవింపగ నొప్పు గాదిలిసుతుడు**
**వీరమాహేశ్వరాచార వ్రతుండు**

గురులింగవరకరోవరజనితుడనగా లింగధారణదీక్ష నందిన వాడని భావము. అప్పటినుండి సోమన కేవల "భక్తి గోత్రుడు" అనగా భక్తుల వంశమువాడని భావము. అప్పటినుండి వీరమాహేశ్వరాచారవ్రతమును చేపట్టినాడు. అనగా ఏకులము వారినైనను శివదీక్ష యున్నచో వారిని భక్తి కులజులుగా భావింపగల్గుట.

2. సంగమేశ్వరుడు వచ్చి స్వయముగ బసవేశ్వరునకు ఇటుల ఉపదేశించినాడట!

**శూలిభక్తాలి దుశ్శీలముల్ గన్న**
**మేలకా గైకొనుమా బసవన్న!**
**శత్రువైనను వాగసహిమలై యున్న**
**మిత్రులగా జూడుమో బసవన్న!**
**పట్టిన వత్రములు ప్రాణంబుమోద**
**మెట్టిన విడువకుమో బసవన్న!**
**వేతెభక్తులజాతి వెదకకుండుటయే**
**మోతిన పథము సుమీ బసవన్న!**

పై వాక్యములలో ఒకవిషయము స్పష్టము చేయబడినది.

అన్ని కులములవారును లింగధారణ దీక్ష పొందవచ్చును. దీక్షనందిన భక్తుని కులమును ఎవ్వరును పట్టించు కొనరాదు.

3. బిజ్జలుని వద్ద దండనాయకునిగ చేరిన పిదప వీరశైవుడైబసవేశ్వరుడు క్రింది విధముగ బాస చేసినాడట.

**శివరాత్రి నిత్యంబు చెల్లించుబాస / శివభక్తు లెల్లను శివుడునుబాస**
**భక్తుల యెగ్గులు పట్టనిబాస / భక్తులకుల మెత్తిపలుకబాస**

4. మహాశివభక్తుడైన మడివాలు మంచయ్యను గూర్చి బసవన బిజ్జలుని తో పల్కిన పల్కులు చూడుడు -

**లేకులు లోకుల కాకఅవులకు**
**"జాకిచా" కని యేల సందడించెదవు**
**చాకియే యతడు సాక్షాల్లింగమూర్తి**
**కాక యేటికి గనుకని బలికెదవు**
**కులజుండు నతడె యకులజుండు నతడె**
**యానీలగళు నపరావతారంబు**
**గాన యాతడు సర్వగతుడెట్లులనిన**

సప్తమాశ్వాసమున శివనాగుమయ్యగారి కథ విశేషమైనట్టిది. శివనాగమయ్య మాలవాడు, మహాశివభక్తుడు. లింగధారి. శివనాగుమయ్య బిజ్జలుని ఆస్థానమున ప్రవేశించినాడు. అగ్రవర్ణస్తులు శివనాగుమయ్య ప్రవేశము నడ్డగించిరి. అప్పటి బసవని మాటలు విశిష్టములు. మాలవారిని నీచముగ చూచిన బ్రాహ్మణులను పచ్చిమాలలనియు, త్రాటిమాలలనియు, నిందించిన తీరు చూడుడు -

**చెరలుచు గోహత్య సేసిన యూర**
**మాలల యాత్రాటిమాలల పచ్చి**
**మాలల మాటలు వోలునే వినగ**

అసలు కులవ్యవస్థయే నిన్నకాక మొన్న పుట్టినదనియు అట్టి వర్ణవ్యవస్థను పట్టుకొని వ్రేలబడుట కూడదనియు భక్తికులమే ఉత్తమ కులమని బసవనవాదించుట చూడదగినది. కుల వ్యవస్థ ప్రాచీనము కాదని పాల్కురికి సోమనాథుని వంటి వైదిక సాహిత్య మహాపండితుడనుట నేటి పరిశోధకులు గర్తింపవలసి యున్నది.

**మొన్న బుట్టిన కులమ్ముల మాటలేల**
**ప్రస్ఫుక్తమగునట్టిజాతులు గావె**
**యష్టాదశంబులు నవియేల చెప్ప**
**మిక్కిలి పదునెనిమిది వర్ణములకు**
**నిక్క మారయ భక్తనిచయంబుకులము**

కుల గౌరవమేకాని శివభక్తిలేని ద్విజులను బసవేశ్వరుడు ఎంతహీనముగ చూచినాడో చూడుడు.

**కరివైరితోడ గుక్కలు వోల్చి సరియె**
**కరితోడ గ్రామసూకరములు సరియె**
**జలధితో నిల ఔటిపడియలు సరియె**
**వడిగంగతో వెడవ్రంతు సరియె**
**తపనుతో చాదోయతతులెల్ల సరియె**
**యుపమింప జంద్రుతో నుడు పంక్తి సరియె**
**మేరువుతో చెఱమెట్టలు సరియె**
**పారిజాతంబుతో బ్రబ్బిళ్ల సరియె**
**శివనాగమయ్యతో జెనటు వీ ద్విజులు**
**అవనీశ! సరియు గా దది యెట్టులనిన**
**భక్తుండు శ్రీపతి పండితుం డీశు**
**భక్తుని కిల గోటి బ్రాహ్మణులైన**
**నెనయన్న నాలుక నే గోసివైతు**
**ననుచు ననంతపాలుని సభాస్థలిని**
**నెక్కొనగా! జంద్రనిప్పులు గాదె**
**చక్కన పొత్తి పచ్చడమున ముడిచె**
**దానేమి చెప్ప భక్తానీక మింద్ల**
**శ్వానంబులకు ద్విజు ల్సరిరామి వినవె.**

ఇటుల తన రచనల నిండుగ సోమనాథుడు కులము కన్న దైవభక్తియే మిన్నయని ఉద్ఘాటించినాడు. శివభక్తిగల సర్వకులముల వారును శివకులజులుగ భక్తికులజులుగ చెప్పబడుదురే కాని, నిన్న మొన్న పుట్టిన కులనామములతో పిలువబడరాదని శాసించినాడు.

భక్తిని ఎవ్వరును కొలువలేరు. జాతీయసమైక్యమునకు మతమొక పరికరము కావలయును. బౌద్ధము పేరిట నూరుకోట్లమంది, క్రైస్తవము పేరిట రెండు వందల కోట్లమంది, ఇస్లాముపేరిట వందకోట్ల మంది ఒకే వేదికపై నిలబడుచున్నారు. కాని డెబ్బదికోట్లు లేని హిందువులు కులములపేరిట వేయిముక్కలై జాతిని కుక్కలు చింపిన విస్తరివలె చేయుచున్నారు- పున: ఈ జాతిలో యువ బసవేశ్వరులు, యువ సోమనాథులు బయలుదేరి జాతీయసమైక్యమును సాధించి జాతి ప్రపంచమున సగౌరవముగ నిలుచునటుల చేయుదురని ఆశింతును. ⓜ

# బ్రతుకు బండి

'దేహీతి వచనం కష్టం, నాస్తీతి వచనం తథా
దేహీ నాస్తీతి మద్వాక్యం మాభూత్ జన్మని జన్మని.'

- కె.ఎన్. కేసరి

నేను వంగవోలు తాలూకాలో, ఆ పట్నానికి సమీపంగా ఉండే ఇనమనమెళ్లూరు గ్రామంలో ఒక పేద కుటుంబమునందు, పూరి ఇంట్లో జన్మించినాను. మా యింటిపేరు కోటవారు. వేము వెలనాటి వైదిక బ్రాహ్మణులము. నేను జన్మించిన 5 మాసములకే హఠాత్తుగా మా నాయన గారు కలరా జాడ్యమువల్ల స్వర్గస్థుడైనాడు. జంధ్యాలు వడుక్కుంటూ వచ్చిన టెంకాయ చిప్పలో రూ.0-10-0 లు (ఇది పది అణాలు. అంటే ఇంచుమించుగా ఇప్పటి 60 పైసలతో సమానం.) రొఖం మాత్రం నిలువచేసి వెళ్లిపోయారు. అదీ నా పిత్రార్జితము. ఆ పిదప మాతల్లి ఎన్నెన్ని కష్టములో పడి 10, 11 సంవత్సరములు నన్ను కష్టము తెలియనివ్వకుండా పెంచి పెద్దవానిని చేసినది.

నాకు ఊహ తెలిసినది. ఆమె కష్టము చూడలేకపోయినాను. ఒకనాడు మా గ్రామం వదలిపెట్టి, కాలి నడకన, దారి మకాములు చేసుకుంటూ చెన్నపట్నం చేరుకున్నాను. ఆ రోజులలో రైళ్లులేవు. ఎవరైనా బండ్లమీద, బక్కింగ్‌హామ్ కాలువపై పడవలలో, లేనిచో కాలినడకతో చెన్నపట్నం రావలసినదే. నాకు కాలినడకే అనుకూలమైనది.

చెన్నపట్నం రాగానే కొత్వాల్ చావడివద్ద రావిచెట్టు అగ్రహారం ప్రవేశించినాను. ఆ అగ్రహారంలో ఉండేవారు పలువురు ఉత్తరాది నుంచి వచ్చిచేరిన పేదబ్రాహ్మణులు. వారందరు పౌరోహిత్యము చేసియో, లేక బిచ్చమెత్తుకొనియో జీవించే వారు. నేనున్నూ ఆ జట్టుతో చేరి వారి వలెనే జీవిత మారంభించినాను. ఆ కాలంలో చెన్నపురియందు బ్రాహ్మణులకు అన్నం పెట్టే ధర్మసత్రములు చాలా ఉండేవి. అయితే వాటిలో ఒకపూటే అన్నం పెడతారు. ఒకపూట తిని, ఉండడానికి ఇల్లులేని కారణమున రావిచెట్టు క్రిందనే పడుకునేవాడిని. పసివాడను కావడంచేత రాత్రి ఆకలి వేసేది. ఒక్కొక్కరోజు ఆ ఆకలి తట్టుకోలేకపోయేవాడిని. అప్పుడు ప్రక్కనున్న కొత్వాల్ చావడికి వెళ్లితే, అక్కడ మొక్కజొన్న పేలాలు పడి రెండు దమ్మిడీలకు ఇచ్చేవారు. ఒక్క దమ్మిడీ పెట్టి - అరపడి పేలాలు కొనుక్కొని తిని మంచినీళ్లు త్రాగి, రావిచెట్టు క్రిందికి తిరిగి చేరి నిద్రపోయేవాడిని. ఈవిధంగా చెన్నపట్నంలో రావిచెట్టుక్రింద కాపురం కొన్నాళ్లు సాగించినాను. ఆ బ్రతుకు అసహ్యంగా తోచి చదువుకొందామా అనే ధ్యాస కలిగింది.

పచ్చయప్ప కాలేజీ భవనానికి (జార్జిటవున్‌లో) ప్రక్కన బందరు వీధి అనియొక వీధిఉన్నది. ఆ వీధిలో - రామానుజాచారిగారని యొకరు, వీధి బడి పెట్టుకొని చిన్నపిల్లలకు చదువులు చెప్పేవారు. పిల్లలు తలిదండ్రుల వద్ద జీతాలు పుచ్చుకొనేవారు. విద్యాతురుడనైన నేను తిన్నగా వారి నాశ్రయించి, జీతము లేకుండా చదువుచెప్పేటట్లు, వారి అనుగ్రహం పొందినాను. వారి అనుగ్రహం పొందిన విద్యార్థిని కావడంచేత వారి ఇంటికివెళ్లి, వారికి శుశ్రూష చేసేవాడిని. వారు నాయందు దయగలిగి చనువుతో నాచేత కాళ్లు పట్టించుకొనేవారు. ఇతరమైన ఇంటి పనులు చేయించు కొనేవారు. నాయందనుగ్రహించి ఉచితంగా విద్యాదానం చేసే గురువునకు అరమరికలు లేకుండా సపర్యలు చేసేవాడను. వారి వద్దనే రుక్మిణీ కళ్యాణం, గజేంద్ర మోక్షము మొదలైన పద్యకావ్యములు అర్థసహితంగా చదువుకొన్నాను. కాని చూచే కొద్దీ ఈ చదువు, బ్రతుకు తెరువుకు పనికిరాదని తోచినది. ప్రైవేటుగా నాలుగు ఇంగ్లీషు ముక్కలు నేర్వసాగినాను. ఇంగ్లీషు విద్యపై మనసు కలిగినది.

డాక్టర్ కె.ఎన్. కేసరి (1875 - 1953)

1889 లో టంకసాల వీథిలో శ్రీ సచ్చిదానంద యోగి రామనాథ శివశంకర పాండ్యాగారు, హిందూ థియొలాజికల్ హైస్కూలు స్థాపించి, ప్రధానాధ్యాపకులై నడిపింప నారంభించినారు. 1888లో క్రిస్టియన్ కళాశాలలో నొక ఆంగ్లేయాధ్యాపకుడు హిందూ మతమును దూషణ పూర్వకముగా అపహాస్యం చేయుటచే నాటి హిందువులలో అలజడి బయలుదేరింది. కొత్తగా వచ్చిన ఆంగ్ల విద్య నేర్చుటతోపాటు బిడ్డలు మతాంతరులు అవుతారనే భయము కలిగినది. దాని ఫలితంగా నీ హిందూ థియొలాజకల్ హైస్కూలు ఏర్పడినది. శ్రీ పాండ్యాగారు సంస్కృతాంధ్ర ఆంగ్లభాషా కోవిదులు. ప్రెసిడెన్సీ కాలేజీలో బి.ఏ. ప్యాసైనవారు, దైవచింత గలవారు. వారి నాశ్రయించి తిన్నగా ఆ పాఠశాలలో జీతము లేకుండా చదువుకొనే వసతి సంపాదించినాను. వారొకనాడు క్లాసుకువచ్చి-విద్యార్థుల రిజిస్టరులో పేరులు చదివి హాజరు వేయుచుండిరి. 'కె. నరసింహం' అనగానే ఇద్దరము ఆ పేరు గలవారము లేచి నిలచినాము. ఇద్దరికి ఒకే పేరు చిక్కుగా ఉన్నది, అని తలచి- నాయందు చనువుచే నావంకచూచి- 'నీ పేరు అర్థము చెడకుండా కొద్దిగా మారుస్తాను' అన్నారు. నేను సమ్మతించినాను. అంతట, 'కోట నరసింహం' అనే పేరులో 'సింహం' అర్థముగల 'కేసరి' పదమును సింహమునకు బదులు చేర్చి – 'కోట నరకేసరి' అని మార్చిరి. నేను అంగీకరించితిని. అది మొదలు నా మిత్రులందరు నన్నాపేరిటనే పలువ నారంభించిరి.

పాండ్యాగారి దయవల్ల జీతమైతే అవసరము లేకపోయిందేగాని, పుస్తకాలకు, గుడ్డలకు, భోజనానికి ఇబ్బంది మాత్రం అట్లాగే ఉన్నది. భోజనానికి కొన్ని ఇండ్లలో వారాలు ఏర్పాటు చేసుకొన్నాను. పుస్తకాలకు, గుడ్డలకు – ఆ ప్రాంతంలో వ్యాపారం చేసుకొనే కోట్లవద్ద నెల 1కి తలా రూ. 0–4–0 చందానిచ్చే ఏర్పాటు చేసుకొన్నాను. ఒకనాడు కొన్ని పుస్తకాలు కొనవలసి వచ్చినది. ఇంకా నెలసరి చందాలిచ్చే గడువు రాలేదు. జార్జిటౌను ఆదియప్ప నాయక్ వీథిలో పై చందాలిచ్చేవారిలో ఒకరి వద్దకు వెళ్ళి – 'మీరు మామూలుగా ఇచ్చే రూ. 0–4–0 లు అట్లుంచి – మరొక్క పావులా అదనంగా ఈరోజున ఇవ్వండి, పుస్తకాలు అగత్యంగా కొనవలెను'. అని సాహసించి అడిగినాను. వారు దగ్గరకు రమ్మనిన, అడిగిన తడవుగానే ఇవ్వబోతున్నారనే ఆశతో, ధైర్యముతో దగ్గరకు వెళ్లినాను. 'మామూలుగా ఇచ్చే పావులా గాక పైన ఒక పావుల వడ్డీగూడా కావాలా' అంటూ–ఛెళ్లున చెంపకాయ కొట్టినాడు. అది దూసిపోయి నెమరు కణతన తగిలినది, స్పృహతప్పి పడిపోయినాను. ఆ శబ్దం విని శెట్టి భార్య లోపలనుంచి వచ్చినది. నా అవస్థచూచి 'ఆ పిల్లవానిని ఎందుకు అట్లా కొట్టా'వని మగని గద్దించి–చాలా నొచ్చుకొన్నది. లోపలకు వెళ్లి ఇన్ని మంచినీళ్లు తెచ్చి త్రాగమని ఇచ్చినది. త్రాగినాను. స్పృహ బాగా వచ్చిన తర్వాత ఆమె రు. 1–0–0 తెచ్చి పుస్తకాలు కొనుక్కోమని నా చేతిలో పెట్టి పంపినది. రావిచెట్టు క్రిందకు చేరాను. తిరిగీ జిజ్ఞాసలో పడ్డాను. రిక్తుడను. అవమాన పరంపరలతో చదువు సాగించడం దుర్లభమని తోచింది. నాకూ ఈ చదువుకూ దూరమని నిర్ణయించుకున్నాను. ఏదైనా నాకు తగిన ఉద్యోగం చేసి సంపాదించి పొట్టబోసుకుందాము అని యోచన కలిగింది.

ఏమి ఉద్యోగం చేతుమా అని ఆలోచింప నారంభించాను. ప్లీడరు గుమస్తా చేయమని ఒకరు సలహా యిచ్చారు. ఒక వకీలుకు సిఫారసు చేసినారు. వారివద్ద గుమాస్తాగా చేరినాను. ఆ వకీలు నెలపూర్తి అయితేగాని జీతమివ్వబడదు, పని నేర్చుకో అన్నారు. నాకప్పచెప్పబడిన పని – వకీలుగారి గౌను, ఇంతంత 'లా' పుస్తకాలు – ఎద్దుమోత నెత్తిన పెట్టుకొని హైకోర్టుమెట్లు ఎక్కడం, దిగడం. నెల అయిపోయింది. అన్నానికి ఇబ్బందిగా ఉన్నది, జీతం ఇవ్వండి అన్నాను. 'ఇంకా పని నేర్చుకోనిదే, రెండు మూడు నెలలు నేర్చుకున్నాక-జీతం ఆలోచిద్దాము' అన్నారు. ఎన్నాళ్లు గౌను, 'లా' పుస్తకాలు నెత్తిన పెట్టుకొని మోస్తూ – హైకోర్టుమెట్లు ఎక్కే, దిగే విద్య నేర్చెదను అని నాకు తోచింది. ఆ దినంతో దానిని వదులుకొన్నాను.

అప్పుడే క్రొత్తగా 'ట్రాంబండి' వేసినారు. ట్రాంబండ్లలో కండక్టరుగా చేరుదామని బుద్ధిపుట్టినది. దరఖాస్తు వేశాను. 'ఖాళీలేదు' అని జవాబిచ్చారు. అది అట్లా తొలగిపోయింది.

ఎవ్వరి సలహాలేకుండా నాలో నేను ఆలోచించుకో నారంభించాను. ఏదైనా ఉద్యోగం చేసి బ్రతకవలెను అనే నిశ్చయం ఇంకా దృఢపడ్డది. ఆ ఉద్యోగం, ఒకరి సలహా, సిఫారసు లేకుండా దొరకవలెను. అప్పటికీ ఇప్పటికీ – చెన్నపట్నంలో, రెండు ఉద్యోగాలు హెచ్చు విద్య అవసరం

లేకుండా, ఏ సిఫారసు లేకుండా దొరికేవి ఉన్నవి. అందొకటి బ్రోకర్ పని, దీనికి తలగుడ్డ, కోటు, వల్లెవాటు, చేతికర్రో, గొడుగో, చెప్పులు, ఇట్లా కొంత వేషం, భేషజం ఉండవలె.

రెండవది : నాటు వైద్యం. ఆయుర్వేద వైద్యవిద్య నేర్పే పాఠశాలలు ఆ రోజుల్లో మద్రాసులో లేవు. ఆ వైద్యవిద్య తెలిసిన వారి వద్ద గురుకుల వాసం చేసి నేర్వవలసినదే. ఒక నంబి ఆచార్లవద్ద, ఒక శాస్త్రులగారివద్ద ఆ విద్య నేర్చినాను. ఆ నంబి ఆచార్లగారికి శాస్త్రము విశేషమేమి తెలి యదు. తాతముత్తాతల నాటినుండి అనుశృతంగా వచ్చే వైద్యవృత్తి మాత్రం అవలంబించినారు. వారుచేసిన కుప్పెకట్టు కొన్ని వీరివద్ద ఉన్నవి. వాటిసహాయంతో అనుభవంకొద్దీ ఆయన 'సంచికట్టు' వైద్యం సాగించేవారు. ఆయన నాకు నేర్పగలిగిందేముంది? ఏదో ఇంతమందు కల్వంలో వేసి, ఇన్ని నిమ్మవండ్ల రసం పిండి మర్దన చేయమనేవారు. ఎంతకాలం అట్లా మర్దనచేస్తే నాకు విద్య అంటుతుంది? ఆయనను వదిలిపెట్టినాను.

స్త్రీల ఆరోగ్యమునకై

లోధ్ర

ఔషధరాజము

మహాదేవశాస్త్రిగారు వైద్యశాస్త్రం తెలిసినవారు. వారివద్ద కొంతవరకు శాస్త్రరీత్యా విద్య నేర్చినాను. వైద్యగ్రంథములు చదివి వైద్య, రహస్యములు బోధపరుచుకున్నాను. కొన్ని మందులను తయారుచేసి, కోమట్ల ఇండ్లలో వైద్యం చేసేవాడను. శ్రీ పాలూరి రాజం శెట్టిగారు నీలిమందు వర్తకం చేసేవారు. వర్తకులలో ప్రముఖులు, కన్యకా పరమేశ్వరీ ధర్మ ఆయుర్వేద వైద్యశాల అని యొకటి స్థాపించినారు. దానిలో శ్రీ పండిత డి.గోపాలాచార్యులుగారిని వైద్యులుగా నియమించినారు.

శ్రీ రాజంశెట్టిగారికి నేను తరచుగా పుల్లటి మందులు పెడుతూ ఉండేవాడిని. వారు దానికని నాయందెంతో దయగా ఉండేవారు. ఆ పరిచయంచేత వారు మిగతా ట్రస్టీలకు సిఫారసుచేసి, నన్ను కూడా ఆ కన్యకా పరమేశ్వరీ ట్రస్టు ధర్మాయుధ వైద్యశాలలో ఆచార్లగారికి సహాయ వైద్యులుగా నియమింపచేశారు.

నేనూ ఆచార్లుగారూ కలిసి ఆ వైద్యశాలలో, 4 సంవత్సరములు పనిచేశాము. పిదప వారికీ నాకూ సరిపడలేదు. నేను ఆ ఉద్యోగానికి రాజీనామా నిచ్చినాను. స్వయంగా, స్వతంత్రముగా 'వైద్యాలయం' ఏర్పాటు చేసుకొని, పొట్టపోసుకోదలచినాను. ఆ ధర్మవైద్యశాల యుండిన నారాయణ మొదలి వీధిలోనే, ఒక ఇల్లు నెల 1కి రూ.1-6-0కి బాడుగకు తీసుకొని, వైద్య మారంభించాను. మందులు చేసుకోడానికి కాపురముండడానికీ అదే యిల్లు.

ఈ నూతన యత్నారంభం చేసిన రోజుననే – ఆయింటి వీధిగోడమీద, బొగ్గుతో, పెద్ద అక్షరాలలో, 'కేసరి కుటీరం – ఆయుర్వేద ఔషధశాల' అని వ్రాశాను. అదే నా అదృష్టరేఖ ధరించిన మొదటి సైన్‌బోర్డు.

అప్పటినుంచీ ఇప్పటివరకు, ఈ వృత్తిలో కూడా నాకు చాలా కష్టములు కలిగినప్పటికి వాటినన్నిటినీ జయించుకొని, కొన్ని సంవత్సరములుగా ఏ ఇబ్బందియు లేక స్థిరపడినాను. ఇదీ నా నిజవృత్తాంతము.

'ఇన్ని కష్టములు పడినీ్న చేసిన ఘనకార్యములేమిటి' అని మీరు నన్ను అడుగవచ్చును. చెప్పెదను.

చిన్నతనంలో, ఇల్లు వాకిలి లేనివానినిగా చేసి నన్ను, రావిచెట్టు క్రింద కాపురము చేయించినందుకు – దేవుని మీద కోపం వచ్చి – నివసించడానికి మంచిభవనాన్ని నిర్మించుకున్నాను.

చిన్ననాడు విద్యకై పడిన కష్టములు మరువజాలక ఈ విద్యాలయం స్థాపించినాను. చదువుకొనునప్పుడు నన్నాదరించి నాకు అన్నముపెట్టిన అమ్మల అమృతహస్తములను ఏటేటా 'గృహలక్ష్మి స్వర్ణకంకణము' అనే పేరుతో బంగారు కంకణాలను తొడుగుతున్నాను.

ఇప్పుడు మరొక కార్యం చేయదలచుకొన్నాను. నన్ను ఈ స్థితికి తెచ్చినది స్త్రీల ఆరోగ్యమునకై తయారు చేయబడు చుండిన "లోధ్ర" అనే ఔషధరాజము. ఈ ఔషధమువల్ల నాకింత సంపాద్యము చేకూరినది. ఈ దినం స్త్రీల విద్యాభివృద్ధికై – లక్ష్యరూపాయలను స్కూలు కమిటీ పరముగా ఇచ్చుచున్నాను. ఈ ధనం వెచ్చించి 'కేసరీ కన్యావిద్యాలయం' అనే పేరుతో ఆడబిడ్డలకు ప్రత్యేకంగా ఒక విద్యాలయం నెలకొల్పండి – అని ఈ కమిటీ వారిని కోరుచున్నాను.

**'క్షణం చిత్తం క్షణం విత్తం క్షణం జీవితం మాపయోః**
**యమస్య కరుణా వ్యాప్తి ధర్మస్య త్వరితా గతిః'** ⓜ

## సంగీతసాధన

# నూతన బోధనా పద్ధతులు



– ఆకెళ్ల మల్లికార్జున శర్మ

కర్ణాటక సంగీతాన్ని విద్యార్థులకు బోధించే పద్ధతిని 16వ శతాబ్దంలోగల పురందరదాసులవారు రూపొందించడం వల్ల వారిని 'కర్ణాటక సంగీత పితామహ' అని పిలచేవారని చరిత్ర ప్రసిద్ధి. అప్పటి నుండీ విద్యార్థులకు మాయామాళవ గౌళరాగంలో సరళీస్వరాలు, జంట స్వరాలు, దాటుస్వరాలు, హెచ్చుస్థాయి స్వరాలు, తగ్గుస్థాయి స్వరాలు, అలంకారాలు బోధించి తరువాత పిళ్ళారిగీతాలు, సంచారీ గీతాలు, లక్షణగీతాలు వాటి తరువాత స్వర పల్లవులూ, స్వరజతులూ, వర్ణాలు, కీర్తనలూ, కృతులూ, పదాలు, జావళీలు, అష్టపదులు మొదలైనవన్నీ గురుకుల విద్యాభ్యాసంలో గురువుగారింట్లోనే ఉండి సహాధ్యాయులతో బాటుగా అన్నీ యింటిపనులూచేస్తూ పదేళ్ళో, పదిహేనోళ్ళో, ఇరవైఏళ్ళో నేర్చుకుంటూ నిరంతరసాధన చేస్తే వారి వారి అదృష్టాన్ని బట్టి అప్పటికి రాగాలాపన, స్వరకల్పన మొదలుగా మనోధర్మ సంగీతజ్ఞానము దానంతట అదే లభించి కచేరీలు చేసే శక్తి వచ్చేదని చెబుతూవుంటారు. ఆ గురుకులాలు ఎపుడో పోయినా యిలా రెండు డజన్ల గీతాలు, రెండు డజన్ల స్వరపల్లవులూ, డజను స్వరజతులూ, మూడు డజన్ల వర్ణాలు, నాలుగు గ్రోసు కీర్తనలూ యిలా రకరకాల రచనలను మాత్రమే సంవత్సరాలకొలదీ నేర్పిస్తూపోయేదే ప్రస్తుతం ప్రపంచమంతటా అనుసరిస్తున్న సాంప్రదాయ సంఖ్యారూపక బోధనా విధానం.

పూర్వపు రోజుల్లో రేడియో లేదు. టేపురికార్డరు అసలే లేదు. సంగీతకచేరీలు జరిగేచోటుకు మనమే వెళ్ళివినాలి. విన్న తరువాత విన్నదానిలో ఎంతవరకు జ్ఞాపకం ఉంటుందనేది సందేహమే. అందుచేత ఆ రోజుల్లో యీ సంఖ్యారూపక బోధనలో సంగీతం నేర్చుకోడానికి ఏళ్ళూ, పూళ్ళూ పట్టినా మనోధర్మ సంగీతం మాత్రం నేర్పేదీకాదు, నేర్చుకొనేదీ కాదు అని సెలవిచ్చి చక్కగా తప్పుకొనేవారే గురువు (బరువు) లంతా. అదేవిధంగా పూర్వపు రోజులలో ప్రయాణసాధనాలు సరిగాలేక కాశికి వెళ్ళి నడిచి రావలసి వచ్చేదట. కాని యిపుడు కాశికి వెళ్లి అన్నిపనులు పూర్తి చేసుకొని ఇరవై నాలుగు గంటల లోగా తిరిగి యింటికి చేరుకొనే విధంగా ప్రయాణసాధనాలు అభివృద్ధి చెంది అందుమూలముగా అతివిలువైన కాలమూ, మానవశక్తి బాగా ఆదాచేసుకోవడానికి వీలౌతుంది. మరి అదేవిధంగా సంగీతాభివృద్ధికి కూడా అత్యవసర పరికరాలైన రేడియో, టి.వి, టేప్‌రికార్డరు, సి.డి.రికార్డరు, ఎమ్.పి.3 ప్లేయర్ మొదలైన అత్యాధునిక పరికరాలు విరివిగా లభిస్తున్నాగాని సంగీతబోధన మాత్రం యింకా ఏళ్ళూ, పూళ్ళూ పట్టడం యీ గురువు స్వార్థపూరిత నిర్వాకమేనని తెలుసుకోడానికి నాకు చాలాకాలం పట్టినా, చివరకు విషయంతెలిసి యీ నూతన పరికరాల సాయంతోనే యీ సంగీతబోధన చాలా సులభతరం, శీఘ్రతరం చేయవచ్చునని అనేకసార్లు నిస్సందేహంగా ఋజువైంది.

మన తెలుగుదేశంలో చాలాకాలంగా వైలన్ విషయంలో వాద్యపద్ధతే ఎక్కువగా వ్యాప్తి చెందింది కాని ఎక్కువగా అవసరమైన గాత్ర పద్ధతి చాలా తక్కువగానే వ్యాప్తి చెందింది. ఎవరి ముఖం వారికి చాలా అందంగా ఉన్నట్లుగానే ఎవరికి వారు చాలా బాగా వాయిస్తున్నామనే అనుకుంటారు గాని మనకంటే బాగా వాయించేవారి వాద్యంతో మన వాద్యాన్ని బేరీజువేసుకొని మంచి విషయాలు నేర్చుకొని తన వాద్యాన్ని అభివృద్ధి చేసుకొనే వారు మన తెలుగుదేశంలో చాలా తక్కువనే చెప్పాలి. నాకు తెలిసినంత వరకు మన తెలుగుదేశంలో గాత్ర పద్ధతిలో వైలన్ వాయించే విద్వాంసులలో చాలమందికి పలికే సంగతులు తక్కువా పలకని సంగతులు ఎక్కువా ఉంటాయి. అటువంటి వారిలో ఎక్కువ సంగతులు పలికించగలిగేవారు కీ.శే.తిరుపతి పొన్నారావు గారని వ్రాస్తే కొంతమందికి బాధగానే ఉంటుంది

ఆకెళ్ల మల్లికార్జున శర్మ, ఫోన్ : 9908822992

మరి. కర్ణాటక సంగీతానికి ఎడారిగా ప్రసిద్ధిచెందిన ఈ తెలుగుదేశంలో స్థిరమైన రాబడిలేక దీనమైన జీవితాన్ని సాగించి మసకబారిపోయిన మహా విద్వాంసుడు తిరుపతి పొన్నారావు గారు. ఇపుడున్న వారిలో చి॥ పేరి శ్రీరామమూర్తి ఉన్నతమైన విద్వాంసుడే గాక మంచి అధ్యాపకుడు కూడా.

ఈ వైలన్ వాద్యాభ్యాస విషయంలో 8ఏళ్ళ వయస్సు నుండి సమర్ధవంతమైన అధ్యాపకుల వద్ద మొదలుపెట్టి సరిగా నేర్చుకొంటే తదుపరి వయస్సు మళ్ళిన తరువాత కూడా కొంతవరకైనా సమర్ధించుకోవచ్చును. నాలాగా ఆలస్యంగానూ, విద్వాంసుల వద్ద మొదలు పెడితే యింతే సంగతులు. ఇవన్నీ గ్రహించడం వల్లనే నేను త్వరగా మానేశాను.

మంచి వయస్సులో ఉన్నపుడు వాయించినట్లుగా వయస్సు మళ్ళిన తరువాత వాయించలేము. ఒకవేళ వాయించినా వాదనంలో పటుత్వం తగ్గి రసంకూడా కళ తప్పుతుంది. ఎవరికంపు వారికింపు అన్నట్లుగా మనవాద్యం మనకి బాగానే ఉన్నాగాని వినేవారికి బాగుండదు. అది మనమే తెలుసుకొని వాయించడం మానివేస్తే మనకీ సుఖం, వినే ప్రజలూ సుఖపడతారు. సంగీతానికీ పరువు దక్కుతుంది.

సాధారణంగా ఏ ఉద్యోగానికైనా శిక్షణ అనేది ఉంటుంది. కానీ, యీ సంగీత కళాశాలలో అధ్యాపక ఉద్యోగులకు మాత్రం యింతవరకూ ఎక్కడా శిక్షణ అనేదిలేదు. (మద్రాసులో ఒకటి ఉన్నాగాని అదీ నామమాత్రం గానే ఉంది). అలా శిక్షణ అనేదే లేకపోవడం చేతా, ఏ రకమైన పర్యవేక్షణ కూడా ఎపుడూ లేకపోవడం చేత, విద్యాబోధనలో చర్చాగోష్ఠులుగాని, పరిశోధనలుగాని చేయడం మనసాంప్రదాయంలోనే లేకపోవడం చేతా మొట్టమొదటినుండీ అధ్యాపకులకు తోచినట్లుగా బోధనచేయడం జరుగుతోంది గాని విద్యార్థి శక్తి యుక్తులకు అనుగుణంగా బోధన జరుగడం లేదు. ప్రతి పనికి కార్యకారణ సంబంధం తప్పక ఉంటుంది. అది తెలుసుకొని తగినవిధంగా పట్టుదలతో పనిచేసేవారికి మాత్రమే సత్వర సక్రమ ఫలితాలు లభిస్తాయి. నేను కూడా అదే సంఖ్యారూపక బోధనా విధానంలో సంగీతం నేర్చుకున్నాగాని తదుపరి బాధ్యతా యుతమైన అధ్యాపకవృత్తిని చేపట్టవలసిరావడం చేత నా వృత్తికి న్యాయం చేయాలనే తాపత్రయంలో ఆ సర్వేశ్వరుని కృపవలన తీవ్ర పరిశోధనలో మార్గము గోచరించి ఒక గుణరూపక బోధనా విధానాన్ని రూపొందించి తద్వారా విద్యార్థులను 1,2 సంవత్సరాల లోనే స్వరపరచి దానిని చూచిపాడడం, పాడిన దానిని స్వరపరచి వ్రాయడం, రాగాలాపన, స్వరకల్పనలతో కనీసం అరగంటకు తక్కువగాకుండా సమర్థవంతంగా కచేరీపాడించడం జరుగుతోంది.

నిజానికి యీ నూతన గుణరూపకబోధనా విధానంలో చేవగల వాటినిమాత్రం జేర్చి, చేవలేనివాటిని జార్చి అవసరమైన మార్పులు చేసి కార్యకారణ సంబంధానుసారంగా ఒకపద్ధతిననుసరించి బోధన జరుగుతుంది. ఈ విధానంలో మొట్టమొదట విద్యార్థి యొక్క సహజ లయ జ్ఞానస్థాయిని కొన్ని నూతనపద్ధతుల ద్వారా శోధించి తెలుసు కొని ఆ స్థాయిని సంగీత బోధనకవసరమైన స్థాయికి కొన్ని ప్రత్యేక లయసాధనాల ద్వారా పెంచే ప్రయత్నం, అదేవిధంగా విద్యార్థి యొక్క శ్రుతిజ్ఞానస్థాయిని కూడా శోధించి తెలుసుకొని కొన్ని ప్రత్యేక ప్రక్రియలద్వారా పెంచే ప్రయత్నం జరుగుతుంది.

ఒక విద్యార్థికి మోటార్‌సైకిల్‌ను నడపడం నేర్పేగురువు తాను వెనుకగల సీట్లో కూర్చొని ముందుసీట్లో విద్యార్థిని కూర్చొనబెట్టి ఆ విద్యార్థియే బండిని నడిపేట్లుగా ప్రేరణ కలిగిస్తే ఆ విద్యార్థికి బండిని నడపడంలో అనుభవంతో కూడిన విద్యను నేర్చుకొనగలుగు తాడు. అదేవిధంగా వంటజేయడం నేర్పేగురువు కూడా విద్యార్థికి తగువిధంగా ప్రేరణను కలిగించి అతని చేతనే వంటచేయించడం చాలా వాంఛనీయం. అలాకాక గురువు తానే వాటిని చేయడం విద్యార్థి చూడటం మాత్రమే జరిగితే విద్యార్థికి అనుభవపూర్వకమైన విద్యాబోధన జరుగదు. ఈ సంగీతము

అదృశ్యమై, చాలా క్లిష్టమైన విద్యకావడం చేత దీనిబోధనలో కూడా యిటువంటి అనుభవపూర్వక విద్యాబోధనయే శీఘ్రమైన సత్ఫలితాలనిస్తుందని చాలాసార్లు ఋజువైనది.

రికార్డు చేయబడిన పాటనే ఎక్కువసార్లు ఎక్కువసేపు వినడం వల్ల సినిమాపాటలు చాలా త్వరగా నేర్చుకోడానికి వీలౌతుంది. అదే విధంగా యీ నూతనబోధనా విధానంలో కూడా విద్యార్థి ఎక్కువగా రికార్డుచేయబడిన సి.డిలోని సంగీతాన్ని చాలాసార్లు, చాలా ఎక్కువసేపువింటూ, Casioని కూడా వాయిస్తూ, దాని వెంట కూడా పాడుతూ 10 వర్ణాలవరకూ నేర్చుకొని సాధారణంగా ఒక సంవత్సరం లోగానే క్లిష్టమైన ముక్తాయింపులతో కూడిన స్వరకల్పనా, సంగ్రహరాగాలాపనా పాడి అనంతరం స్వరపరచిన కృతులను కూడా మొట్టమొదటి నుండీ తనంతట తానే సి.డి.ద్వారా విని పాడగల సామర్థ్యం పొందుతారు. ఈ పద్ధతిలో బోధించడం వల్లనే అందరిలాగా కాక నీవు మూడు సంవత్సరలలోగానే రెండు గంటల కచేరీ చేయగల సమర్థుడవతావు.

కాని, యీ పది వర్ణాలను ఐదు, ఆరు సంవత్సరముల పాటు మెల్లమెల్లగా సాగదీసి నేర్పుతూ ఎక్కువ ధనార్జనాధ్యేయంతో నేర్పే గురువులే ఎక్కువగా ఉండటంచేత, అటువంటి వారికి యిటువంటి శీఘ్ర పద్ధతులే మాత్రము లాభసాటికావు గనుకనూ యీ నూతన పద్ధతి ననుసరించే వారు చాలా తక్కువ.

యీ విధానంలో నేర్చుకొని మూడు సంవత్సరాలలోగానే రెండు గంటల కచేరీలు చాలా చేసి యిపుడు విరివిగా రాగం, తానం, పల్లవితో బాటుగా సమర్థవంతంగా మూడు గంటల కచేరీలు చాలా చేస్తూ మంచి అధ్యాపకుడుగా కూడా రూపొందిన చి॥జె.యస్.శ్రీరామ్, నృత్యకళాకారులైన అతడి తండ్రి, శ్రీ జె.యస్. ఈశ్వరప్రసాదు, గాత్ర విద్వాంసురాలైన అతడి తల్లి శ్రీమతి చిద్రూపలక్ష్మిలతో కలిసి అందరిపిల్లలకూ యీవిద్య యింత శీఘ్రంగా, సక్రమంగా, అందించాలనే సదుద్దేశ్యముతో పరిశోధనకొరకు 'ఎం.ఎం.ఎస్.ఫౌండేషన్' అనే సంస్థనూ, విద్యాబోధన శిక్షణల కొరకు 'స్వరభంగిమ' అనే రెండవసంస్థనూ, యీ విద్యాలయ విద్యార్థులే గాక ప్రాంతీయ యితర విద్యార్థులతో బాటుగా యువకళాకారుల నెలవారీ కచేరీల నిర్వహణకొరకు 'సంప్రదాయ'అనే మూడవ సంస్థనూ నెలకొల్పి ఆదర్శవంతంగా, విజయవంతంగా యిటువంటి ఉన్నతమైన సంగీతసేవ చేయడం నాకు తెలిసినంతలో యిదే ప్రథమమని చెప్పాలి.

ఈ నూతనగుణ రూపకబోధనా విధానంలో సంగీతం నేర్చుకుంటున్న విద్యార్థులకు గరిష్ఠంగా 12 లేక 18 మాసాలలోగా ముఖ్యమైన వర్ణాలతోబాటుగా 1,2 కీర్తనలకు ముక్తాయిలతో బాటుగా స్వరకల్పనా, సంగ్రహరాగాలాపనలు పాడగలిగే సామర్థ్యం కూడా లభిస్తే ఆ అధ్యాపకుడు యీ నూతన బోధనవిధానంలో సక్రమంగా బోధిస్తున్నట్లుగా తెలుసుకోవచ్చును. ⓜ

---

# నర్తకి

**ఒ**క నర్తకి తన సంగీత బృందంతో రాజుగారి ఆస్థాన మండపంలోకి అడుగుపెట్టింది. సంగీతం మొదలయింది. మృదంగ వాదన, వీణానాదం, పిల్లంగోవి శబ్దాలు కలగలసీ సభాస్థలిని మురిపించాయి.

ఆమె జ్వాల కదిలినట్లు నర్తించింది. కత్తి ఝుళిపించినట్లు కదిలింది. నక్షత్రాలు అంతరిక్షంలో మెరిసినట్లు, మెరుపు తీగలా కదిలింది. గాలిలో పూలు కదిలినట్లు నాట్యం చేసింది.

నాట్యం పూర్తయిన తరువాత రాజుగారి సింహాసనం ముందు తలవంచి నమస్కరించింది.

తన సమీపానికి వచ్చిన ఆ నర్తకిని అభినందన పూర్వకంగా చూసి రాజుగారు "సౌందర్యవతీ! నువ్వు ఆర్ద్రతకి, ఉల్లాసానికి కన్న కూతురులాంటి దానివి. లయ బద్ధంగా, తాళబద్ధంగా నీ శరీరం నర్తించడంలోని రహస్యమేమిటి?" అన్నాడు.

ఆ నర్తకి మళ్ళీ వినమ్రంగా తలవంచి "మహాప్రభూ, దయాళూ, మీరు అడిగిన ప్రశ్నలకు నా దగ్గర సమాధానాలు లేవు. నాకు తెలిసిందల్లా ఒకటే. తత్వవేత్త ఆత్మ మెదడులో మునకలేస్తుంది. కవి ఆత్మ హృదయంలో కదుల్తుంది. నర్తకి ఆత్మ ఆమె శరీరమంతా తిరుగుతుంది" అన్నది.

# నృత్యకళ – సంప్రదాయం



- భారతి

ఆదర్శవంతమైన కళాక్షేత్రాన్ని స్థాపించి, ప్రతిభావంతులు, త్యాగపురుషులు అయిన కళోపాసకుల యొక్క సహకారం లభించినప్పుడే యిదంతయు సాధ్యపడుతుంది.

మనదేశంలో స్థాపించే కళాకేంద్రంలో ఈ క్రిందచెప్పిన విధంగా నృత్యకళయందు శిక్షణనిచ్చిన ప్రజలు విశేషలాభము పొందగలుగుతారు.

(1) పాఠశాలల్లో నేర్పే నృత్యవిధానం; (2) శాస్త్రీయ నృత్యాన్ని అభ్యసించి నృత్య ప్రదర్శనము లిచ్చుటయే వృత్తిగా పెట్టుకొన్న వారికి నేర్పే విధానం; (3) బాలురకు, యువకులకు నేర్పు నృత్యం; (4) నాట్యాచార్యులు, ప్రచారకులుకాగోరే వారికిచ్చే శిక్షణ.

## పాఠశాలల్లోనేర్పే నృత్యము

పాఠశాలల్లో చదువుకునే విద్యార్థినులు సంపూర్ణంగా శాస్త్రీయ నృత్యాన్ని అభ్యసించ దానికి అవకాశముండదు. స్కూల్లో జరిగే యితరపాఠశాలవలే ఒక సబ్జక్టుగా గవర్నమెంటువారు యేర్పరుస్తారు. అందుచే యెక్కువకాలం వినియోగించి పరిపూర్ణ పాండిత్యం సంపాదించుటకు వీలుండదు. కనుక వారు శ్రీఘ్రకాలంలో అభ్యసించుటకు అనువుగా వుండే నృత్యాలను తయారుచెయ్యాలి. ప్రతి విద్యాలయంలో డ్రిల్లు పిరియడు ఒకటి వుంటుంది. దానికి బదులుగా కొన్ని సులభమైన హస్తపాద విన్యాసాలను చెప్పించిన ఆరోగ్యానికెంతో వుపకరిస్తుంది. సంగీతముతో కూడిన ఈ వ్యాయామము నేటికాలపు డ్రిల్లు వలెగాక పిల్లలనందర్నీ ఆకర్షిస్తుంది. వివాహానంతరము మన స్త్రీలు యెట్టి వ్యాయామము లేకపోవుటచే అనారోగ్య వంతులుగా తయారవుతున్నారు. చిన్నతనంలో పాఠశాలల్లో చదువుకునే టప్పుడు సుందరతరమైన కొన్ని నృత్యకరణులు చెప్పించిన అవి వారి జీవితంలో వ్యాయామరూపంగా శరీర సౌష్ఠవానికి ఉత్తమంగా తోడ్పడుతాయి. గుజరాతు మొదలైన ప్రాంతాల్లో స్త్రీలందరు పండుగ సమయాల్లో ఒకచోట కూడినప్పుడు 'గర్భ' మొదలైన నృత్య కాలక్షేపాలతో ఉల్లాసంగా కాలాన్ని గడుపుతారు. కాని మనపండుగ నిస్సారంగా కేవలం పిండివంటకాలను తినుటకే అన్నట్లు ఉపయోగిస్తున్నాం.

అట్లుగాక స్త్రీలందరూ కలిసి వినోదంగా కాలంగడుపుటకు కొన్ని కూట నృత్యాలను మనము యేర్పరచి చిన్ననాడే బాలికలకు నేర్పించాలి. అంతేగాక మన దేశచరిత్రను, మన జాతి యొక్క ఔన్నత్యాన్నీ, దేశనాయకులజీవితాలను నృత్యరూపంలో నేర్పించుట అత్యావశ్యకము. విజ్ఞానవంతులైన మాతృమూర్తులున్నప్పుడే దేశం అభివృద్ధిగాంచుతుంది. జిజియాబాయి వంటి మాతృమూర్తి సుశిక్షణ వల్లనే శివాజీ హైందవ జాతిని ఉద్ధరించాడు.

(2) నృత్య కళనే వృత్తిగా స్వీకరించే వారి శిక్షణవిధానం రెండు విధాలుగా వుంటుంది.

(అ) నేటి తంజావూరు భరతము వలె ఏకపాత్రాభినయానికి పనికి వచ్చే శిక్షణ.

(ఆ) కొందరు వ్యక్తులు కలిసి నృత్త నాటికలు, యక్షగానములు ప్రదర్శించుటకు అనువైనట్టి శిక్షణ.

ఏకపాల నర్తకులు భరత శాస్త్రమేగాక, అలంకార శాస్త్రము, శిల్ప శాస్త్రము, కావ్యములను గూడా విధిగా పఠించాలి. పూర్వపు నృత్యసాహిత్యము, అలారి, జతులు, శబ్దాలు, మంఘూక శబ్దము, జక్కిణి దరువులు, కైవార దివ్య ప్రబంధాలు, శొల్లుకట్టు జతులు, స్వర పల్లవులు, స్వర జతులు, పద వర్ణాలు, పెద్ద వర్ణాలు, తాన వర్ణాలు; క్షేత్రయ్య, సారంగపాణి, అన్నమయ్య మొదలైనవారి పదములు, కృతులు, కీర్తనలు, అష్టపదులు, తరంగములు, శోకములు, తిల్లానలు, తరానలు మొదలైనవేగాక నేటి ఆధునిక కవులు దేవులపల్లి, బసవరాజు, బాపిరాజు, వేదుల మొదలైన వారి భావగీతాలు; నండూరు, కొనకళ్ల మొదలైన వారి యొక్క జానపద సాహిత్యాన్ని గూడా అభ్యసించాలి.

అంతియేగాక నేటి కాలంలో పాశ్చాత్య పద్ధతుల ననుసరించి శిల్ప భంగిమల నాధారంగా తీసుకొని 'ఓరియంటల్' నృత్యాన్ని సృష్టించిన ఉదయ శంకరుడు మొదలైన వారి యొక్క నృత్య సృష్టియందు గూడా కొంత వరకు కృషి సల్పిన యిదివరకు మన నృత్యములో లేని ఒక నూతన చైతన్యాన్ని, సౌకుమార్యాన్నీ, సౌందర్యాన్ని మన నృత్యంలో తీసుకొని రాగలము.

పాశ్చాత్యదేశాలలో 'కోరియోగ్రాఫర్', 'ఇంప్రసారియో' లున్నారు. దేశములో వివిధ పట్టణాలలో వున్న థియేటర్లు వానిలో నృత్య ప్రదర్శనము నిచ్చుటకు పనికి వచ్చేవి. రంగస్థలము యేర్పాట్లు మొదలైనవన్నీ తెలిసి యుండి యెవరైన నర్తకులు తమ ప్రదర్శనముల నిచ్చుటకు ఉత్సాహ పడినప్పుడు వారికి తోడ్పడుతాడు 'ఇంప్రసారియో'.

ఇక నర్తకుడు ఒక క్రొత్త నృత్యమును సృష్టించినప్పుడు దానిని ఎలాగు ప్రారంభించి, యే భంగిమలో ముగిస్తే ప్రేక్షకుల దృష్టిలో రక్తిగా వుంటుందో, యెట్టి విద్యుచ్ఛక్తి దీపాలంకారము కావలెనో, రంగాలం కారములో నృత్యములోని వివిధ ఘట్టాలకు ఎలాగవుండాలో, అందు నాట్యముచేసే వివిధపాత్రలు ధరించే ఆహార్యం మొదలైన విషయాలలో తగువిధంగా సహాయపడి, నృత్యప్రదర్శనం విజయానికి తోడ్పడేవాడు 'కోరియోగ్రాఫర్' మనదేశంలో యిట్టివారు లేరు. కీ॥శే॥ హిరేన్‌ఘోష్, ఉదయశంకరు, సాధన మొదలైనవారి యొక్క ప్రదర్శనములు యేర్పాటు చేసేవారు. కాని బెంగాలు మతకల్లోలంలో వారు అసువులుబాసారు. కనుక మనదేశంలో నర్తకులుగాని, నాట్యాచార్యులుగాని యీ విషయాలన్నీ తెలుసుకోవడం యెంతైనా అవసరముంది.

ఎంత మహా విద్వాంసుడై ననూ, తన కళను ప్రజల ముందు ప్రదర్శించే విధానము తెలియనిచో ఆ నర్తకునికి విజయము చేకూరదు. జానపద నృత్యసాహిత్యం గురించి చెప్పినప్పుడు నండూరివారి 'యెంకి' గురించి కొంత వ్రాయవలసిన అవసరం వుంది. నాకు తెలిసినంతవరకు బెంగాలి, హిందీ, తమిళము మొదలైన యే దేశభాషల జానపద గేయాలలోను 'యెంకి' వంటి అపూర్వసృష్టి మనకు కనిపించదు. 'యెంకి' భారతదేశ సాహిత్యానికి, గేయ కవితను ఆంధ్రులు అర్పించిన అమూల్య కానుక.



అట్టి 'యెంకిని' సరిగానర్థము చేసుకొని ఒక చక్కని స్వరూపమిచ్చి ప్రపంచానికి చూపు బాధ్యత ఆంధ్రనృత్య కళారాధకులపై ఉంది.

నృత్యనాటికలను ప్రదర్శించు వారు వీరే ప్రచార నర్తకులు ప్రజల హృదయాల్లోనికి చొచ్చు కొనిపోయి కళలను ప్రజాసాన్నిధ్యానికి తీసుకొని పోగలరు. వీరికి శాస్త్రీయ దృక్పథంతో కూడిన ఉషాపరిణయం, ప్రహ్లాద మొదలైన భాగవతాలనే గాక, తంజావూరు లైబ్రరీలో మరుగుపడివున్న యక్షగానాల నన్నింటిని బయటికి తెచ్చేబాధ్యత వీరిపైనుంది. గనుక – భాగవతులలో వుండే వివిధ విధములైన నృత్యనృత్త పోకడలు, దరువులు, కందార్థములు, జతులు

మొదలయిన వానిలో శిక్షణివ్వవలెను. అది జరిగిననాడు స్వయంగా వారు ఆ పురాతన యక్షగానాలను సజీవ పరుచగలరు. అంతేగాక నేటి ఆధునిక కవుల రచనల్లో – రాయప్రోలువారి 'వసంతం', విశ్వనాథవారి 'కిన్నెర', శ్రీశ్రీ 'మరోప్రపంచం', పద్మావతీ చరణచారణ చక్రవర్తీ, వకుళ మాలిక, గురజాడ వారి 'కన్నెక' మొదలైనవన్నీ గేయనాటికలు, నృత్యనాటికలుగా ప్రదర్శించ వచ్చును.

## బాలురకు, యువకులకు నేర్పు నృత్యాలు

ప్రస్తుత కాలంలో యెవరైనా యువకులు నాట్యాచార్యులవద్ద నృత్యము నభ్యసించ దలచినప్పుడు, నాట్యాచార్యులు వారికి పురుషతత్వానికి సరిపడునట్టి నృత్యాలుగాక, స్త్రీ భావాలు చిత్రించునట్టి భంగిమలు, ఆంగిక సాత్వికాభినయాలను నేర్పుటచే ఆ యువకుల అభినయము స్త్రీల అభినయమూగాక పురుషుల అభినయమూగాక వికృత రూపముదాల్చి చూచుటకు ఏవగింపు కలిగించునట్లుగా తయారవుతుంది.

అంతేగాక స్త్రీ ప్రకృతిని అలవర్చుకోవడానికి వారు పూర్తికాలమునంతా వినియోగించుట చేత నిత్యజీవితములో యితరసమయాల్లో గూడా భంగిమల్ని, భావాల్ని స్త్రీలవలె ప్రదర్శించుట అలవాటై పోవుటచే నిత్య జీవితములో పనికిరాని వారుగా తయారవుతున్నారు. ఇది మనదేశంలో చాలా మంది నాట్యాచార్యులు చేయు గొప్పపొరపాటు.

కనుకనే నాట్యమందు ఉత్సాహమున్నను యెక్కువమంది విద్యాధికులైన యువకులు ఈ కళను అభ్యసించుటకు ముందుకు రావడములేదు. ఇవిగాక, గోండులు, బైగాలు, భిల్లులు, కోయలు, సవరలు మొదలైన అటవికులు చేయు నృత్యాలలో పురుషులకు పనికివచ్చే నృత్యాలు యెన్నోవున్నాయి. వానినిగూడా సేకరించినచో యువకులకుగూడా నేడు స్కూలు, కాలేజీలలో డ్రిల్లుకు బదులు నృత్యాన్నే ప్రవేశ పెట్టవచ్చును.

## తెలుగు నృత్యకళా స్వరూపము

మన నృత్యానికి పునాదిగా కూచిపూడి నృత్యమే వుండాలి. కాని ఆపద్ధతిలో లేని కొన్ని అంశములను చేర్చుకుని మన సంప్రదాయం చెడకుండా నూతన తేజంతో విలసిల్లే కళను వృద్ధిపొందించాలి. పూర్వం ఒక ప్రాంతం నుండి మరొక ప్రాంతానికి పోవడానికి ప్రయాణ సౌకర్యాలు లేక మనము అన్య ప్రాంతాల్లోని కళను చూడ్డానికిగాని, మనకళను అభివృద్ధిపరచు కొనుటకు గాని అవకాశము వుండేదిగాదు. నేడు వున్న సౌకర్యాలు దేశంలోని అన్ని ప్రాంతాలను మనకు సన్నిహితులను చేశాయి.

అందుచే ఇతర నృత్యపద్ధతులలోని విశిష్టతను మనం సులభంగా గ్రహించగలుగుతున్నాము. దేవులపల్లి, బసవరాజు, బాపిరాజు మొదలైనవారి యొక్క గీతములు, సుకుమారమైన మణిపురి ఆంగికముతో ప్రదర్శించిన కనుల పండువుగా వుండును. భావగీతము లెలాగ మన సంగీతానికి, కవిత్వానికి ఒక నూతనత్వాన్ని కలిగించాయో అలాగే మణిపురి ఆంగికముతో ప్రదర్శింపబడు భావగీతాభినయం కూడా మననృత్యకళకు నూతనశోభను చేకూర్చగలదు.

ఈ భావగీతములను శాస్త్ర ప్రధానమైన భరతనాట్య భంగిమలు, కరణులు, రేచకముల నాధారంగా ప్రదర్శించిన రాణించవు. నృత్యనాటికలను ప్రదర్శించునపుడు, "కథకళి" నృత్య పద్ధతులను మనము కొంతవరకు గ్రహించాలి. నృత్తము 'కథక్' పద్ధతిలో అభివృద్ధి చెందినట్లు మరి యే పద్ధతిలో గూడా పోషింపబడలేదు.

మన పద్ధతులలో – జతిస్వరం, తిల్లానలలో కొన్ని జతులు, తీర్మానములు, నృత్తమాడుదుము. 'కథక్' నందు అట్లుగాక మృదంగములో వలికించిన విధంగా శబ్దాలన్నింటిని, నృత్తమాడుట అభ్యాసంలో వుంది. ఇది మనకు క్రొత్తగనుక ఆ శాస్త్ర విషయాలను మనం అభ్యసించి మన పద్ధతిలో ప్రవేశపెట్ట వచ్చును.

## ఆహార్యము

మూడువిధములైన ఆహార్యమును మనము అభివృద్ధిచేయాలి.

(1) శిల్పములోని ఆహార్యం; (2) అజంతా చిత్రములలోని ఆహార్యం; (3) సాధారణంగా మన స్త్రీలు ధరించే ఆభరణ విశేషాదులు.

**శిల్పములోని ఆహార్యం:–** పురాణేతిహాసముల నభినయించు నప్పుడు; నృత్యనృత్తము లందు వుపయోగపడును.

**అజంతా ఆహార్యం:–** మన ఆధునిక కవులయొక్క గేయాలను,

నృత్యగేయ నాటికలను ప్రదర్శించునప్పుడు వుపకరించును. క్షేత్రయ్య, సభాపతయ్య మొదలగువారి పదములు అభినయమందు సాధారణంగా మన స్త్రీలు ధరించు ఆభరణాదులతోను, వల్లెటూరివారి ఆహార్యము జానపదగేయాలందును ప్రచారములోకి తేవచ్చును. ఈ విధంగా ఆహార్యములో గూడా ఒక నూతనత్వాన్ని మనం ప్రవేశపెట్టవచ్చును.

శాస్త్రీయ నృత్య ప్రదర్శనములో నృత్యక్రమము యెలాగు వుండాలి?

నృత్యవిద్య-నాట్యము నృత్యము, నృత్తము, అభినయము అనియు, ఆంగికము, వాచికము, ఆహార్యం, సాత్వికము, లాస్యము, తాండవమను భేదాలను కలిగివుంటుంది. ఈ భాగాలనన్నింటిని పోషించేదే శాస్త్రీయ నృత్యమగును.

ఇందు ఉద్ధతమై, గంభీరభావ ప్రదర్శనముతో కూడివుండి, పురుషులకు పనికివచ్చే నృత్యము తాండవము, సుకుమారభావ ప్రదర్శనముతో నిండి వుండి స్త్రీలచే ఆరాధింపబడేది లాస్యం.

నాట్యము, నృత్యము మనము చాలా మట్టుకు నృత్యనాటికలు, గేయనాటికలలో చూస్తాము. కనుక శాస్త్రీయంగా దక్షిణాదినందువలె ఏకపాత్రాభినయానికి (Solo Dance) పనికివచ్చే నృత్యపద్ధతిని మనము కూర్చేటప్పుడు పైన చెప్పిన నృత్య, నృత్త, అభినయములను చక్కగా పోషించుటకు యీ క్రింది విధంగా ఆంధ్రదేశంలోని నృత్యకళకు స్వరూప మివ్వాలి.

(1) గణపతి కవుతం, (2) అలరింపు, (3) జతిస్వరము, (4) శబ్దము, (5) వర్ణము (6) పదము, (7) భావగీతములు, (8) జానపదగేయములు, (9) నృత్తము, (10) తిల్లాన.

హైందవ సాంప్రదాయానికి చెందిన నృత్యకళ 'గణపతి' స్తోత్ర నృత్యముతో ప్రారంభించుట సమంజసముగా వుండును. అంతియేగాక ఈ 'గణపతి కవుతం' 72 అక్షరముల అపూర్వతాళం, వినాయకతాళములో రచింపబడింది.

ఈ రచన ఆంధ్రదేశంలో ఒక రిద్దరు నాట్యాచార్యులవద్ద మాత్రమే వుంది. అందునూ 72 అక్షరముల దీర్ఘ కాలముతో గూడిన యీ తాళమును గురువు, లఘువుల విన్యాసముతో నృత్యమాడేవారు అరుదు. ప్రచారములో లేని యితర నృత్యాలవలె యీ నృత్యము గూడా అంతర్థాన మొందకుండా దీన్ని మరల మనం ప్రచారములోనికి తేవాలి.

**అలరింపు:-** ఈ నృత్తము దక్షిణాది వారుకూడా చేస్తున్నారు. 'అలరింపు' అనగా పుష్పించుట లేక వికసించుట, శిలావిగ్రము వలె రంగ స్థలముపై వున్న నర్తకి, సంగీత మాధుర్యము తనపై సోకినంతనే సంచలనం కలిగి తాళలయానుకులంగా అంగ ప్రత్యంగ ఉపాంగములను కదిలించుతుంది.

**జతిస్వరం:-** కరుణ, చాకి, రేచకములతో కూడిన నృత్తము పోషించబడుతుంది. శబ్దంలో- తాళలయల ననుసరించి గతులనాడుతూ, కీర్తనల యొక్క భావానికి ఆంగికాభినయ ప్రాధాన్యమైన నృత్యము ప్రదర్శించబడుతుంది. వర్ణములు, పదములు, భావగీతములందు రసాభినయము పరిపూర్ణత నొందుతుంది.

**నృత్తము, తిల్లాన:-** నృత్తము, ఇందు సంపూర్ణ వికాసము పొందుతుంది. గనుక యిట్టి యేర్పాటు చేసిన-అలరింపు, జతిస్వరము, నృత్తము, తిల్లానలలో నృత్తము;

శబ్దం, వర్ణములలో ఆంగికాభినయ ప్రాధాన్యమైన నృత్యము. పదములు, భావగీతాదులలో సాత్వికాభినయము సమముగా పోషింపబడుతుంది. ఇట్టి పద్ధతి నొకదానిని యేర్పరచి, పెంపొందించి ప్రచారములోనికి తెచ్చినయెడల ఆ కళ మనయొక్క నృత్య సాంప్రదాయంగా వర్ధిల్లుతుంది. నృత్యకళ విరివిగా ప్రచారము జరుగుటకుగాను, యువకులందు వుత్సాహము కలుగుటకు ప్రభుత్వం ప్రతి సంవత్సరం నృత్య, సంగీత, సాహిత్యములందు పోటీలు పెట్టి బహుమానము లివ్వాలి.

నృత్యకళా ప్రచారమునకు సంసిద్ధులైయున్న ప్రచారకులకు ఆర్థిక సహాయము చేయవలెను. పై చెప్పిన పద్ధతులలో మన మొక సంస్థ స్థాపించి నాల్గు సంవత్సరముల శిక్షణ కాలంలో సౌందర్యవంతులు, విద్యాధికుల, త్యాగ మూర్తులైన యువతీయువకులకు శిక్షణనిచ్చి, వివిధ పట్టణాలలో కళా కేంద్రాలను స్థాపించి వారిచే నృత్యమునందు బాల బాలికలకు శిక్షణ నిచ్చినప్పుడే ఒకే విధమైన నృత్యకళ పెంపొంది తెనుగుదనాన్ని వ్యక్తపరిచే శాస్త్రీయ నృత్యాన్ని ప్రపంచానికి ప్రదర్శించగలుగుతాము. మి

## మహిళలలో మణిపూస

# కనుపర్తి వరలక్ష్మమ్మ

- వై.యస్. లక్ష్మి

బాపట్లలో 1896 అక్టోబర్ 6వ తేదీన పాలపర్తి హనుమాయమ్మ శేషయ్యలకు జన్మించింది వరలక్ష్మమ్మ. అన్నల సహాయంతో నాలుగో తరగతి పూర్తి చేసింది. ఆమె బాల్యం నుంచే కనపడ్డ కాగితమెల్లా చదివేది. ఇంటికి వచ్చిన పుస్తకాలు, పత్రికలు ఏవీ వదిలేది కాదు. వీరేశలింగంగారి గ్రంథాలు, చిలకమర్తి వారి నవలలు, విజ్ఞాన చంద్రికాగ్రంథ మండలి వారి పుస్తకాలు "సావిత్రి" అనే మాస పత్రికను సోదరులుతేగా వాటిని చదివేది. రోజుకో వ్యాసం చదివి దాన్ని తిరిగి సొంతంగా రాసేది. ఇలా వాటిని చదివి అన్న నరసింహం సాయంతో చదవడం, రాయడం వరలక్ష్మమ్మ నేర్చుకుంది. ఆరోజుల్లో రాజమండ్రి గౌతమీ పుస్తక భాండాగారంనించి అన్న నరసింహం పుస్తకాలు తెచ్చియిచ్చేవాడు. భారతం చదివి చెప్పేవాడు. నరసాపురంలో స్త్రీలకోసం బహుమతి పరీక్షలు పెట్టేవారు. వరలక్ష్మమ్మ అన్న ప్రోత్సాహంతో ఆ పరీక్షల్లో స్వర్ణపతకం గెలుచుకొంది. మచిలీపట్నం వారి భక్తి సంబంధమైన పరీక్షలలో కూడా ఉత్తమ శ్రేణిలో ఉత్తీర్ణురాలయ్యింది.

ఆమె పెద్దన్న రామమూర్తి గుంటూరులో వనితా గ్రంథమండలి స్థాపించగా అందులో ఆమె గ్రంథాలయంలో పుస్తకాల లెక్కలు రాస్తుండేది. అప్పుడే వచ్చిన కొత్తపుస్తకాలన్నీ చదువుతూ ఉండేది. ఆమె అత్తవారింటికి వెళ్ళేటప్పుడు అన్నగారు "శబ్దార్థ చంద్రిక" అనే తెలుగు నిఘంటువును బహూకరించాడు. ఆ అమూల్యమైన కానుక సాయంతో ఆమె ఎన్నో గొప్ప గ్రంథాలు స్వయంగా చదువ గలిగింది. కృష్ణాపత్రికను చదివేది. చోరగుడి సీతమ్మ సాయంతో వరలక్ష్మమ్మ యువతీ విద్యాలయానికి వెళ్ళి తెలుగు, సంస్కృతం నేర్చుకునేది. ఆపాఠశాలకు ప్రధానోపాధ్యాయినిగా వున్న లక్ష్మీ నరసమ్మ వరలక్ష్మమ్మకు మనుచరిత్ర, శబ్దమంజరి, రఘువంశం చెప్పింది. ఈ విధంగా బాల్యకౌమారదశల్లో వరలక్ష్మమ్మ "డిగ్రీలు" లేని పాండిత్యాన్ని సంపాదించింది. సమాజం పట్ల, సాహిత్యం పట్ల చక్కని అవగాహన పెంచుకున్నది. వరలక్ష్మమ్మ భర్త హనుమంతరావు కూడా సంస్కార హృదయుడు. ఆయన రాజమండ్రిలో చదవుకునేటప్పుడు కందుకూరి సంస్కరణోద్యమంతో ప్రభావితుడయ్యాడు. స్త్రీ విద్యపట్ల గాఢమైన అభిమానాన్ని ఏర్పరచుకున్నాడు. ఆయన రాజమండ్రి నుంచి వస్తూ ఎన్నో విలువైన పుస్తకాలను వరలక్ష్మమ్మకు బహూకరించాడు. ఆమెకు గల సాహిత్యాభిలాషకు ప్రోత్సాహమందించాడు. ఆమె రాసిన కథలను, వ్యాసాలను ఆయనే స్వయంగా పోస్టు చేసేవాడు. రచనావిషయంలోనే కాక, ఉపన్యాసాలిచ్చే విషయంలోకూడా వరలక్ష్మమ్మకు భర్త ప్రోత్సాహం లభించింది. మదనపల్లెలో వుండగా అక్కడి మహిళా సమాజంలో వారం, వారం, ఏదో ఒక విషయంమీద వరలక్ష్మమ్మ ఉపన్యసించి అక్కడి వారి మన్ననలు పొందింది. మదనపల్లె మహిళా సమాజంలో శ్రీమతి సరోజినీనాయుడుతో పరిచయమయింది. గుంటూరు జిల్లాబోర్డు సభ్యురాలిగా ఆమె ఎన్నికయింది. జిల్లా మొత్తం 52 మంది సభ్యులలోను ఆమె ఒకతే మహిళ మూడున్నర సంవత్సరాలపాటు యథాశక్తి సేవచేసింది. ఒకసారి ఆమె అన్న ఆంజనేయులు ఆంగ్లంలో ప్రచురింపబడ్డ ఒక కథను తెలుగులో చెప్పి సొంతంగా ఆ కథని రాయమని చెప్పాడు. ఆమె కథను రాసి ఇచ్చింది.

"సౌదామిని" అనే కలం పేరుతో అనసూయ అనే పత్రికకు ఆయన పంపారు. వారు దాన్ని ప్రచురించారు. అదే ఆమె రాసిన మొదటి కథ. తర్వాత ఆమె సొంతంగా "లక్కబరిణి, ప్రేమలత, స్వీయచరిత్ర, కనకవల్లి, మృత జీవులతో సంభాషణ మొదలైన కథలు రాసి 'అనసూయ' పత్రికకు పంపింది. ఆమె భారతికి రాసిన మొదటికథ 'సుధ', దీర్ఘసుంమగళీభవ, రెండుకోర్కెలు, దరిద్రనారాయణుడని ఆ జగద్రక్షకుడికి బిరుదైతే, నేనే అపరాధిని, ఒట్టు, మూడు తీర్మానాలు, తోటమాలి గురవడు, పెంచిన ప్రేమ, మొదలైనవి

వై.యస్. లక్ష్మి, ఫోన్ : 9912210396

ఆమెరాసిన కథలెన్నో భారతిలో ప్రచురిత మయ్యాయి. భారతిలోనే కాకుండా, తెలుగుదేశంలోని మాసపత్రికలు, శారద, ఆంధ్రభూమి, ఆంధ్రజ్యోతి, వినోదిని, ఆంధ్రవాణి, ఆంధ్రమహిళ, ఆంధ్రపత్రిక, సంవత్సరాది సంచికలలో కూడా ఆమె కథలు వచ్చాయి. వినోదినిలో ఆమె రాసిన కథలన్నీ హాస్యస్ఫోరకమై ప్రత్యేకత సంతరించుకున్నాయి. భారతి తర్వాత ఆమె రచనలను, కథలను విరివిగా ప్రకటించిన పత్రిక గృహలక్ష్మి దాదాపు కొన్ని సంవత్సరాలు ఆమె రచనలేని గృహలక్ష్మి పత్రిక లేదంటే అతిశయోక్తి కాదు. వరలక్ష్మమ్మ బాల్యంలో వారింటి ప్రక్క ఇంట్లో ఆరుగురు ముసలమ్మ లుండేవారు. బడికి వెళ్తూ వెళ్తూ వరలక్ష్మమ్మ ఆ అవ్వల దగ్గర కొంతకాలం గడిపేది. ఏదో ప్రసాదం పెట్టేవారు. ఆమెను ఆప్యాయంగా చూసేవాళ్ళు. వాళ్ళకి చదువురాదు. వాళ్ళ బంధువుల దగ్గర నుంచి వచ్చే ఉత్తరాలన్నీ మూడవ తరగతి చదువుతున్న వరలక్ష్మమ్మతో చదివించుకొనేవారు. అలాగే ఆమెతో జవాబులు రాయించుకొనే వారు ఇలా వారి స్నేహంతో చిన్ననాడే వరలక్ష్మమ్మకు జాబులు రాయడం అభ్యాసమైంది. తరువాత ఆ ప్రేరణతోనే "శారద లేఖలు" ఆమెరాసి మిక్కిలి ప్రసిద్ధి చెందింది.

ఆంధ్రప్రత్రికలో వారం వారం ప్రచురింపబడ్డ "వసంత" లేఖలు. మొట్టమొదటిసారిగా లేఖలు రాయాలన్న కుతూహలం రేకెత్తించింది. స్త్రీలకు సంబంధించిన వివిధ విషయాలు తీసుకుని "కల్పలత" అనే స్నేహితురాలికి "శారద" రాసినట్టుగా రాయడం మొదలు పెట్టింది. 1928లో 'గృహలక్ష్మి' ప్రథమ సంచికలోనే మొదటి శారదలేఖ ప్రచురింపబడింది. నాటినుంచి 1934 వరకు ధారావాహికంగా ప్రచురించ బడ్డాయి. ఆమె రాసిన ఒక్కొక్క లేఖ ఒక మణిపూస. ఒక లేఖలో మూఢవిశ్వాసాలు ఖండించేది. ఒక లేఖలో హృదయ విదారకమైన బాలవితంతువుల బాధల వివరణలు, వర్ణనలు వుండేవి. వరకట్నాలను నిషేధించాలని ఎలుగెత్తి చాటే లేఖలు వుండేవి. పురుషాధిక్యతను తెగనాడి విశృంఖలత్వాన్ని ద్వేషించే భావాలు కూడా లేఖలలో వుండేవి. నాటి జాతీయోద్యమానికి సంబంధించిన విషయాలపై కూడ ఆమె లేఖలు రాసింది. దాదాపు 1950 వరకు కూడా శారద లేఖలు 'గృహలక్ష్మి'లో ప్రచురింపబడుతూ వచ్చాయి. 1930లో 'గృహలక్ష్మి'లో "స్త్రీ అబల కాదు" అనే విషయంపై వ్యాసరచన పోటీని పెట్టారు. ఆ పోటీలో పన్నెండు మంది మహిళలు పాల్గొన్నారు. వారిలో వరలక్ష్మమ్మ ప్రథమురాలిగా నెగ్గి స్వర్ణపతకం గెలుచుకుంది. బొంబాయి కళ్యాణసంఘం వారు 'మహాత్ముని ఉపవాసఫలితం' అనే విషయంపై ఏర్పాటు చేసిన పోటీలో పాల్గొని మహాత్ముని చిత్రం గల రజతపతకం గెలుచుకుంది. వరలక్ష్మమ్మ పధ్నాలుగు సంవత్సరాలప్పుడు ఒక మహిళ ఆమె తల్లి వద్దకు వచ్చి కన్నీళ్లతో తనకష్టగాథను చెప్పింది. ఈ గాథను మనసులో వుంచుకొన్న వరలక్ష్మమ్మ 'వసుమతి' అనే సాంఘిక నవలను రాసింది. ఇది ఆమె మొదటి నవల. ఈ నవలను మద్రాసు టెక్ట్స్ బుక్ కమిటీవారు ఉన్నత పాఠశాలల్లో పఠనీయ గ్రంథంగా ఆమోదించారు. తరువాత 'బాలనీతికథావళి' అనే పుస్తకం రాసింది. విశ్వామిత్ర మహర్షి అనే పుస్తకం ప్రౌఢకావ్య శైలిలో రాసింది. 'జ్యోతి' అనే ఆరోగ్య నాటకం, ఆరోగ్యశాఖవారి ఆమోదం పొందింది.

ద్రౌపదీ వస్త్ర సంరక్షణ సత్యాద్రౌపదీ సంవాదం అనేవి ద్విపదలు, పెన్నను పుచ్చుకున్న నాటి రాత్రి, నవభారతేతిహాసము, మొదలైనవి, ఆమె అచ్చైన పుస్తకాలు. పద్మ, పునఃప్రతిష్ట, జీవనరాం, రాధపెళ్ళి, అనే నాటికలను కూడా ఆమె రాసింది. 1922లో వరలక్ష్మమ్మ మా చెట్టునీడ ముచ్చటలు అనే శీర్షికతో కొన్ని వ్యాసాలు, 'లీలావతి' అనే కలంపేరుతో ఆంధ్రపత్రికకు రాసింది. మంగళాంబ, కనకమ్మ, కళ్యాణి, సూరమ్మ వరలక్ష్మమ్మలవే యీ ముచ్చటలు. మంగళాంబది మద్రాసు, కనకమ్మది నెల్లూరు, సూరమ్మది విశాఖపట్నం, కళ్యాణిది కర్నూలు వరలక్ష్మమ్మది గుంటూరు. ఈ అయిదుగురు కృష్ణాజిల్లా బెజవాడలో ఒక ఇంట్లో కాపురం వుంటూ ఆయింటి ముంగిటవున్న నారింజ చెట్టుక్రింద కూర్చొని తమతమ ప్రాంతాల యాసలతో వివిధవిషయాలపై చర్చించిన అనేక అంశాలే ఈ ముచ్చట్లు. ఇవి పాఠకులను విశేషంగా ఆకర్షించాయి. ఇవి ఉబుసుపోక కబుర్లుకావు. అవి విజ్ఞానంతో పాటు, కొంతహాస్యాన్ని మిళితం చేసుకొని ఆసక్తికరంగా వుండేవి. బెజవాడలో 1929లో జరిగిన మహిళా సభల్లో మొట్టమొదటిసారి వరలక్ష్మమ్మ స్పష్టంగా, నిర్దుష్టంగా మాట్లాడి అందరి మన్ననలు పొందింది. ఆ మరునాడు రామమోహన్ గ్రంథాలయంలో స్త్రీల సభకి ఉన్నవ లక్ష్మీబాయమ్మ వచ్చారు. ఆ సభకు వరలక్ష్మమ్మ అధ్యక్షురాలైంది. క్రమంగా గ్రామసభల్లో పాల్గొనడం, అధ్యక్షత వహించడం అలవాటయిపోయింది. బందరులో మూడవ ఆంధ్రమహిళా సభలో వరలక్ష్మమ్మ విడాకుల చట్టంపై ప్రసంగించి పలువురి ప్రసంశలందు కున్నది.

**మిగతా 74వ పుటలో....**



# వీణాభ్యుదయం

- నందూరి పార్థసారథి

గతసంచిక తరువాయి...

## రకరకాల వీణలు

నేటి సరస్వతీ వీణ లక్షణాలు గల వీణ గురించి 'సంగీతరత్నాకరం' లోని రెండు శ్లోకాలను ఉదహరించిన వీరభద్రయ్య గారు మళ్ళీ 'మనుచరిత్ర' లోని పద్యానికి తాత్పర్యం, చెబుతూ, అప్పట్లో స్వరమండలి వంటి వాద్యమే వుండేదనీ, మేళ వీణలు లేవనీ రాయడం విడ్డూరంగా కనిపిస్తుంది. (వీణ -వీణాపాణులు - 4,5,24, పేజీలు). 13వ శతాబ్దానికే వున్న మేళవీణ 16వ శతాబ్దానికి ఎలా లేకుండా పోతుంది? ఒక రకం వీణ వుంటే ఇంకొరకం వీణ ఎందుకు పోతుంది? ఒకే కాలంలో ఎన్ని రకాల వీణలైనా వుండవచ్చు. సరస్వతీవీణ, గోటువాద్యం, సితార్, సుర్‌బహార్, విచిత్రవీణ, రుద్రవీణ వంటివి ఎన్ని వున్నా యిప్పటికీ స్వరమండలం (సుర్‌మండల్), సంతూర్ వున్నాయి. చాలా మంది హిందూస్థానీ గాయకులు సుర్‌మండల్ పై తాము పాడుతున్న రాగంలోని స్వరాలన్నింటినీ మేళవించుకొని, పాడుతున్నంతసేపూ దాని తంత్రులను మీటుతుంటారు. అంటే, ఒకప్పటి యాళ్ కొద్దిగా మారిన రూపంలో యిప్పటికీ వాడుకలో వున్నదన్న మాట. అలాగే, పాశ్చాత్య సంగీతంలో గ్రాండ్ పియానో అతిముఖ్యమైన వాద్యంగా స్థిరపడిపోయి నప్పటికీ యింకా హార్ప్ వాడుకలో వుంది. హార్ప్ కోసం ప్రత్యేకమైన కంపోజిషన్లు ఐదు శతాబ్దాలుగా వున్నాయి. ఇరవయ్యో శతాబ్దంలో కూడా హార్ప్ రచనలున్నాయి.

యాళ్, విపంచి, స్వరమండలం - పేరు ఏదైనా మన సంగీతచరిత్రలో దాని పాత్ర ప్రముఖమైనది. గ్రహభేదం (లేక శ్రుతి భేదం) అనే ఐడియా మొట్టమొదట ఈ వాద్యం ద్వారానే వచ్చి వుంటుంది. మరో వాద్యం ద్వారా వచ్చే అవకాశం లేదు. ఒకసారి ఈ వాద్యం ద్వారా, తర్వాత సారికలు గల వీణ, సితార వంటి తంత్రీ వాద్యాల ద్వారా గ్రహభేదం టెక్నిక్ తెలిశాక ఇతర వాద్యాల వారు, గాత్ర విద్వాంసులు కూడా


వీణ

ఆ పద్ధతిని అనుసరించి వుంటారు. అంటే, దానికి దారి చూపిన మొదటి వాద్యం స్వరమండలం అన్నమాట. గ్రహభేదం ప్రక్రియ ద్వారా ఎన్నో రాగాలు అవతరించాయి.

ఆధునిక సాంకేతిక పరిజ్ఞానం ద్వారా, ఎలక్ట్రానిక్ పరికరాల ద్వారా గ్రహభేదం వంటి ప్రయోగాలను సులభంగా, వేగంగా సాగించడానికి అవకాశం ఏర్పడుతుంది. ఏ ఏ రాగాలలో గ్రహభేదం ద్వారా ఏ ఏ రాగాలను, ఎన్నెన్ని రాగాలను రాబట్టవచ్చుననే విషయం ఎవరికి వారు తెలుసుకోవడానికీ, రాగనిర్మాణ రహస్యాలను త్వరగా గ్రహించడానికీ అవకాశం కలుగుతుంది.

## తంబూర

వీణసరే-తంబూర సంగతేమిటి? అది ఎప్పటి నుంచి వుంది?

దాన్ని తంబుర, తంబూర, తాన్‌పుర - ఇలా రకరకాలుగా అంటున్నారు. పర్షియన్ వాద్యాలలో 'తంబూరి'

నండూరి పార్థసారథి, ఫోన్ : 9959734534

అనే తంత్రీవాద్యం ఒకటి వుంది. అది మనదేశానికి వచ్చి 'తంబుర' అనే శ్రుతి వాద్యం అయిందా? లేక మన తంబుర అక్కడికి వెళ్ళి 'తంబూరి' అయిందా? మన పురాణాలలోని తుంబురుడికి ఈ తంబురకి ఏమైనా సంబంధం వున్నదా? తుంబురుడు గంధర్వుడు. గంధర్వులు గాంధారదేశానికి చెందిన వారనీ, నాట్యశాస్త్ర గ్రంథావతరణకు ముందే అంతరించి పోయిన గాంధార గ్రామం వారిదేననీ ఒక వాదం ఉన్నది. సప్తస్వరాలలోని గాంధారం కూడా గంధర్వుల నుంచే వచ్చిందా? గాంధారదేశం అంటే నేటి ఆఫ్ఘనిస్తాన్. కౌరవుల తల్లి గాంధారి ఆ దేశపు రాజకుమార్తె. గాంధార అనేదే నేటి ఆఫ్ఘనిస్తాన్‌లోని 'కందహార్' అయిందని కూడా అంటారు.

ఇరాన్‌లోనూ, కొన్ని మధ్య ఆసియా దేశాలలోనూ 'తంబూర్' అనే సామాన్య నామంతో అనేక రకాల తంత్రీవాద్యాలున్నాయి. అవి చాలా వరకు మన తంబూర, సితార్‌లను పోలినవే. వాటిలో ఒక రకాన్ని పర్షియన్లు 'తార్' అంటారు. తంత్రుల సంఖ్యను బట్టి తార్‌కు వేర్వేరు పేర్లున్నాయి. రెండు తీగలున్న దాన్ని 'దుతార్' అనీ, మూడు తీగలున్నదాన్ని 'సెతార్' అనీ, నాలుగు తీగలున్నదాన్ని 'చార్‌తార్' అనీ, ఐదు తీగలున్నదాన్ని 'పాంచ్‌తార్' అనీ అంటారు. 'సెతార్' వాద్యమే ఇండియాలో 'సితార్' అయిందని అంటారు. సితార్‌కి మొదట్లో మూడు తీగలుండేవనీ, దాన్ని 'సెతార్' అనే వారనీ, క్రమంగా దానికి ఏడు తీగలైన తర్వాత అది 'సాత్ తార్' అయిందనీ, చివరికి అది 'సితార్'గా స్థిరపడిందనీ అంటారు. పర్షియన్ భాషలో 'సె' అంటే మూడు.

ఇరాన్‌లోని 'తార్' వాద్యానికి మన సితార్ లాగానే సారికలుంటాయి. తంబూర్ పేరుగల మధ్య ప్రాచ్యవాద్యాలలో సారికలున్నవీ, లేనివీ కూడా వున్నాయి. ఇవన్నీ యిప్పుడు వాడుకలో వున్నవే.

తంబూర మన దేశం నుంచి ఇతరదేశాలకు వెళ్ళిందో, ఇతర దేశాలనుంచి మన దేశానికి వచ్చిందో తెలియదు కాని, మొత్తం మీద అది మన శాస్త్రీయ సంగీతానికి అత్యవసరమైన వాద్యం అయింది. అది లేకుండా కచేరీ జరగదు, నడవదు. పప్పులో ఉప్పులాంటిది అది. సాధారణంగా దాని ఉనికిని ఎవరూ గుర్తించరుగాని, అదిలేకపోతే తెలుస్తుంది ఆ వెలితి. తంబూరను కనుగొనడంతో గాయకుడికి


అబనేరిలోని హర్షత్‌మాతా ఆలయ శిల్పం (9వ శతాబ్ది)

ఆత్మవిశ్వాసం పెరిగింది. అదొక గొప్ప వాద్యం. నడి సముద్రంలో నావికుడికి దిక్సూచి ఎలాగో గాయకుడికి తంబూర అలా ఉపయోగ పడుతుంది. శ్రుతి తప్పకుండా, గతి తప్పకుండా అది ఎప్పుడూ గాయకుడిని కాపాడుతూ వుంటుంది. వీణ, సితార్ వంటి గొప్ప పరిణత తంత్రీవాద్యాలు వాయించే వారికి దాని అవసరం – గాయకుడికి వున్నంతగా – వుండదు. ఎందుకంటే తంబూర నాదం వీణ, సితార్ తంత్రులలో యిమిడిపోయి వుంటుంది. అయినా వీణ, సితార్ కళాకారులు కూడా తంబూర శ్రుతిని వుపయోగించుకొంటూనే వుంటారు. అది వారి సంగీతానికి మరింత రక్తిని చేకూర్చుతుంది. తంబూర నిరంతరంగా మ్రోగుతూ వుంటుంది కనుక వీణ, సితార్ మధ్యమధ్య కొన్ని క్షణాలు విశ్రాంతి తీసుకున్నా, గాన ప్రవాహం ఆగకుండా సాగిపోతుంటుంది. ఇదివరకు కొందరు హిందూస్థానీ గాయకులు కచేరీలో తమకు కుడివైపు, ఎడమవైపు, వెనక వైపు మూడు నాలుగు తంబూరలు పెట్టుకొనేవారు. వాటిని శుద్ధంగా శ్రుతి చేసుకోవడానికే వారు చాలా సమయం తీసుకొనేవారు. శ్రుతి మాధుర్యమే వారికి గొప్ప నిషాగా పనిచేసేది.


తంబూర

ఇప్పుడు ఇదివరకటంత శ్రమ లేకుండా అద్భుతమైన ఎలక్ట్రానిక్ తంబూరలు వచ్చాయి. ఒక్క బటన్ నొక్కితే మనకు కావలసిన పిచ్‌కి అది ట్యూన్ అయిపోతుంది. మన అవసరానికి తగినట్లు వాల్యూమ్ పెంచుకోవచ్చు, తగ్గించుకోవచ్చు.

## అరచేతిలో ఐపాడ్ (I POD)

ఇప్పుడు తాజాగా అరచేతిలో యిమిడిపోయే ఐపాడ్ (I POD) లో తంబూర, తబ్లాలను నిక్షిప్తం చేసుకొనే సౌకర్యం వచ్చింది. మనకు అవసరమైనట్లుగా అందులో శ్రుతి(పిచ్)ని ఎడ్జస్ట్ చేసుకోవచ్చు. ఒకే ఐపాడ్‌లో ఒకేసారి తంబూర శ్రుతి, తబ్లా దరువులు మనకు అవసరమైనంత బిగ్గరగా వినవచ్చు. 30పైగా తాళాలను మనకు అవసరమైన లయ (వేగం)లో వినవచ్చు. కరెంట్‌కి ప్లగ్ చేసుకోవలసిన అవసరం కూడా లేదు. అది బ్యాటరీతో కూడా పనిచేయగలదు. కళాకారుల సంగీత సాధనకు యిది ఎంతో సౌకర్యంగా వుంటుంది. శ్రుతి, లయలు ఎప్పుడూ సెల్‌ఫోన్ లాగా మన జేబులోనే వుంటాయి.

ఆధునిక సాంకేతిక వరిజ్ఞానంతో యిప్పుడు వీణ, సితార్ వంటి వాద్యాల సైజులు, రూపాలు కూడా మారు తున్నాయి. వీటి బరువులూ తగ్గుతున్నాయి. ధ్వని నాణ్యతా పెరుగుతున్నది. తరచుగా ఇతర ప్రదేశాలకు వెళ్ళి కచేరీలు చేసే కళాకారులకు – ముఖ్యంగా విమానాలలో విదేశాలకు వెళ్ళేవారికి – పెద్ద పెద్ద బుర్రలు గల తంజావూరు వీణ వంటి భారీ వాద్యాలను తీసుకుపోవడం పెద్ద సమస్యగా వుంటుంది. అటువంటి వారి కోసం కొన్ని సంస్థలు ప్రత్యేకమైన చిన్న సైజు వాద్యాలను తయారు చేస్తున్నాయి. బెంగుళూరులోని ఒక సంస్థ చిన్న సైజు ఎలక్ట్రిక్ వీణను తయారు చేస్తున్నది. ఇందులో రెండు బుర్రలకు స్క్రూలు ఏర్పాటు చేయడం జరిగింది. ప్రయాణ సమయంలో వీటిని వీణ దండం నుంచి విడదీయవచ్చు. బుర్రలు రెండూ చాలా చిన్నవి. ఆ రెండింటినీ, వీణ దండాన్నీ ఒక ఫైబర్ గ్లాస్ పేటికలో పెట్టుకోవచ్చు. బరువు చాలా తక్కువ. కచేరీ సమయంలో ఈ వీణను ఒక ఎలక్ట్రిక్ పరికరానికి ప్లగ్ చేసుకోవడం ద్వారా ధ్వనిని అవసరం మేరకు ఎడ్జస్ట్ చేసుకోవచ్చు. నాదం అద్భుతంగా వుంటుంది. ఇప్పుడిక వీణ తయారీకి పనస చెక్కనే వాడాల్సిన అవసరం లేదు. ఇలాగే ఢిల్లీలోని కొన్ని సంస్థలు చిన్న సైజు సితార్లను తయారు చేస్తున్నాయి. సొరకాయ బుర్రలకు బదులు టేకు కొయ్యను వుపయోగిస్తున్నారు. మామూలుగా సితార్ కంటె చాలా పెద్దవిగా వుండే సుర్‌బహార్‌లను కూడా చిన్నవిగా తయారు చేస్తున్నారు.




అలాగే యిప్పుడు తంత్రీవాద్యాల తంత్రులలో కూడా మార్పులు వస్తున్నాయి. రెండు వేల సంవత్సరాల క్రిందట జంతుకళేబరాల నుంచి తీసిన నరాలను తంత్రులుగా వుపయోగించే వారు.

వీటికి ప్రధానంగా గొర్రె, మేక నరాలను వాడేవారు. క్రమంగా లోహపు తంత్రులు వాడుకలోకి వచ్చాయి. మొదట రాగి, ఇత్తడి తీగలు, తర్వాత చాలా కాలానికి ఉక్కుతీగలు వచ్చాయి. ప్రపంచంలో ఉక్కు తీగలు తయారవడం, వాటిని వాద్యాలకు వాడడం సుమారుగా క్రీ.శ. 1400 ప్రాంతంలో మొదలై వుంటుందని ఒక అంచనా. మన దేశంలో కూడా వంద సంవత్సరాలు అటూ యిటూగా అప్పుడే ప్రారంభమై వుండవచ్చు. శార్ఙ్గదేవుని కాలానికి ఉక్కు తీగలు వచ్చాయో లేదో తెలియదు.

వాద్యాల నాదగుణం తీగల మీద కూడా ఆధార పడివుంటుందన్న సంగతి మరచి పోకూడదు. తీగమందం, దాని గట్టితనం ముఖ్యాంశాలు. ఒక మెట్టుమీద వేలుపెట్టి, దాని మీదనే మూడు, నాలుగు, ఐదు స్వరాల వరకు పలికేటట్లు తీగను లాగినప్పుడు తీగ తెగిపోకుండా వుండాలి. అంత నాణ్యమైన తీగలు వెయ్యేళ్ళ క్రిందటే వున్నాయా? ఇరవైరెండు శ్రుతులను స్పష్టంగా వినిపించగల నరాల తంత్రులు నాట్య శాస్త్ర కాలానికే వున్నాయా? ఇవన్నీ కచ్చితమైన సమాధానాలు లభించని ప్రశ్నలు.

ఇప్పటికీ కొన్ని వాద్యాలలో మంద్రస్థాయి తంత్రులకు నరాలను వుపయోగించే పద్ధతి పూర్తిగా పోలేదు. సారంగి వాద్యంలో మంద్రస్థాయికి నరాల తంత్రులను

వుపయోగిస్తున్నారు. పాశ్చాత్యదేశాలలో గిటార్లకు నైలాన్ తీగలను విరివిగా వాడుతున్నారు. ఉక్కుతీగల వాడకం బాగా తగ్గి పోతున్నది. క్రమంగా భారతీయ తంత్రీ వాద్యాలకు కూడ నైలాన్ తంత్రుల వాడకం మొదలవు తుందేమో! తంత్రీ వాద్యాల సంగతెలా ఉన్నా మృదంగం, డోలు, తబ్లా, పఖావజ్ వంటి లయ వాద్యాలకు మాత్రం జంతువుల చర్మం వాడడం తప్పని సరి. పాశ్చాత్య సంగీత కళాకారులు డ్రమ్స్‌కు చర్మం వుపయోగించడం ఎప్పుడో మానేశారు. ఇప్పుడు వాటికీ నైలాన్ నే వాడుతున్నారు. కాని, మృదంగం, తబ్లా వంటి వాద్యాలకు నైలాన్ పనికి రాదు. చర్మపు నాదగుణం నైలాన్‌కు రాదు.

## గాత్రం-వాద్యం

ఒకప్పుడు గాత్ర సంగీత విద్వాంసులు వాద్యకళాకారులను కొంచెం తక్కువగా చూసేవారు. సంగీతం అంటే గాత్ర సంగీతమేననీ, వాద్య సంగీతానికి ఆ స్థాయి, గౌరవం వుండదనీ అనేవారు. ఎందుకు ? గొంతులో పలికే గమకాలన్నీ వాద్యాలపై పలకవనీ, వాద్యాలకు చాలా పరిమితులున్నాయనీ వారి వాదం. ఒకప్పుడు అది నిజమే కావచ్చు. కాని, క్రమంగా వాద్యాల సామర్థ్యం పెరుగుతూ వచ్చింది. వాటి నాదాలు ఎంతో మెరుగైనాయి. అసలు మనిషి గొంతు కూడా ఒక వాద్యమేనన్న విషయం జ్ఞాపకం పెట్టుకోవాలి.


అబనేరిలోని హర్షత్‌మాతా ఆలయ శిల్పం (9వ శతాబ్ది)

అది గాత్ర వీణ. ఇతర వాద్యాల లాగానే ఈ గాత్రవీణకూ పరిమితులుంటాయి. గొంతులో పలికే కొన్ని గమకాలు వీణ, సితార్లమీద పలకనట్లే ఆ వాద్యాల మీద పలికే కొన్ని రకాల గమకాలు గొంతులో పలకవు. ప్రతి గాయకుడికీ కొన్ని గొప్ప లక్షణాలతో పాటు కొన్ని అవలక్షణాలు కూడా వుంటాయి. కరీంఖాన్, ఫయ్యాజ్ ఖాన్, బడేగులాం అలీఖాన్, అమీర్ ఖాన్‌ల తర్వాత హిందూస్థానీ సంగీతంలో అంతటి ఒరిజినాలిటీ గల గాత్ర విద్వాంసులు రాలేదు. కాని, వాద్యసంగీతంలో గొప్ప వాళ్ళు వచ్చారు. హిందూస్థానీ సంగీతంలో ప్రథమ శ్రేణి కళాకారులు ప్రతి నలుగురిలో ముగ్గురు వాద్యప్రవీణులే. గాత్ర సంగీతానికి ఆకర్షణ తగ్గుతూ వాద్యసంగీతానికి ఆదరణ పెరుగుతున్నది. ఆధునిక సాంకేతిక పరిజ్ఞానం వల్ల వాద్యాల సామర్థ్యం పెరిగినట్లుగా గాత్ర సామర్థ్యం పెరిగే అవకాశం లేదు. ముందు ముందు వాద్య సంగీతం – ముఖ్యంగా వీణ, సితార్ వంటి వాద్యాల సంగీతం – యింకా పురోగమించే అవకాశం వున్నది.

అయితే, ఒక్క విషయం జ్ఞాపకం పెట్టుకోవాలి. ప్రావీణ్యంవేరు, ప్రతిభవేరు. వాద్యాల సామర్థ్యం పెరగడంవల్ల కళాకారుల ప్రావీణ్యం పెరగవచ్చు కాని ప్రతిభ పెరుగుతుందన్న భరోసా లేదు. టెక్నాలజీ అభివృద్ధి వల్ల యిప్పటి కళాకారులు పూర్వపు కళాకారుల కంటే చాలా తక్కువ శ్రమతో ఎక్కువ ఫలితాన్ని సాధించ గలుగుతున్నారు. కాని, టెక్నాలజీ ద్వారా ప్రతిభను మాత్రం సాధించలేరు. టెక్నాలజీ ఎంతగా అభివృద్ధి చెందినా మరో బిస్మిల్లాఖాన్, మరో విలాయత్‌ఖాన్ అవతరించక పోవచ్చు. I POD లు, I PAD లు ప్రతిభను ఉత్పత్తి చేయలేవు.

అదీగాక పాత పద్ధతులు పూర్తిగా పోవు "ఎన్నైనా చెప్పండి కట్టె పుల్లలతో పొయ్యిమీద చేసే వంట రుచే వేరు. గ్యాస్ స్టౌమీద, ఎలక్ట్రిక్ స్టౌ మీద చేసే వంటకి ఛస్తే ఆ రుచి రాదు. దాలి గుంటలో పిడకల మీద రాత్రంతా కాచే పాలరుచి గ్యాస్ స్టౌమీద మిల్క్ కుక్కర్‌తో కాస్తే వస్తుందా? ఛస్తే రాదు". అనే వాళ్ళు కొద్ది మందైనా ఎప్పుడూ వుంటారు. కాని, ఆ పద్ధతుల్లో వంటచేయడం యిప్పుడు చాలా ఖర్చుతో కూడిన పని.

గొప్ప సింఫనీ ఆర్కెస్ట్రాలు, ఆపెరాలు, బ్యాలేలు ఆడియో, వీడియో సి.డి.లు, డి.వి.డిలు ఎన్ని వున్నా యిప్పటికీ న్యూయార్క్‌లోని కార్నెగీ హాల్ రోజూ హౌస్‌ఫుల్. వెబ్‌సైట్‌లో రాబోయే పదెనిమిది నెలలదాకా ప్రదర్శనల వివరాలుంటాయి. నెలలముందుగా టిక్కెట్లు బుక్ చేసుకోవాలి. లైవ్ పెర్ఫార్మెన్స్ మజాయేవేరు. మి


త్రిపురనేని
రామస్వామి చౌదరి

# త్రిపురనేని భావవిప్లవం

- సూర్యదేవర రవికుమార్

నిరుపమ వీర విక్రముడు నీ ప్రియభక్తుడు బాలచంద్రు డొ
క్కొరుడయి నిల్చి పోరునెడ నూరక చూచుచు నున్న నీవు మ
మ్మరసి కటాక్ష వీక్షణ సమాదరముం గలిగింతువన్న నే
కరణిని మాకు నమ్మకము గల్గును చెప్పవె చెన్నకేశవా !

జాగర్లమూడి కుప్పుస్వామి చౌదరితో కలిసి త్రిపురనేని రామస్వామి చౌదరిగారు గుంటూరు జిల్లా మాచర్ల వెళ్ళి నపుడు అక్కడి చెన్నకేశవ స్వామివారి ఆలయములోనికి ప్రవేశించుటకు విముఖతచూపిన రామస్వామి చౌదరిగారిని కుప్పుస్వామి చౌదరి "మీరు ఈ గుడిలోనికి రాకపోయినా ఈ దేవుని గురించి ఒక పద్యమైనా చెప్పండి" అని అడిగినపుడు రామస్వామి చౌదరి ఆశువుగా చెప్పిన పద్యమిది. ఇది వారి వ్యంగ్యవైభవ కవిత్వానికి, భావనా రీతులకు ఒక మచ్చుతునక. కవిత్వాన్ని సంఘసేవకు ఒక సాధనంగా గ్రహించిన త్రిపురనేని వారు కృష్ణాజిల్లా అంగలూరులో ఒక సంపన్న కుటుంబంలో చలమయ్య, రామమ్మ దంపతులకు 15-01-1887న జన్మించారు. ఎనిమిదవ ఏట అక్షరాభ్యాసము, 12వ ఏట వివాహము జరిగిన తరువాత గుడివాడలోని, మాధ్యమిక పాఠశాలలో చేరారు రామస్వామి. అక్కడ జరిగిన రెండు సంఘటనలు వారి ఆలోచనావిధానాన్ని మలుపుతిప్పాయి.

ఆ పాఠశాలలో రామస్వామితో పాటు అంగలూరుకే చెందిన ఒక బ్రాహ్మణ విద్యార్థి చదువుతుండే వాడు. ఒకనాడు ఇద్దరూ బజారుకు వెళ్ళి చెరొక కానీ (మూడు నయాపైసలు)కి తినుబండారం కారప్పూస కొనుక్కున్నారు. ఇద్దరి డబ్బులూ రామస్వామే ఇచ్చాడు. అయితే ఆ పిల్లవాడి కారప్పూస పొట్లాన్ని దుకాణాదారుని నుండి రామస్వామి అందుకొని ఇవ్వబోతే ఆ పిల్లవాడు "రామస్వామీ! నా పొట్లము నీవు ముట్టుకోకు. నీవు ముట్టుకొనకూడదు" అని తన పొట్లాన్ని తానే దుకాణాదారుని నుండి తీసుకున్నాడు. "వీడికి నా కానీతో కారప్పూస కొనిపెడితే దానిని నేను ముట్టుకొన కూడదంటాడేమిటి?" అని రామస్వామి మథన పడ్డాడు. ఇంకొకనాడు బడికి ఆలస్యంగా వెళితే మాస్టారు కారణం అడిగారు. 'స్నానం వలన ఆలస్యమైనాందడీ" అని జవాబు చెప్పారు. దానికి గురువుగారు "నీకు ప్రాతఃస్నానమా? ప్రాతఃస్నానము, దైవధ్యానము బ్రాహ్మణులకేనోయ్" అన్నారు. అందుకు రామస్వామి "అందుకు అందరూ సమానులే" అన్నాడు. గురువుగారు ఆగ్రహించి పిరియడ్ అయ్యే వరకు నిలబడి ఉండే శిక్షను విధించారు.

1905లో బందరులోని హిందూ ఉన్నతపాఠశాలలో చేరారు రామస్వామి. తొమ్మిదవ తరగతి చదువు తున్నప్పుడు వారికి తెలుగు సాహిత్యంపై అభిమానం ఏర్పడింది. అది గ్రహించిన ఆ వూరి కాంతయ్యనే పండితుడు వారికి సాహిత్యవిషయాలు, సంస్కృత కావ్యాలు బోధించారు. ఆ తరువాత శతావధాని బ్రహ్మశ్రీ చెళ్ళపిళ్ళ వేంకటశాస్త్రి శిష్యులై కవిత్వ మర్మాలను గ్రహించారు రామస్వామి. మెట్రిక్యులేషన్ (10వ తరగతి) చదివే రోజులలోనే రామస్వామి గుడివాడ, తెన్నేరు, అంగలూరులలో అష్టావధానాలు చేశారు. 1907లో బిపిన్ చంద్రపాల్ వందేమాతరం ఉద్యమాన్ని ఆంధ్రదేశంలో ప్రచారం చేస్తూ చేసిన ప్రసంగాలకు ఉత్తేజితులై రామస్వామి 'రాణాప్రతాప్' అన్న నాటకాన్ని 1908లో రచించారు. పలుచోట్ల ప్రదర్శిచబడిన యీ పద్యనాటకం దైవప్రార్థనతో కాక దేశమాత కీర్తనతో ప్రారంభమౌతుంది. దేశభక్తి పూరితమై జాతీయభావాలను ప్రబోధించే ఈ నాటకాన్ని ఆనాటి బ్రిటిష్ ప్రభుత్వం నిషేధించి ఆ పుస్తక ప్రతులను స్వాధీనం చేసుకున్నది.

సూర్యదేవర రవికుమార్, ఫోన్ : 9441547360

తిరుపతి వేంకటకవుల "పాండవోద్యోగ విజయములు" అన్న పద్య నాటకానికి దీటైన నాటకాన్ని వ్రాయగలవా? అని అంగలూరు గ్రామస్థులు కొందరు అడుగగా నెలరోజులలో 'కురుక్షేత్ర సంగ్రామము' అనే పద్యనాటకాన్ని వ్రాశారు. 1911లో వ్రాయబడిన ఈ మూడంకాల నాటకంలో 276 పద్యాలున్నాయి. అప్పటి వరకు జనబాహుళ్యంలో ఉన్న అభిప్రాయానికి భిన్నంగా, పాండవులకు రాజ్యాధికారం లేదని నిరూపిస్తూ రచించబడిన ఈ నాటకం తిరుపతి వేంకటకవుల ప్రశంసలకు కూడా పాత్రమైనది.

**పూరుని నాటనుండి మనపూర్వుల జ్యేష్ఠులె రాజ్యమేలగా**
**గోరిరిగాని, మీవలెనె కొంకక పుట్టిన యెల్లవారలీ**
**ధారుణి మీకు మాకు సముదాయమటంచును పంచగోరిరే**
**పేరున ధర్మరాజవు తపింపకు పెంపకు రాజ్యకాంక్షలన్.**

అన్న దుర్యోధనుని సందేశానికి అనుగుణంగా సాగిన ఈ నాటకంలోని భరతవాక్యమీ క్రిందిది.

**ధర్మజుబోలె నేటివసుధా పతులెల్లరు రాజ్యకాంక్ష దు**
**ష్కర్మము చేయకుందుదురు గాత భయంకర ఘోరజన్మముల్**
**మర్మము తోడ చేయుటలు మానెదుగాత మహేంద్రజాలులన్**
**వర్మము గాగ జేసికొని వర్తిలకుందురుగాత మెప్పుడున్.**

ఈ నూతన భావాలు ఆనాడు సంచలనాన్నే రేపాయి.

రామస్వామి 18-01-1914న బారిష్టరు కాగోరి డబ్లిన్ వెళ్లి 01-11-1917న ఆ పట్టాపుచ్చుకొని తిరిగి వచ్చారు. విదేశాలలో ఉన్న 4 సంవత్సరాల కాలంలో మద్యం, మాంసం ముట్టకుండా తన వ్యక్తిత్వాన్ని కాపాడుకున్నారు. అక్కడి గ్రంథాలయాలలోని అనేక గ్రంథాలను, ముఖ్యంగా భారతీయ పురాణేతిహాసాలను చదివి ఎన్నో విషయాలను సేకరించుకొన్నారు.

ఉత్తర రామాయణంలోని శంబుకుని వధను శ్రీరాముడు గురువాక్యప్రేరితుడై చేశాడని, అది అధర్మమని వివరిస్తూ 'శంబుకవధ' అన్న నాటకాన్ని రచించారు. 20-5-1920న ఇది తొలిసారిగా ప్రదర్శించబడి 1922లో గ్రంథరూపంలో వెలువడింది. ఇందులో కేవలం 24పద్యాలు, 38 మంజరీ ద్విపదలు మాత్రము కన్పిస్తాయి. ఇది వచనప్రధాన రచన. రామస్వామి కవిత్వంలో ప్రభుత్వాన్ని ప్రదర్శిస్తూ 4 ఆశ్వాసాలు, 1932 గద్యపద్యాలతో రచించిన సూత పురాణము అనితరసాధ్యమైన రచన. 'నిఖిల పురాణ వ్యాఖ్యాన విజ్ఞాన సమేతుండయిన' సూతమహర్షిచేత వారు చెప్పించిన విషయాలు ఆనాటికి అతి నవీనమై "అపార పురాణ గోపుర ద్వార కవాట పంక్తుల"ను బదాబదలు చేశాయి. 1925లో ప్రకటించిన ప్రథమాశ్వాసంలో తన రచనకు మూలాలను వివరించారు. పొట్టకూటి కోసం అడ్డమైన దేవురుగొట్టుల నాశ్రయించటం వలన కవులస్వాతంత్ర్యం మంటకలిసి పోయిందని, కవులు స్వతంత్రులుగా ఉండాలని, తన రచనలో పౌరాణిక కథనాలకు విరుద్ధంగా ఉన్న వ్రాతలను చూచి ఆలోచించకుండా పరుషోక్తులకు దిగవద్దని పురాణాలను తాను సాంగంగా చదివానని, తనకు కలిగిన సందేహాలను సూతమహర్షికి విన్నవించగా అతడు తెలిపిన విషయాలనే తాను చెపుతున్నాననీ విన్నవించారు.

**సాథోజనాథుండు భగవంతుడొకచోట**
**నొకచోట స్త్రైణశాపోపహతుడు**
**అళికాక్షు దద్వితీయ బ్రహ్మమొకచోట**
**నొకచోట ఋషిపత్నులకు విటుండు**
**అజ్జగర్భుండు స్వయంభువొ నొకచోట**
**నొకచోట శత్రు పాదోపహతుడు**
**దేవకీపుత్రు డింద్రియ జేత యొకచోట**
**నొకచోట జారపాలికి గురుండు**
**శుకపరబ్రహ్మమొకచోట శుద్ధజడుడు**
**వెఱెయొకచోట సంసారి బిడ్డతండ్రి**
**అన్ని కథలీపురాణము లందె కలవు**
**పిట్ట కథలకు నివియెల్ల ( బుట్టినిండ్లు.**

అని ప్రకటించి తన సంశయాలను సూతుల వారికి విన్నవించి వాటిని నివృత్తి చేసుకున్నారు. సూత మహర్షి అద్విజులు కూడా సంస్కృత భాషను చదువవచ్చునని చెప్పి మరిన్ని విషయాలను చెప్పేందుకు వ్యాసుల వారిని సంస్మరించి రప్పించారు. వ్యాసుల వారి ద్వారా ధర్మవ్యాధుని వృత్తాంతాన్ని, ధర్మము యుగాన్ని అనుసరించి మారదు అన్నసత్యాన్ని, కబీరు పూర్వజన్మ వృత్తాంతాన్ని విన్పించాడు.

1929లో ప్రకటించిన రెండవ ఆశ్వాసంలో దేవలోకం, దేవేంద్రుడు, దేవతలు మొదలగు వారిని గురించిన తన సందేహాలకు సూతుడు "స్వానుభవంబున నెఱిగిన సమాచారంబు"ను తెలిపిన తీరును వివరించారు రామస్వామి.

**కైలాసగిరి ముందు గల గండశైలంబు**
**పుడుకులిచ్చెడి లింగమూర్తిగాగ**
**నల్లిబిల్లిగ(జుట్టునల్లు పుష్పలతాచ**
**యంబు చంద్రార్ధ జూటంబు గాగ**

ప్రస్థంబుపై నుండి పడుచున్న జలధార
తరళగంగా ప్రపాతంబు గాగ
పడి జాలుగా బాఱు వఱ్ఱు భగీరథు
నడుగంటి చనుగంగ నడకగాగ
నమ్మకం బుట్టిపడునట్టు నకిరి, బుద్ధి
పూర్వకంబుగా లోకముం బుండలించి
చిత్రకథ వ్రాసినారు ప్రాచీన కవులు
స్వార్థమో! పరార్థమో! భగవంతు దెఱుగు.

అంటూ గంగావతరణాన్ని వర్ణించారు. ఇంకా ఈ ఆశ్వాసంలో దేవేంద్రసభ, సూతనారద సంవాదము, ద్రౌపదీ దృష్టద్యుమ్నుల జన్మరహస్యాలు, వివరించబడ్డాయి.

1934లో ప్రకటించబడిన తృతీయాశ్వాసంలో యథార్థ ప్రహ్లాదచరిత్ర, యథార్థ రామాయణము చెప్పబడ్డాయి. రామస్వామిగారు వీటిని ఆర్య, ద్రావిడుల సంఘర్షణలకు ఉదాహరణలుగా చెప్పారు. రావణుడు కోయదొర అని అతడికి 10తలలు లేవని, కోయభాషలో ఇతరులకు బాధను కలుగజేయువాడు అను అర్థంగల దసగీవ పదాన్ని దశగ్రీవగా సంస్కృతీకరించి కవులు విపరీతార్థాన్ని చెప్పారని వివరించారు. హనుమంతుడు రావణుని చూచి తనమనసులో తలపోసిన తీరును రామస్వామి అద్భుతంగా వర్ణించారు.

వీడటే రారోయు వీడటే చౌరబాతీ
కైకొన్న వాడటే గాలికలము
వీడటే ముక్కంటి వీడటే పైకెత్తి
క్రొండాడి నాడటే కొండవీడు
వీడటే నాడటే వెట్టివారల జేసి
పీడించి నాడటే వేల్పుమూక
వీడటే కొడుకుచే పెడతెక్కలను గట్టి
తెప్పించి నాడటే దివిజనాథు
వీడటే తనవీడీడు జోడుజాద
లేని దానిగా జేసిన మానఘనుడు
చేతులను నెత్తి జోహారు సేయుతలపు
పుట్టుచుండెనిప్పుడు త్రాట గట్టబడిన.

చతుర్థాశ్వాసంలో శ్రీకృష్ణుని కథ అద్భుతంగా చెప్పబడింది. అతడు "భరత వర్షంబును నఱచేతనిడుకొని దేగాట యాడించిన" వాడట. శ్రీకృష్ణుడు, ఏకలవ్యుడు అన్నదమ్ముల బిడ్డలని వారి వంశవృక్షాలను ఇచ్చి నిరూపించారు. నందుని ఆలమందలను, శ్రీకృష్ణుని రాసలీలలను వర్ణించిన తీరు మనోహరం. ఇక రాయబార ఘట్టంలోని రామస్వామిగారి నాటకీయ రచనకు పాఠకులు ఆశ్చర్యచకితులు కావలసినదే.

రామస్వామిగారి సూతపురాణములోని విషయాలతో విభేదించినవారు కూడా ఆ రచనలోని కవితారమణీయతను వేనోళ్ళ ప్రశంసించారు. వారి రచనాశైలికి ముగ్ధులైనారు. రామస్వామిగారికి 4-11-1929న ఆంధ్ర మహాసభవారు 'కవిరాజు' అన్న బిరుదును ప్రదానం చేశారు. విజయవాడలో జరిగిన ఈ సభకు కడప కోటిరెడ్డిగారు అధ్యక్షులు. ప్రముఖ దేశభక్తులు, ఆంధ్రపత్రిక, భారతి పత్రికల అధిపతి కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుగారు ఈ బిరుద ప్రదానాన్ని ప్రతిపాదించగా, ప్రముఖసాహితీవేత్త కృష్ణాపత్రిక సంపాదకులు ముట్నూరి కృష్ణారావుగారు దానిని బలపరిచారు. రామస్వామిగారు ఆ సభకు హాజరు కాకపోవటంతో ఈ బిరుదప్రదానం పరోక్షంగానే జరిగింది. ఉప్పుసత్యాగ్రహం జరిగే రోజులలో 26-01-1930న శరణు రామస్వామిగారు 300 మంది సత్యాగ్రహులతో తెనాలి వచ్చినపుడు వారికి స్వాగతంపలుకుతూ...

వీరగంధము తెచ్చినారము వీరులెవ్వరొతెలుపుడీ
పూసిపోదుము మెడనువైతుము పూలదండలు భక్తితో

అని కవిరాజు వ్రాసిన గేయం మరపురానిది. ఆనాడు ఉన్నవ లక్ష్మీనారాయణగారి సతీమణి శ్రీమతి లక్ష్మీబాయమ్మగారు దీనిని పాడగా వారు స్థాపించిన శారదానికేతనం పాఠశాలలోని విద్యార్థినులు సత్యాగ్రహులకు వీరగంధంపూసి వీరతిలకం పెట్టిన ఘట్టం చరిత్రాత్మకమైనది. అదే సంవత్సరం ఆగష్టులో జరిగిన పికెటింగ్ సందర్భంగా విదేశీవస్త్ర బహిష్కరణకు బలాన్నిచ్చే 'పిలుపు' అనే గేయాన్ని వ్రాశారు కవిరాజు. ఇంకా తెలుగువారిని హెచ్చరిస్తూ వారు వ్రాసిన గేయం కూడా ప్రసిద్ధమైనదే.

తప్పుపాటలు పాడబోకుము
తప్పుమాటలు చెప్పబోకుము
తప్పుకథలను చదవబోకుము
తప్పుదారుల ద్రొక్కబోకుము
ప్రాతకథలను తెలిసి చదువుచు
పాటపాడుము పరులు మెచ్చగ
కల్లవ్రాతలు తొలగ బుచ్చుము
కల్లకథలను బులిమి పుచ్చుము
తెలుగు బిడ్డా! తెలుగు చరితను
నేటికైనను తెలుసు కోరా!

తెలుగువారికి ఒక రాష్ట్రం కోసం వారిని ఇలా ఉత్తేజితులను చేశారు.

**తెలుగుబిడ్డా! మరచిపోకుర**
**తెలుగు దేశము పురిటిగడ్డర**
**కొక్కొరోకో పాటపాడర**
**తెలుగువారల మేలుకొలుపర**
**తెలుగుమంత్రులు మంత్రవిదులై**
**మూగనోమును బట్టినప్పుడు**
**తెలుగు శాసనసభ్యులెల్లరు**
**తెల్లమొగములు వైచునప్పుడు**
**తోడుబోతుల నమ్మనేలా!**
**కాదు పలిచిరి అనగనేలా!**
**తోడు తోడుత నడుము గట్టిన**
**నూడిపడదే తెలుగురాష్ట్రము.**

కవిరాజుగారి గేయాలు కదంతొక్కేలయతో పరుగులు తీస్తుంటాయి.

1935లో కవిరాజుగారు శ్రీవిశ్వనాథ సత్యనారాయణగారు రచించిన 'వేనరాజు' అన్న నాటకాన్ని చదవటం జరిగింది. అందులోని విషయాలు వారిని కలవరపరిచాయి. 'వేనరాజు' యదార్థ చరిత్రను పరిశోధించి ఆ నాటకానికి ప్రతిగా "ఖూనీ" అనే నాటకాన్ని రచించారు. వైదికధర్మాలను పాటించని వారిలో కూడా ఉత్తమ పురుషులున్నారని, వారు దుర్మార్గులుకారని, వేనరాజు ఉత్తముడని నిరూపించారు. ఈ నాటక రచనలో పద్యాల సంఖ్య బాగా తగ్గించ బడింది. కేవలం 7 పద్యాలు, మరో 7 గేయాలు మాత్రమే ఇందులో కన్పిస్తాయి.

వెనుకటి పెద్దలు చెప్పని నీతులను చెప్పాలని భావించి కవిరాజు 'కుప్పుసామి శతకము'ను రచించారు. దీనిలో నీతులతోపాటు సాంఘికవిమర్శ కూడా కన్పిస్తుంది.

**నీతిలేని వాని నిరసించు జగమెల్ల**
**నీతిశాలి కెపుడు నెగడు లేదు**
**నీతిశాలి నెపుడు నీతియే కాపాడు**
**కుజను బారినుండి కుప్పుసామి**
**గుడికి తరచుపోయి గొణుగుచుండెడివారు**
**చెడ్డపాపమేదొ చేసియుండు**
**నదియె వాని బట్టి యట్టిట్టు పీడింప**
**గుడికి పోవు నతడు కుప్పుసామి**

1940లో కవిరాజు 'ధూర్తమానవా!' అన్న మకుటంతో శతక రచన ప్రారంభించి 36 పద్యాలు వ్రాశారు. భగవంతుడే కవిగారికి కలలో కన్పించి మానవులు తనకు చేసే అన్యాయాలను భగవంతుని ఆవేదన చూడండి.

**ఏ నొకజాతి కూడు భజియించుచు మిక్కిలి తక్కుజాతులన్**
**హీనముగాగ జూతునని యెవ్వరు సెప్పిరి నీకు వంచకా!**
**మానవులందరున్ సరిసమానులు గారొకొ నాకు మాయురే**
**మానవకనీవ యిట్టి యవమానము జేతువె ధూర్తమానవా!**

ఉన్నవ లక్ష్మీనారాయణగారు కవిగారి మిత్రులు. వారు భగవద్గీతకు వ్యాఖ్యానము వ్రాయవలసినదిగా కవిరాజు గారిని కోరారట. కవిరాజు భగవద్గీతలోని అంశాలను పరిశోధించి అందు చెప్పబడిన కొన్ని ధర్మాలను పరిహసిస్తూ, పలనాటి బ్రహ్మనాయుడు బాలచంద్రునకు చెప్పినట్లుగ నూతన "భగవద్గీత"ను 1941లో రచించారు. ఇదే కవిరాజుగారి చివరి రచన.

**మృతిని బొందిన మనుజులు పితరులేదు**
**రనుట, పితృలోక మున్నదియనుట, పిండ**
**ములకునై యందు పితరులు మొగము వాచి**
**యుందు రంచు వాకొనుటెల్ల హుళి, హుళక్కి!**

ఈనాడు భారతదేశంలోని వర్ణాలలో సంకరం కాని వర్ణమొకటి కూడా లేదని, వర్ణాంతర వివాహాలు పూర్వం నుండి ఉన్నవే అని ఎన్నో దృష్టాంతాలు చూపించారు.

**ఆసలలో నడియాసను / బూసలలో నెల్ల కొలికి పూసను నేనే**
**రాసులలో నద్రాసిని / బాసలలో నెల్ల తెల్గు బాసను నేనే.**

అంటూ గీతాచార్యుని పలుకుల నెద్దేవా చేశారు.

భారతీయులలో తరతరాలుగా పేరుకు పోయిన భావదాస్యాన్ని ఛేదించటానికి వ్యంగ్యంతోను, పరిహాసంతోను నిండిన సాహిత్యాన్ని తిరుగులేని సాధనంగా ఉపయోగించు కొన్నారు కవిరాజు. తెలుగు సాహిత్యంలో విపులమైన విమర్శకు తన రచనల ద్వారా కావ్యత్వాన్ని కలిగించారు. అనేక రచనలు చేసినా దేనినీ ఎవరికీ అంకితమీయక "కవిరాజు"గా నిలిచారు. రామస్వామి చౌదరిగారు. రామస్వామిగారికి ఎన్నో సన్మానాలు జరిగాయి. వాటిలో 1942లో గుడివాడలో జరిగిన సన్మానంగొప్పది. 55 ఎడ్ల జతలను కట్టిన బండిపై వారిని ఊరేగించి, గజారోహణం చేయించి, గండపెండేరాన్ని బహూకరించటం ఆ సన్మాన కార్యక్రమ ప్రత్యేకత.

రామస్వామిగారు తెనాలిలో స్థాపించిన 'సూతాశ్రమము' ఎందరికో సాహిత్యపాఠశాల అయింది. నూతన భావవిప్లవానికి పుట్టినిల్లయింది. అక్కడనే రామస్వామి చౌదరిగారు 1943 జనవరి 16న స్వర్గస్థులైనారు. మి

# సముద్రాల హోరు

 - సముద్రాల వేంకటకృష్ణ

మామూలుగా *మిసిమి* పత్రిక చదవటానికి రెండు, మూడు రోజులు పడుతుంది. ఎందుకంటే రోజంతా అదే చదువను కనుక. కానీ ఆగష్టు *మిసిమి* తెరవగానే కమ్మ(ని) తెమ్మెర కమ్మి ఏక బిగిని చదివాను. వదల బుద్ధి వేయలేదు. ఈ సారి సంచిక నాకొరకేననిపించింది. ఎత్తుకోగానే (నెల్లూరు భాష) శ్రీధరుని మచిలీపట్టణము (లేక పట్నమా?). ఈయన కార్టూన్లు నాకు ఆర్కే లక్ష్మణుని వ్యంగ్య చిత్రాలంతిష్టం.

కానీ మచిలీ పట్టణంలో ఆయన (రాంభట్ల) వాదం సరికాదని నా అభిప్రాయం. దాదాపు 55 ఏళ్ళ క్రింద స్వతంత్ర, భారతి వంటిసాహిత్య పత్రికలలో (ఆ రెజుల్లో అట్లాంటివి వుండేవిలెండి) పట్టణమంటే రేవా, సముద్రతీరమా అన్న చర్చాఅంశము ధారావాహికముగా వచ్చేది. చివరకు కౌంటర్ ఎక్సాంపుల్స్ ద్వారా కాదన్న నిర్ణయానికొచ్చారు.

ఉదాహరణకు విశాఖ జిల్లాలోని నర్సీపట్నం. బెంగుళూరు నుంచి మైసూరు వెళ్లేదారిలోని చెన్నపట్టణ, సముద్ర తీరాలు కావు. (ఇది నాకు నచ్చలా). పట్నానికి పట్టణానికి తేడా ఉందన్నది నా భావము.

సిల్క్‌కు మసిలి అన్న పదం సరికాదు. మస్లిన్ అన్నది పారసీక పదము, అతి సన్నని నాజూకైన వస్త్రమును మస్లిన్ అంటారు. తెలుగులో సిల్క్‌ను పట్టు అంటారు. ఉర్దూ (పారశీకము + అరబ్ + సంస్కృతాదులు) లో రేష్మి అంటారు. కాబట్టి పట్టు వస్త్రాల ఎగుమతి జరిగే రేవు కావున మసిలి బందరన్నది సరికాదు "అనుకుంటా". పైగా మచిలీపట్నం (పెడన) అనాదిగా అద్దకానికి (కలంకారీ) పెట్టింది పేరు. ఇప్పటికీ చుట్టుపక్కలెక్కడా సిల్కు పరిశ్రమున్నట్టులేదు. మచిలీ పట్టణానికీ భారతంలో వచ్చే మత్స్య దేశానికీ సంబంధముందో లేదో నేను చెప్పలేను గానీ, చేపకూ మఛిలీ పట్టణానికీ సంబంధం లేదనటం మటుకూ, శ్రీధర్ కార్టూనంత నవ్వా తెప్పిస్తుంది. బందరు చేప సంగతి సముద్రాల వాణ్ణి నాకు తెలియదా!! చాలా ఏళ్ళ తర్వాత వివికే రంగారావు మాట చదివాను. ఆంధ్ర పత్రికలో అనుకుంటా కినిమా సంగీత పాయసంలో సాహిత్యపు జీడిపప్పుల గురించి ప్రతి వారం వ్రాసేవారు. వీరి వీరి గుమ్మడిపండు వీరేనా? అయితే నమస్కారాలు సార్. మీ అభిమాన్ని. అసలు సినీ మాయలో సాహిత్యపు విలువలెన్నో ఉంటాయన్న సత్యాన్ని మీ ద్వారానే గ్రహించాను. ఆవిధంగా మీరు నాకపకారం చేసారు. మీరు చేసిన అలవాటుతో ఇప్పుడు కూడా (వీధి చివరిన చెత్త కుండీలో వెయ్యి రూపాయలనోట్ల కట్ట కోసమ్ వెతుకుతున్న పిచ్చివాడిలా) ఇప్పటి కినిమాల్లో సాహిత్యపు "వాల్యూస్" వెతుకుతున్నా!

ఆంధ్ర పత్రికలో మీ శీర్షిక వెలువడుతున్న రోజుల్లోనే నండూరి పార్థసారథో, ముళ్ళపూడాయనో, ఎస్వీ రంగారావు గారిపై ఒక సచిత్ర వ్యాసం వ్రాసారు. పాతాళ భైరవిలో మాంత్రికుడి బొమ్మ దానికింద 'క్రూ రంగారావు', మిస్సమ్మ పాత్ర కింద 'హాస్యంగారావు', పెళ్ళి చేసి చూడు బొమ్మ కింద 'గంభీరంగారావు' ఇట్లా. అది చూసి టెంప్ట్ అయ్యి మీ పేరును వాక్‌రంగారావు అనకుండా ఉండలేక పోయాము. క్షమించండి అయినా అప్పుడు మీది బొబ్బిలి అన్న అభిప్రాయంలో ఉండి పోయాం ఎందుకో. మరి ఇప్పుడు చూస్తే మీది "మద్రాస్" అని ఉంది. ఆ రంగూ, ఈ రంగూ ఒక(టే)రేనా?

నా మిత్రుడు (యార్)లగడ్డ బాలగంగాధరుని గోదావరి గురించి. నేను చరిత్రకారుణ్ణి. హీనుణ్ణి కూడా కాదు. తెలుగు పండితుణ్ణి. అట్టాంటాయన పుత్రుణ్ణీ కాదు. ఏదో లెక్కలేసుకొనే బక్కోణ్ణి. కానీ తెలుగంటే మా ఇంటిపేరంతాభిమానమున్నోణ్ణి. ఆంధ్రులు ద్రావిడులు. ఆంధ్రభాష ద్రవిడ భాష అంటే నేనడ్డంగా తలూపుతా. ఆంధ్రజాతి శపింపబడ్డ జాతి అని ఐతరేయం నుంచి తెలుసు. విష్ణుసహస్ర నామాల్నుంచి (చాణూర ఆంధ్ర నిషూదన:) ఆంధ్రజాతిని శ్రీకృష్ణుడు

ఉద్ధరించాడనీ గమనించ వచ్చు. మిత్రగడ్డ వారు చెప్పినట్టు, ఆంధ్రులు దక్షిణాదికి వలస వచ్చారు. కాబట్టి, ఆంధ్ర'భాష' ద్రవిడము కాదు. అసలు "ద్రవయతి ఇదమ్" ద్రవిడమునకు వ్యుత్పత్తి అని నా అంచనా. ఇక గోదావరి దగ్గరకొస్తే, ఇప్పటికీ మారార్వాడా లో, పైఠణ్ (పురాతన ప్రతిష్ఠాన పురము) నుంచి బాసరము దాటే వరకు, గోదావరిని పాతతరం వారు గంగనే అంటారు. నాందేడు లో ఒక పత్రిక నడుస్తుంది. దాని పేరు "గోదా తీర్ సమాచార్." గో అన్నది ఆంధ్ర పదమని నేనంటాను. ఆంధ్రములో గో అనగా శుభము. మంచి పునీతము అని. ఆపు మంచికి సంకేతము అని భావన కాన, గో శబ్దము దానికతికించారు. (అన్ని భాషలనుంచి సంస్కృతం పుట్టిందని నా వాదము). శుభమునిచ్చేది గోద (ఆండాళ్ళమ్మ). అట్లాంటి వాటిలో శ్రేష్ఠమయినది గోదావరి.

ఆంధ్ర భాష లేదంటారా. అయ్యా ఆంధ్ర భాష గోదావరి పాయలవంటి చీలికలయ్యి కనడ లేక కర్ణాట, తెలుంగు ఇత్యాది భాషలుగా మారింది. కర్ణాట పై ఈ సంచికలోనే ఒక వ్యాసమున్నది. మంగళంపల్లి బాల మురళికృష్ణగారు కర్ణాటకు చెవికింపైనదని వివరించారు. కానీ కరు నాడు (క్రియా సీలత్వ దేశము) కర్నాదని సముద్రాల (అంటే నేనే) భావము. కాశీ తర్వాత రెండూ కలుస్తాయి అని ఒక సంస్కృత విదూషిణీమణి చెప్పింది. ఆవిడ మాథ్స్‌లో నా దగ్గరే పి.హెచ్‌డి చేసింది. నేనొప్ప. వారణ అంటే కల్యాణము. (పెళ్ళి కాదు) అసి అనగా ఉన్నది. వెరసి వారణాసి= కల్యాణప్రదమైనది. శ్రీరంగమును నేను శ్రీ: = అంగము గా సాధిస్తాను. కావేరి మధ్యన మైసూరు వద్ద కూడా ఒక ద్వీపముంది. అది శ్రీరంగపట్టణ (పట్న). తిరుచినాపల్లి వద్ద ద్వీపము చాల పెద్దది. శ్రీరంమందులో భాగము. ద్వీపానికి ఇలంగై అన్నది తమిళ సంకేతము. రామాయణంలో లంకను గుర్తించటానికి తెన్నిలంగై (దక్షిణలంక) అని వాడతారు (చూడండి తిరుప్పావై).

ఇంకొక్కమాట, గంగాధరుడంటే శివుడనుకొంటే, శివుడి బాల్యమేమిటో తెలియదు. బహుశా ఏ సుమేర్‌లోనో గడిపి ఉంటాడు. శివుడు ఇంపోర్టెడ్ దేవుడు లెండి. అయినా శివుడుకూడా, పార్వతికి సగం వళ్ళిచ్చేసాక చోటులేక గంగను నెత్తికెక్కించుకొన్నాడట. మరి ఈ బాలగంగాధరమేమిటి? చెప్తా. దాదాపు 30 ఏళ్ళ కిందట ఒక ఆచార్యుని ఆహ్వానం పురస్కరించుకొని ఐ.ఐ.టి కాన్పూరులో కొన్ని రోజులుపన్యాసాలివ్వడానికి వెళ్ళా. ఆచార్యుడు స్టేషన్‌కు రాలా. కారు పంపించారు. ఆయనకు బాగా లేదని తెలిసి గెస్ట్ హౌస్ నుంచి ఆయనింటికి వెళ్ళాలని బయలుదేరా. కాంపస్ చాల మారింది. ఒక క్వార్టర్ వద్ద నాలుగో అయిదో పొడి అక్షరాలు. తర్వాత బి.జి తిలక్ అని కన్పించింది. ఆ ఇంటి తలుపు కొట్టి, ఆవిడ రాగానే తెలుగులో అడిగా ఫలానా ఆచార్యుని ఇల్లు ఎక్కడా అని, ఆవిడ చెప్పింది. కాని ఆశ్చర్యంగా అడిగింది. 'అందరూ మమ్మల్ని మరాఠీ వాళ్ళనుకుంటారు. మీకెట్లా తెలిసింది మేము తెలుగు వాళ్ళమనీ" నేను మహారాష్ట్రలో 16 ఏళ్ళు పనిచేసా. మన తెలుగు మహాత్మ్యమేమిటంటే, గొప్ప వాళ్ళ వంటిపేరు, ఇంటిపేరు, తండ్రిపేరు, కూడా తగిలించేసుకోటమ్. బాళ్ అనేది ముద్దు + సుద్దు పేరు. గంగాధర తండ్రి పేరు కూడా తిళక్ (ళ ఏ నండోయ్ రంగారావు గారూ) కుటుంబం పేరు. వెరసి బాళ్ గంగాధర తిళక్. అంతే గానీ ఈయన బాల్యం నుంచీ గంగను మోసే ఇద్దరుపెళ్ళాల ముద్దులా మొగుడు కాదు. నాకు పాసు మార్కులేస్తారా ప్రొఫెసర్ గారూ? పరుసవేది (మానవ శాస్త్రము, Anthropology అనుకుంటా).

మిగతా విషయాలెట్లాఉన్నా. గణితం దగ్గర తప్పుల తడకే. ఒకటి రెండు. పూర్ణాంకాలు స్వార్థము. నాది, నీది అనే భేదబుద్ధితో పుట్టినవి. జ్యామితికి ఆధారం భూమి కొలతలే గానీ ఆకసంలోని చుక్కలు కావు. యూక్లిడ్ భౌగోళిక జ్యామితి axiomatic గా క్రమీకరించారు. నిజానికది ఖగోళ దర్శనానికి పనికి రాదు. ఆయన ప్రతిపాదించిన మూల సూత్రాలలో 5వది సత్యమనడానికి లేదు. 2000 ఏళ్ళ పిదప రైమన్, లోబచెవిస్కీలు ఈ 5వ సూత్రము కాదని నవీన జ్యామితి సృష్టించారు. ఐన్‌స్టీన్ సాపేక్ష సిద్ధాంతులకదే ప్రాణము. మనము వేసేవి అరబిక్ అంకెలు కావు. నేను అరబ్ దేశాలలో ఉన్నాను. అరబ్ న్యూమెరల్స్ ఇవికావు. కెప్లర్ ప్రత్యక్షాలు గణిత పరంగా చెప్పేందుకు న్యూటన్, తాత్త్వికంగా లీబ్నిస్, మార్పు కొలమానానికి భాస్కరాచార్యులు కలసి గణితమును సృష్టించారు. అందులో పైఠన్ భాస్కరుడు ఆద్యుడు (ఆంధ్రుడు). గణితంలో భారతీయ ప్రసక్తి లేక పోవటమ్ శోచనీయము.

20వ శతాబ్దపు రామానుజన్ చూపిన కొన్ని విచిత్రాలుటంకించక పోవటం, గణితానికవమానము. ఉదా: 1+2+3+...రామానుజన్ చెప్పేదాక ఎవ్వరూ ఊహించను కూడా లేదు. ఈ లెఖ్ఖ ఇపుడిపుడే బయటికొస్తున్న string

theory లో అత్యవసర కీలకము. భారతీయత మీద అంత చిన్న చూపు శీతకన్ను తగదు. చివరగా పొణకాకనకపుష్య రాగము. అనగననగ రాగమతి శయ్యిలుచుండు. జమీన్ రైతు సంస్థాపకులు నెల్లూరు వెంకటరామా నాయుడు గారు ఉదారులు. ఆయన నివాస గృహము పక్కనే జమీన్ రైతు పెద్ద రంగా భవనమని పేరు పెట్టారు. ఆ భవనానికింకా చరిత్ర ఉంది. అంతకు ముందది సర్వేపల్లి రాధాకృష్ణన్ గారి మావగారు చెంగయ్య గారిది. దాని పక్కన నాయుడి గారి నివాసభవనానికి "కనకమ్మ సదనము" అని పేరు పెట్టుకున్నారా రైతు పోరాట వీరుడు. ఆ రెంటి వెనుక భాగములో యానాది వారెంతమందో ఉండే వారు. చాలా దశాబ్దాల తర్వాత పోయిన మార్చిలో మా ఇల్లు. జమీన్ రైతు చూడాలని పించి వెళ్ళాను. జమీన్ కనిపించ లేదు. సెజ్ అయ్యిందేమో అనుకున్నాను. పుష్యరాగమొక్కసారి 51 సంవత్సరాలు వెనక్కు తీసుకెళ్ళింది. *మిసిమికి* ధన్యవాదాలు.

## గురుదేవో...



**మై**సూరు విశ్వవిద్యాలయంలో తత్త్వ శాస్త్రాచార్యులుగా సర్వేపల్లి రాధాకృష్ణన్ అఖండ ఖ్యాతినార్జించారు. సి.ఆర్.రెడ్డిగారి తరువాత ఆంధ్రవిశ్వకళా పరిషత్తుకు రాధాకృష్ణగారే ఉపాధ్యక్షులుగా నియమితులైనారు. ఆయన పదవీవిరమణ చేసి వెళ్ళేటప్పుడు మైసూరు విద్యార్థులు గుర్రపు బండిని తామే స్వయంగా గౌరవ పూర్వకంగా మైసూరు రైల్వే స్టేషన్ వరకూ లాక్కునివెళ్ళి 'గురుదేవో మహేశ్వరః' అని ఆచరణలో చాటి చెప్పారు.

# విజ్ఞాన వీధిలో తాత్విక యాత్ర



నండూరి రామ్మోహనరావు

పత్రికా సంపాదకునిగా ప్రజలలో సుపరిచితమైన పేరుగల్గి, ఎన్నదగిన వారిలో నండూరి రామ్మోహనరావు ముఖ్యులు.

2-9-2011 తేదీనాడు ఆయన సాగించిన విరామమెరుగని తాత్విక అన్వేషణ ముగిసింది. ఆయన ఆంధ్రజ్యోతి పత్రికకు నార్లవెంకటేశ్వరరావు తరువాత సుదీర్ఘకాలం ప్రధాన సంపాదకునిగా పనిచేశారు. ఆంగ్లంనుండి టామ్‌సాయర్ నవలను తెలుగులోనికి అనువదించి మొదటి ఆంగ్ల-తెలుగు అనువాదకునిగా పేరు గాంచారు. ఆయన రాసిన అనువాద నవలలు, కథలు, వైజ్ఞానిక, తాత్విక గ్రంథాలు, సంపాదకీయ సంకలనాలు, వీరికావ్యాసాలు, రేడియో ప్రసంగాలు పుస్తకాలుగా ప్రచురితమయ్యాయి. కొన్ని మూడు నాలుగు ముద్రణలు నోచుకుని ప్రజాదరణ పొందాయి. వారి జీవితం, ఆలోచనా విధానం, మూర్తిత్వం గురించి తెలిసిన ముగ్గురు: **నండూరి పార్థసారథి, బుద్ధవరపు వెంకటరత్నం, నాగసూరి వేణుగోపాల్** లాంటి సన్నిహితుల అభిప్రాయాల సంకలనమే ఈ వ్యాసం.

"శ్రీరామ్మోహనరావు మేధావి, కవి, వ్యాఖ్యాత. కాలంతోపాటు నడవడానికి, కాలంతోపాటు పెరగడానికి ఆయన ప్రయత్నిస్తారు. అందుకే ఆయనకు వైజ్ఞానిక శాస్త్రాలంటే శ్రద్ధాశక్తులు, దానికంటే ప్రశంసనీయమైన విషయం-వైజ్ఞానిక శాస్త్ర పరిజ్ఞానాన్ని ప్రజాబాహుళ్యంలో వ్యాపింపజేయాలన్న ధర్మదీక్ష. జేసు మానవుడు మానవునిగా పరిపూర్ణత చెందాలన్న ఆయన ధర్మదీక్ష". అంటూ నార్లవెంకటేశ్వరారావు నండూరి వారిని అభివర్ణించారు.

"మా అన్నయ్యే నాకు హీరో" అలా అంటున్నప్పుడు ఆ తమ్ముని కళ్ళలో వెలుగు కనిపిస్తుంది. లలిత కళలు అందులో మరీ ముఖ్యంగా సంగీతానికి పెద్ద పీఠం వేస్తూ మేలు బంతి లాంటి 'రసమయి' పత్రికకకు సారథ్యం వహించిన నండూరి పార్థసారథి గారే ఆ తమ్ముడు.

"ఆరుగొలను కృష్ణాజిల్లాలోని హనుమాన్ జంక్షన్‌కు ఐదు మైళ్ళ దూరంలో ఉంది. గుడివాడ నుంచి అక్కడకు చేరుకోవాలంటే ఆ దూరం పది మైళ్ళు. ఆ చిన్నవూరిలో మా అన్నయ్య 1927 ఏప్రిల్ నెలలో పుట్టారు. మాది సంగీత సాహిత్యాలపై అభిలాష ఉన్న కుటుంబం. సంప్రదాయాన్ని గౌరవించిన శ్రోత్రీయులం కాము. సగటు బ్రాహ్మణ కుటుంబాలలో కనిపించే చాదస్తాలు అవీ ఉండేవి కావు. మా తాతగారు చుట్ట, నాన్నగారు సిగరెట్టు కాల్చేవారు. ఇది అబ్రాహ్మణీయంగా జనం ఈసడించేవారు. వయసులో మా అన్నయ్య నాకంటే పన్నెండు ఏండ్లు పెద్ద. దాని వల్ల సహజంగానే నాకు ఆయనతో చనువు తక్కువ, గౌరవం ఎక్కువ. నాకు ఊహ వచ్చి స్కూలుకు వెళ్ళే సమయానికి మా అన్నయ్య కాలేజీ చదువులకోసం ఊరు విడచి వెళ్ళిపోయాడు. చిన్నతనం నుండీ కొన్ని తాత్విక ఆలోచనలతో సతమతమవుతూ ఉండేవాడు. తొలికౌమార దశ నుంచీ ఆయనను వెంటాడి వేధించిన ప్రశ్న 'దేవుడున్నాడా? లేడా? అచ్చు ఇలాంటి సందేహమే స్వామి వివేకానందకు వచ్చిన విషయం మనందరికీ తెలుసు. బహుశ అందుకే కావచ్చు ఆయనకు వివేకానంద అంటే అంతఇష్టం.

1944వ సంవత్సరంలో ఆయన ఇంటర్ చదువు తున్నపుడు మేనమామ కూతురితో వివాహమయింది. అప్పటికి ఆయన వయను 17 సంవత్సరములు. 1946వ సంవత్సరములో బి.ఎ. చదువు కొద్దికాలంలో ముగుస్తుంది. అంతా సవ్యంగానే జరుగుతుండగానే అన్నయ్య అప్పటికే ఆయనలో మొలకెత్తిన తాత్విక బీజాలకు సమాధానాన్ని

అన్వేషిస్తూ హిమాలయాలలో నున్న శివానందాశ్రమం చేరుకున్నాడు. ఇంట్లో అంతా కంగారు పడ్డాం. ఋషీకేశ్‌లోని శివానందాశ్రమానికి వెళ్ళిన మా బంధువొకరు అన్నయ్యను గుర్తించి మానాన్నకు వర్తమానం తెలిపాడు. ఆయన శివానందస్వామికి ఉత్తరం వ్రాశారు. స్వామి మా అన్నయ్యను పిలిచి కుటుంబ సభ్యుల ఆతురత, వారి పట్ల ఉండవలసిన బాధ్యతలను గుర్తెరిగేలా హితబోధ చేసి ఇంటికి తిరిగి పంపించారు. ఇంటికి వచ్చిన తరువాత మా అన్నయ్య మా అందరికీ భజన పాటలు, దానితోపాటు ఆసనాలు వేయటం నేర్పారు. విద్యార్థిగా నున్నపుడు ఆయనొక భావకుడు. ముఖ్యంగా రవీంద్రనాథ్ ఠాగూరు, దేవుల పల్లి కృష్ణశాస్త్రి ప్రభావం ఆయనలో కనిపించేది. ఆ ప్రభావంలో కొన్ని భావగీతాలు రాశారు.

"విభుదేగు దెంచెటి వేళాయనే సఖీ
సెజ్జ సవరించే సమయమిదే చెలీ"

అనే గేయాన్ని ఆయనే వ్రాసి వరస కూర్చారు. ఆ పాటను మా ఇంటిల్లి పాది పాడుకునే వారము. ఈ పాటను రావు బాలసర్వతీదేవి గారు పాడారు. అది రికార్డుగా రాక పోవడానికి గల కారణం నాకు తెలీదు. ఇంట్లో సినిమా పాటలపై మక్కువ ఉండేది కాదు. సైగల్, పంకజ్ మల్లిక్, సాలూరి రాజేశ్వరరావు, రావు బాలసరస్వతి పాడిన పాటలు వింటూ, పాడుకుంటూ ఆనందించేవారము. ఆయన కొన్ని కథలు రాసారు. నవలల జోలికి పోలేదు. కవితలు కొంతకాలం తరువాత ఆపేశారు. 1948వ సంవత్సరములో ఆంధ్రపత్రికలో ఆయన ప్రవేశించారు. అంతకు పూర్వం 'జన్మభూమి' అనేపేరుగల పత్రికలో కొన్ని నెలలు పనిచేశారు.

1950 సంవత్సరము నుండీ ఆయనలో హేతువాద పోకడలను గమనించేవాడిని. జీవిత చివరి ఘట్టంలో ఆయన భౌతిక పరంగా చాలా బాధను తట్టుకోవలసి వచ్చింది. 1985 సంవత్సరంలోనూ తిరిగి 1997వ సంవత్సరములోనూ ఆయనకు బైపాస్ ఆపరేషన్ జరిగింది. ఒకసారి విపరీతమైన కడుపు నొప్పితో బాధపడి ఆపరేషన్ అయితే తప్ప తేరుకోలేకపోయారు. ఒకసారి పాక్షిక పక్షవాతం వచ్చి మూతి వంకరబోయింది. మాటలో స్పష్టత ఉండేది కాదు. తరువాత అది తగ్గింది. జీవితంలో ఎన్నో సంఘటనలు ఆయనకు ప్రతికూలంగా మలుపు తీసుకున్నా, ఆయన చివరి శ్వాస వరకూ దేవుని అంగీకరించలేదు. అలానే ఆత్మ, పునర్జన్మలు. దేవుళ్లకు మొక్కుకోవటం, కొబ్బరికాయ కొట్టడం ఎప్పుడూ చేయలేదు. కానీ కూతుళ్ల పెండ్లి విషయంలో కుటుంబ సభ్యుల సెంటిమెంట్లను గౌరవిస్తూ కొద్దిసేపు జంధ్యం వేసుకున్నారు. కార్యక్రమం ముగిసిన తరువాత దానిని గోడకున్న మేకుకి తగిలించారు. మా అక్క చెల్లెళ్లు దేవుని గూర్చి ఆయనను గుచ్చి గుచ్చి ప్రశ్నించేవారు. 'ఏం లేదు. అది అంతే' అన్నదాయన సమాధానం.

(సత్యాన్వేషణకు సైన్సు సాధనం కాదు. అదొక్కటే చాలదు. సైన్సుకు అందని ప్రపంచం సైన్సు అర్థం చెప్పలేని ప్రపంచం ఎంతో ఉంది. సైన్సు వాస్తవంగా ఉన్న దానిని మాత్రమే పరిశీలించి చూపుతుంది. విలువలు, Value Judgement లకు సైన్సులో ప్రాధాన్యత లేదు. అందుచేతనే సైన్సు మానవాళికి ఎంత ముఖ్యమయినా అదొక్కటే ప్రామాణికం కాదు. భారతీయ తాత్వికచింతన పీఠికలో నండూరి రామ్మోహనరావు - *మినిమి*)

**బుద్ధవరపు వెంకటరత్నం నండూరివారికి బాల్య మిత్రులు వారిమాటల్లో ...**

ఇది 1945వ సంవత్సరం నాటి మాట – రాజమండ్రిలో ఉన్న గోదావరి ఒడ్డున ఉండిన గుండు వారి వీధిలో వాడ్రేవు విద్యార్థి వసతి గృహంలో మేం ఉంటున్న రోజుల్లో నాకు ప్రప్రథమంగా నండూరి రామ్మోహనరావుతో పరిచయం ఏర్పడింది. ఆర్ట్స్ కాలేజీలో ఇంటర్మీడియెట్ క్లాస్‌లో ఇద్దరం ఒకే బెంచి మీద కూర్చొనేవాళ్ళం - వాడ్రేవువారి వసతి గృహంలో ప్రక్క ప్రక్క గదులలో ఉండేవాళ్ళం.

అలనాటి మా సహాధ్యాయులు సర్వశ్రీకూచిమంచి సత్యసుబ్రహ్మణ్యం, విశ్వాత్ముల నరసింహమూర్తి, యల్లంరాజు రాధాకృష్ణ శర్మ, వల్లూరి సుబ్బారాయుడు, తేతలి రాజారావు, ద్రోణం రాజు భీమేశ్వరరావు, బాలకవి కుమారస్వామి, చోరగుడి వెంకట సుబ్బారావు, కృత్తివెంటి వెంకటేశ్వరరావు, పామారాజు వెంకటేశ్వరావు ఇంకా ఎందరెందరో – మేమంతా ఒక పెద్దచెట్టు మీది చిలకల్లా ఉండేవాళ్లం. వీరంతా వివిధ రంగాలలో నిష్ణాతులే.

ఆనాడు మేం "విజ్ఞానం" అనే లిఖితమాసపత్రిక వెలువరించేవాళ్ళం "నీ భవన ద్వారాన నే తోరణమ్మునై ఎన్నాళ్లు యుందునో దేవా! ఎరుగనే లేనోయి దేవా" అనే పల్లవులతో గీతాలు రామ్మోహనరావు వ్రాశారు.

రామ్మోహనరావు మంచి నటుడు. కన్యాశుల్కం నాటకంలో బుచ్చమ్మ పాత్ర వేసేవాడు. షేక్సియర్ నాటకం 'ఒథెల్లో' లో కథానాయిక డెస్టిమోనా అంటే చెవి కోసుకొనేవాడు.

సరే– మా హాస్టల్లో ఉన్న నాళ్లలోనే ఒక గొప్ప సంఘటన జరిగింది. ఆ వేళ ఉన్నట్టుండి రామ్మోహనరావు మాకు అగుపడలేదు. రామ్మోహనరావు మాకందరికీ తలలోని నాలుక! "ఏమయ్యిందబ్బా! ఎక్కడికి వెళ్ళి ఉంటాడు?" వగైరా ప్రశ్నలు మమ్మి కలవరపెట్టాయి. వాళ్ల ఊరుగాని వెళ్ళి ఉంటాడేమో అని సరిపెట్టుకున్నాం.

కానీ అలా జరగలేదు – సరిగా నాలుగు రోజులు గడిచాయి. వాళ్లనాన్నగారు – ఆయన కృష్ణాజిల్లా ఆరుగొలను కరణంగారు. రామ్మోహనరావు ఆచూకీ కోసం రాజమండ్రి మా వసతిగృహానికొచ్చారు. "మాకూ ఏమీ తెలియదండీ ఏ హిమాలయ పర్వతాలకో వెళ్లిపోయాడేమో! అనటంతో వెళ్లిపోయారు."

తనకంటూ ఏనాడూ ప్రచారం కోరని నిగర్వ చూడామణి – ఎన్నెన్నో సత్కార్యాలు, కితాబులు, సన్మానాలు, నండూరివారిని వెదక్కుంటూ వచ్చాయి. వినమ్రతతో ఆయన వాటిని స్వీకరించారు.

నండూరివారు కె.ఎన్.వై– పతంజలి వంటి పేరెన్నికగన్న సాహితీ ప్రియుల్ని సంపాదకులుగా పైకి తీసుకు వచ్చారు. భాషా, ఆనందవర్ధన్ వంటి మేటి రచయితలు ఆయన శిష్యులు. వారి తమ్ముడు నండూరి పార్థసారథి "ఆంధ్రప్రభ" సంపాదకులుగా లబ్ధ ప్రతిష్ఠులయ్యారు.

**నండూరివారితో సైన్సు రచయిత, రేడియో ప్రయోక్త నాగసూరి వేణుగోపాల్ అభిభాషణ:** (విజయవాడ ఆకాశవాణి 2000–2001 ప్రాంతంలో ప్రసారం కాబడింది.)

**నాగసూరి:** రామ్మోహనరావుగారూ, సైన్స్ పట్ల మీకు అభిరుచి ఎప్పుడు కలిగింది?

**నండూరి:** సైన్స్ పట్ల అభిరుచి నాకు మొదటి నుంచి ఉన్నదండి. చిన్నతనం నుండి కూడా సైన్స్ విద్యార్థిని కాను. మొదటినుంచీ కూడా సైన్స్ వ్యాసాలు కానీ, లేకపోతే సైన్స్, పాపులర్ సైన్స్ పుస్తకాలు కానీ చదువుతూ ఉండే వాడిని.

**నాగసూరి:** మీరు సైన్సు రచనలు ఎప్పుడు ప్రారంభించారు?

**నండూరి:** నేను జర్నలిజంలో ప్రవేశించింది 1948వ సంవత్సరంలో. సైన్స్ వ్యాసాలు చాలా రాశాను. అంటే సైన్స్‌లో చాలా క్లిష్టమైనటువంటి సబ్జెక్ట్స్ ఎన్నుకుని, వాటిని పాపులర్‌గా అందరికీ అందుబాటులో ఉండేట్టుగా, అందరికీ అర్థమయ్యేట్లు ఆ శైలిని అనుసరించి రాయటమనేది మొదటి నుంచి నేను అలవాటు చేసుకున్నాను.

**నాగసూరి:** అప్పట్లో మీకు గుర్తున్న రచయితలు కానీ, అంటే సైన్స్ రాసిన వారు, లేదా మీకు ఇష్టమైన వాళ్లుగానీ లేదంటే ప్రభావం కలుగజేసినవాళ్ళు....?

**నండూరి:** నేను చదువుకునే రోజుల్లో తెలుగులో ప్రత్యేకించి చెప్పాలంటే విస్సా అప్పారావుగారి పుస్తకం ఒకటి నేను చిన్నతనంలోనే చదివాను. తరువాత అప్పట్లో పేరు పొందినటువంటి సైన్స్ రచయిత గొబ్బూరి రాఘవానందరావు. ఆయన పుస్తకాలను చదువుతుండేవాడిని. నాకు సాహిత్యం ఫస్ట్ లవ్ అనుకోండి. సైన్స్ సెకండ్ లవ్. నాకు సైన్స్ ఫస్ట్ లవ్ కాదు.

**నాగసూరి:** సైన్స్ రచన చేయాలనుకున్నప్పుడు అంటే సాహిత్య రచన కంటే విభిన్నంగా ఏమన్నా జాగ్రత్తలు గానీ లేదంటే ఇంకేమన్నా తీసుకోవలసి ఉంటుందా?

**నండూరి:** సైన్స్ రచన చేసేవారు ముఖ్యంగా తను చెప్పదలచుకున్న విషయమేమిటో స్పష్టంగా అవగాహన చేసుకుని ఉండాలి. తనకి అర్థమైతే ఇతరులకు అర్థమయ్యేట్లు చెప్పగలడు. అదీ ఫస్ట్ ప్రిన్సిపుల్. తనకి అర్థం కాకుండా ఏదో పులుముడుగా పాఠకులమీద రుద్దాలని , ఏదో సైన్స్ రచయితని అనిపించుకోవాలని, రాయాలని తాపత్రయంతో చేస్తే మాత్రం అది బాగారాదు. తను ముందు బాగా అర్థం చేసుకుని, ఆ విషయాన్ని సుబోధకంగా తాపత్రయంతో చేస్తే మాత్రం అది బాగారాదు. తను ముందు బాగా అర్థం చేసుకుని, ఆ విషయాన్ని సుబోధకంగా మంచి శైలిలో రాయడం చాలా ముఖ్యం.

**నాగసూరి:** ఇంగ్లీషు నుంచి ఏదైనా అంశం తీసుకుని, దాన్ని తెలుగులో రాయాలనుకున్నపుడు, ఈ సమానార్థకాలు, లేదా తెలుగు పదాలు వీటి సమస్య ఉంటుంది కదా!

**నండూరి:** ఆ సైన్స్‌ని తెలుగులో చెప్పడమనేది కొంచెం కష్టమైన విషయమే. ఎందుకంటే మనది ఒరిజినేటింగ్ సైంటిఫిక్ కల్చర్ కాదు. అంటే మన దేశంలో సైన్స్ అనేది డెవలప్ కాలేదు. అది పాశ్చాత్యదేశాల నుంచి ఇక్కడికొచ్చింది. అందుచేత

తెలుగులో మరీ. అందరూ ఇండియన్ లాంగ్వేజెస్ అన్నిటికి ఈ సమస్య ఉందనుకోండి. అందులో ముఖ్యంగా తెలుగుకు ఉంది. తెలుగులో సైంటిస్ట్, ప్రొఫెసర్ ఉన్నారు కానీ, ఒరిజినేటింగ్‌గా సొంత పరిశోధన ద్వారా సైన్స్ విషయాలు చెప్పినవాళ్ళు చాలా తక్కువ. అందుచేత ఈ సమానార్థకాలు అనేటటువంటివి తెలుగులో సృష్టించుకోవలసి ఉంటుంది. ఇంగ్లీషు నుంచి తెలుగు చేసేటప్పుడు, తెలుగులో సైన్స్ విషయాలు చెప్పేటప్పుడు కొంచెం ఈ సమానార్థకాలకోసం కష్టపడవలసి వుంటుంది.

**నాగసూరి:** ఈ విషయంలో ఇబ్బందులు ఎదురు కాలేదా?

**నండూరి:** అది హైస్కూల్‌లో నేను చదువుకొనే రోజుల్లో, భౌతికశాస్త్రం, రసాయన శాస్త్రం, ఉండేవనుకోండి. వాటిల్లో ఆ కాలపు రచయితలు చాలా శ్రమపడి, తెలుగు సమానార్థకాలను చాలా బాగా తీసుకొచ్చారు. ఉదాహరణకు గ్రావిటేషన్, దీనికి గురుత్వాకర్షణ శక్తి అని వాళ్లు అనువాదం చేశారు. మనం సంస్కృతం మీద ఆధారపడక తప్పదు. అలాగే కొన్ని మనకూ ఉన్నాయి. సల్ఫర్ అంటే గంధకం. అది పూర్వం నుంచి ఉన్నది. అలాగే ఫాస్పరస్ అనే దానికి భాస్వరం. కొన్నిటికి మాత్రం లేదు. ఉదాహరణకు ఆక్సిజన్ అంటే ప్రాణవాయువు అని చేసేవాళ్లం. కాని దానికి ఆమ్లజని అనేటటువంటిది క్రియేట్ చేశారు మన సైన్స్ రచయితలు. అలాగే నైట్రోజన్ అని ఉందండి. దానికి నత్రజని అన్నారు. ఆ నత్రజని అనేది మనకి పూర్వం నుంచి ఉన్న మాట కాదు. నైట్రో అనేదానికి నత్ర అని, జన్ అనేదానికి జని అని వీళ్లు ఖాయం చేశారు. అలాగే ఫొటోసింథసిస్ అనే మాటకు కిరణజన్యసంయోగక్రియ. ఇది కల్పించిన మాట. ఇలాంటి మాటలు చాలా ఒరిజినల్‌కు దగ్గరగా ఉండేటటువంటి పదాలను చాలా ఖాయం చేశారు.

**నాగసూరి:** ఆధునిక అంశాలను కూడా 'విశ్వరూపం'లో తీసుకున్నారు... అప్పటికి రెడీమేడ్ పదాలు లేవు గదా! మీరు ఏం చేశారు?

**నండూరి:** నేను దాదాపుగా ఏ తెలుగు పుస్తకాన్ని అనుకరించ లేదు. అంటే కొత్తగా తెలుగులో వచ్చినటువంటి సైన్స్ పుస్తకాలు కానీ, సైన్స్ రచయితలను కానీ ఎవరినీ ఫాలో కాకుండా నా పదజాలాన్ని నేనే సృష్టించు కున్నాను. ఆ విధంగా వార్తా పత్రికలలో పనిచేసే వాళ్లకి అప్పటికప్పుడు పదాలని సృష్టించుకోవడమనేది చాలా అవసరం. అందువల్ల నేను ఆ పద్ధతినే అనుసరించి ఒక జర్నలిస్ట్‌గా పాపులర్ సైన్స్‌ని ఎలాగ అందించడం జనానికి అనే దృష్టితో రాశాను.

**నాగసూరి:** అంటే ఇప్పుడు 'ఆస్టరాయిడ్' అనే పదం ఉందనుకోండి.

**నండూరి:** ఆస్టరాయిడ్ అనే పదానికి నేను గ్రహశకలము అని అనువదించాను. ఆస్టరాయిడ్ అంటే చిన్న-స్మాల్ - మైనర్ ప్లానెట్ అని అర్థం అన్నమాట. ఆ మైనర్ ప్లానెట్ - దాని కల్పగ్రహం అలా అంటే దాని అర్థం పూర్తిగా రాదేమో అని చెప్పి గ్రహశకలం అంటే గ్రహం యొక్క ముక్క అనే విధంగా అనువాదం చేసి వాడాను. ఆటమ్ అనేది ఒక సింగల్ వర్డ్... ఇంగ్లీషులో ఆటమ్ అనేది ఒక పదం. దానికి తెలుగు టెక్స్టుబుక్స్‌లో పరమాణువు అని ట్రాన్స్‌లేట్ చేసి చూశాను.

అది ఇప్పటికీ వాడబడుతోందేమో తెలీదు. అది నాకంత నచ్చలేదు. పరమ ఎందుకు చేర్చాలి? అణువు అంటే నే సరిపోతుంది కదా! ఎందుకు పరమాణువు అని అణువు కంటే చిన్నది అది. బహుశా అణువు అంటే మిగతా సైన్స్ రచయితలు మాలిక్యూల్ అనేటటువంటి అర్థంలో వాడుంటారు. మాలిక్యూల్ కంటే అణువు చిన్నది కనుక. అంటే కొన్ని అణువులు కలిస్తేగానీ మాలిక్యూల్ తయారవదు కనుక అణువుకి, ఆటమ్‌కి పరమాణువు అని చెప్పి వాడుంటారు. కానీ నేనలా వాడలేదు. ఎందుకంటే ఆటమ్ అనేది ఒక మాట కనుక తెలుగులో కూడా ఒకే మాటుంటే బావుంటుంది అని చెప్పి నేను అణువనే ట్రాన్స్‌లేట్ చేశాను. కొంతమంది దానిని విమర్శించారు. సైన్స్ పదాలు ట్రాన్స్‌లేట్ చేయడం తెలీదు అని నన్ను ఈసడించినవాళ్లు ఉన్నారు.

**నాగసూరి:** మీరు... మీరు గొప్ప రచయితలతో కలిసి పని చేశారు. ఈ సైన్స్ రచనలకు సంబంధించి కొడవగంటి కుటుంబరావుగారి ప్రోత్సాహం ఎలా ఉండేది?

**నండూరి:** ఆయన విజ్ఞాన శాస్త్ర విద్యార్థి ఎం.ఎస్‌సి. దాకా చదువుకున్నారు. బెనారస్ హిందూ యూనివర్సిటీలో. అంచేత ఆయన ప్రోత్సాహం చాలా ఉండేది. నా చేత చాలా సైన్స్ ఆర్టికల్స్ రాయించారు. ఆయనకి నేను సహాయకునిగా పనిచేయడం అనేది నా అదృష్టం కొద్దీ జరిగింది.

**నాగసూరి:** 'విశ్వరూపం', 'నరావతారం' గ్రంథాలు రాశారు కదా! వీటి నేపథ్యం ఏంటండి.

**నండూరి:** సైన్స్ విశ్వరూపం, ఆంధ్రజ్యోతిలో నేను ప్రవేశించిన తర్వాత చంద్రమండలానికి మానవుడిని పంపే ప్రయత్నాలు జరుగుతుండగా ఎడిటర్ నార్ల వెంకటేశ్వరరావు... ఆయన నన్ను ఈ ఖగోళశాస్త్రానికి సంబంధించిన విషయాల పట్ల పాఠకులు ఆసక్తి చూపిస్తున్నారు కనుక, వాటి మీద ధారావాహికంగా వ్యాసాలు రాస్తే బావుంటుందేమో, అని చెప్పి నాకు సూచించారు. నేను మొదట కొంచెం సందేహించాను. కానీ తర్వాత ఆయన ప్రోత్సహించి నాకు చాలా గ్రంథ సంచయాన్ని అందజేసి "ఇదుగో ఇవి ఫాలో కండి. వీటనన్నింటినీ చదివి, సంగ్రహించి వ్యాసాలు రాయండి అన్నారు.

ఖగోళ శాస్త్రం గురించి అంటే పాఠకులకు ఏమీ తెలియదు. అని ఊహించుకుని మొదటినుంచి, యూ మస్ట్ బిగిన్ ఫ్రం ది బిగినింగ్, ప్రాథమిక అంశాలతో పాటుగా మీరు రాస్తే అది పాపులర్ అవుతుంది" అన్నారు. అంటే నేను మామూలుగా పాఠకులకు సైన్స్ విషయాల మీద ఆసక్తి ఎక్కువగా ఉంటుందండీ, దాన్ని పాపులర్‌గా చెప్పటం అనేటటువంటిది కష్టమైన పని. అది చదివించడం అనేది చాలా కష్టమైన పని అని కొంచెం సందేహించాను. కానీ ఆయన నా స్టయిల్ గ్రహించి ప్రోత్సహించారు. అందుకు నేను ఆయనికి కృతజ్ఞుడను. అది అప్పుడు చంద్రమండలానికి మానవ ప్రయోగం జరిగే రోజుల్లో నేను ఈ విశ్వరూపం మొదలెట్టాను. మొదలు పెట్టి ఖగోళశాస్త్రం గురించి అంటే ఖగోళానికి సంబంధించినటువంటి విషయాలను గురించి మొదలుపెట్టి దాన్ని ఎక్స్‌ప్లెయిన్ చేయటం కోసం అణుశాస్త్రం కూడా అంటే న్యూక్లియర్ సైన్స్ కూడా నేను ఫాలో కావలసి వచ్చింది.

అది నేను ఎక్స్‌ప్లెయిన్ చేయాల్సివచ్చింది. ఎందుకంటే పాఠకులకు ఏమీ తెలీదు అనే ఉద్దేశంతో ప్రారంభించాను కనుక. తర్వాత అట్లాగే మరి ఖగోళ సబ్జెక్ట్ ఎత్తుకునేటప్పటికి కాస్మాలజీ తప్పకుండా దాంట్లోకి వస్తుంది. కాస్మాలజి అనేది వేరే ఇదిగా ఒక డిసిప్లిన్‌గా ఉందిగానీ ఇంగ్లీషులో అది అస్ట్రానమిలో ఒక భాగమే. అంటే విశ్వం యొక్క పుట్టుక. అది ఎలాగ ఎవాల్వ్ అయ్యింది? ఎలాగ పరిణతి చెందింది? ఈ నక్షత్ర మండలాలన్ని ఎలా వచ్చాయి? అనేటటువంటి విషయాల గురించి అది వివరిస్తుంది. దాన్ని నేను స్పృశించాను.

**నాగసూరి:** అంటే ఇప్పుడు 'విశ్వరూపం' గురించి చెప్పారు... అంటే.. రచన ప్రారంభించక ముందే ఒక స్పష్టమైన ప్రణాళిక ఉండేదా? లేకపోతే రాస్తూ రాస్తూ ప్రణాళిక...

**నండూరి:** కుటుంబరావు నా పుస్తకానికి పీఠికరాస్తూ పుస్తకరూపంలో చూసినప్పుడు ఈయన యొక్క చక్కని ప్రణాళిక నాకు అర్థమయ్యింది. ఒక పద్ధతిలో పాఠకులకు ఎక్స్‌ప్లెయిన్ చేసుకుంటూ పోయారు విషయాలు... అన్నారు. కానీ నేను రాసేటప్పుడు అలా అనుకోలేదు అంటే ఒక ప్రణాళిక అంటూ ఏర్పరచుకుని చేసింది కాదు.

**నాగసూరి:** పేర్లు కూడా విశ్వరూపం, నరావతారం, అంటే విశ్వదర్శనం ఈ పేర్లు కూడా చాలా అందంగా ఉన్నాయి. హాయిగా అనిపిస్తాయి.

**నండూరి:** దీనికి కారణం నార్ల వెంకటేశ్వరావు. ఈ రెండు పేర్లు కూడా ఆయనే ఖాయం చేశారు. కాళీపట్నం కొండయ్య అని ఒక సైన్స్ రచయిత. బహుశా మన పాపులర్ సైన్స్ రచయితలలో ఆయన మొదటి వారు అయి ఉండవచ్చేమో! 1939, ఆ ప్రాంతాలలో విశ్వరూపం అనే ఒక పుస్తకం రాశారు. విశ్వరూపం అని కాళీపట్నం కొండయ్యగారు రాసినది 'ది యూనివర్స్ అరౌండ్ అజ్' అని జేమ్స్ జీన్స్ రాసినటువంటి పుస్తకానికి అనువాదమే. మీరు రాయబోయేది అనువాదం కాదు. కనుక మీరు దానికి ఆ పేరును చేయటంలో తప్పేంలేదు... మీరు వాడండి అని ఆయన అన్నారు.

**నాగసూరి:** నరావతారంలో బయో-సైన్స్‌కు సంబంధించిన అన్ని అంశాలు వస్తాయి... ఆంత్రోపాలజి, జువాలజి... అన్నీ. మళ్లీ ఇట్లా డిఫరెంట్ సబ్జెక్ట్స్‌ని డీల్ చేసేటప్పుడు అంటే ఈక్వలెంట్స్ కోసమనో, మరి ఇంకోటనో, లేకపోతే దాని బేస్‌కి సంబంధించిన పుస్తకాలు చదవడం వల్లగానీ మీకు ఎట్లా అనిపించింది? అప్పుడు సమస్యలు ఏమీ ఎదురవలేదంటారా?

**నండూరి:** నాకు ఎక్కువగా ఖగోళశాస్త్రం మీద ఉన్న అభిరుచి నన్ను విశ్వరూపం రాయటానికి ప్రోత్సాహించింది. అంత అభిరుచి, అంత అభినివేశం... ఈ బయోలాజికల్ సైన్స్ మీద నాకు లేదు. అంచేత కొంచెం కష్టమనే అనిపించింది. నేను రాయలేను మహాప్రభో! అని మా ఎడిటర్‌గారితో చెప్పాను. ఆయన మీరు తల్చుకుంటే ఏదైనా రాయగలరు, అని ప్రోత్సహించారు.

**నాగసూరి:** విశ్వదర్శనం గురించి చెప్పండి

**నండూరి:** మనిషి యొక్క మేధ. మన థింకింగ్ ఎలాగ వెళ్ళింది. మ్యాన్స్ థింకింగ్ అబౌట్ హిమ్ సెల్ఫ్, అబౌట్‌ది వరల్డ్ ఎలా వెళ్ళింది అనేటటువంటిది తెలియజేయటానికి విశ్వదర్శనం మొదలు పెట్టాను. అంటే కొంచెం తత్త్వశాస్త్రంగా వస్తుందది. దాని గురించి కూడా రాస్తే బావుంటుంది అని చెప్పి నేను అనుకున్నాను. నేను మా ఎడిటర్ నార్ల వెంకటేశ్వరరావు గారితో చెపితే ఆయన "ఏ మాత్రం తత్వశాస్త్రం గురించి ఆసక్తి లేదు. ఆ సబ్జెక్ట్ ఎందుకులెండి. అది రాయటానికి చాలామంది ఉన్నారు... మీరెందుకు" అన్నారు. కానీ ఎవరూ కూడా తెలుగులో అంత బాగా చదివించేటట్టుగా రాయలేదు అని అనిపించింది. మన గోపీచంద్ రాశారు. తత్త్వ శాస్త్రజ్ఞుల గురించి, అట్లాగే జి.వి. కృష్ణారావుగారు రాశారు. కొంతమంది శాస్త్రజ్ఞుల గురించి రాశారు. ఆరిస్టాటిల్ గురించి, ప్లేటో గురించి. కానీ అంతకంటే సులభంగా చెప్పవచ్చును మన పాఠకులకు, ఇంత జటిలమైనటువంటి విషయాన్ని గురించి చాలా సులభంగా చెప్పవచ్చు అని అనిపించి, దాని మీద నాకు ఆసక్తి కూడా ఉంది. 'విశ్వదర్శనం' మొదలుపెట్టి రాశాను. పాశ్చాత్య దర్శనం తర్వాత భారతీయ దర్శనం. ఇంకా రాయాలని ఉంది. కానీ...

**నాగసూరి:** వీటిల్లో కూడా చాల సైన్స్ భావనలు కూడా చెప్పారనుకుంటా.

**నండూరి:** పాశ్చాత్య దార్శనికులలో వాళ్లలో ఎక్కువ మంది గణిత శాస్త్రజ్ఞులు. ఉదాహరణకు ప్లేటో ఉన్నాడు. అతను గొప్ప సైంటిస్ట్. గణితశాస్త్రజ్ఞుడు కానివాడు నా దగ్గరకు రానక్కరలేదు అని చెప్పి ఆయన బోర్డు పెట్టుకున్నాడట. ఆ విధంగా వారి శాస్త్రంలో ఎక్కువగా విజ్ఞానశాస్త్రం యొక్క ప్రభావం ఉంటుంది.

---

# న'మో'వాకం



ఇంతకాలమూ కాయితాల్లోనే గడిచి పోయింది.
ఏం కావాలో కాయితంమీద రాస్తూ
రాసిన కాయితాల్లోకి ఆరాటంగా చూస్తూ
ఎవరో ఏదో తెచ్చిస్తారని
గుడ్లప్పగించి చూస్తూ నిద్రగాచి చదూతూ
ఇంత కాలమూ కన్నీటి కాయితాల్లోనే
గడిచిపోయింది.
ఈ బొమికి లెవరివి, ఈ కపాల ప్రకంపన లెవరివని
ఒక్కొక్క చీకటి చారికనీ చీలుస్తో
న్నప్పుడు ఒక హటాన్నరాల వాన కురిసి
ఆకలిడొక్కల పిడుగులు రాలినపు
డభివ్యక్తివాద వ్యక్తాంతర దు:ఖాగ్ని కీలల్ని
మానస మరుభూమి మీద చల్లార్చినయ్...

# తెలుగు ను బ్రతికించుకుందాం



- పున్న అంజయ్య

రాష్ట్రాలు వేరైనా, ప్రాంతాలు వేరైనా, మనమధ్య కులమత విభేదాలెన్నున్నా అందర్నీ ఒక్కటి చేసేది భాష ఒక్కటే. గత, వర్తమాన, భవిష్యత్తుకు ఆశాదీపం భాష. ప్రపంచ పురోగతికి భాష శ్వానలాంటిది. దేశంలో ఎన్నో భాషలున్నప్పటికీ సంస్కృతీ సాంప్రదాయాలకు అద్దం పట్టేలా వున్న తెలుగుభాషకు ఉన్న విశేషాదరణ వర్ణించలేనిది. అందుకే శ్రీ కృష్ణ దేవరాయలు తెలుగు భాషామతల్లిని రతనాల గద్దెమీద కూర్చోబెట్టారు.

**తెలుగదేలయన్న దేశంబు తెలుగేను**
**తెలుగు వల్లభుండ తెలుగొకండ**
**ఎల్ల నృపులు గొలువ నెఱుగవే బాసాడి**
**దేశ భాషలందు తెలుగు లెస్స** అని అన్నారు.

నాటి నుండి నేటి వరకు ఎందరో కవులు తెలుగు వెలుగులను తమ కవితలు, గేయాలు, పద్యాలలో ప్రకాశింపజేశారు. "ఈ తెలుగు నాలుక నిచ్చిన ఋణమ్ము ధాత్రికి సలకమిచ్చినప్పటికీ తీరదు" అని వేలూరి శివరామశాస్త్రి తమ గురుభక్తిని ప్రకటించుకున్న అంబటిపూడి వెంకటరత్నం శాస్త్రి తన రక్తంలోని అణువణువులో తెలుగు భాషాభిమానంతో పరవశించి 'తెలుగు బ్రతుకు'లో ఇలా అంటారు.

**తల్లి యొసగెడి పాలు తెలుగే**
**తండ్రి గరపెడి పలుకు తెలుగే**
**తరుణి చూపెడి వలపు తెలుగే - తెలియరా**
**మన బ్రతుకు బ్రతుకే తెలుగురా**

'తెలుగు వాణి నిజమ్ము బాసలకు రాణి' అనే కవి వాక్కు 'దేశభాషలందు తెలుగులెస్స' అనేమాటకు ధీటుగా నిలుస్తుంది.

తెలుగుభాష మాధుర్యాన్ని, గొప్పతనాన్ని వర్ణిస్తూ కె.పాపయ్య శాస్త్రి -

**తిక్కన కవి భారతమున / పోతన భాగవతమ్మున**
**తేనె సోనలై పారిన / తీయనైన తెలుగు భాష** అని అంటారు.

తెలుగు భాష విశిష్టతను తెలియజేసే ఈ పద్యాన్ని కవి నరాల చిన చెన్నారెడ్డి చక్కగా చెప్పారు.

**సుమతి పద్యాల నీతుల సూక్ష్మమెరిగి**
**ఆట వెలదుల వేమన్న బాటలరసి**
**భక్త త్యాగయ్య పదముల ముక్తిగనుచు**
**తెలుగు పూదోట విరబూచె తెలుగు వనము**

తెలుగు మాట్లాడితే అవమానంగా, అగౌరవంగా భావించే తెలుగు వాడిని గూర్చి ప్రజాకవి కాళోజీ -

**అన్య భాషలు నేర్చి / ఆంధ్రంబు రాదంచు**
**సకిలించు ఆంధ్రుడా / చావ నెందుకురా** అని అంటారు.

తెలుగు భాష పట్ల చిన్న చూపుగల వారిని మందలిస్తూ దాని ఘనతను మనసుకెక్కేలా తారక్యాంధ్రము లో

**తెలుగు దేశాన జన్మించి తెలుగుచేత**
**మంచి చెడ్డల భేదంపు మర్మ మరసి**
**తెలుగు పొలముల పంటను తినుచు బెరిగి**
**తెలుగు బాసన్న నాలుక తేలవైతె?** అని సూటిగా

ప్రశ్నిస్తారు, విమర్శిస్తారు ధవళా శ్రీనివాసరావు.

ఒకప్పుడు 'మా తెలుగు తల్లికి మల్లె పూదండ' అంటూ చెవులు గింగిర్లు పోయేలా వినిపించే పాట నేడు మూగబోయిందని కవయిత్రి డా॥ బందారు సుజాతా శేఖర్

**మా తెలుగు తల్లికి / మల్లెపూదండ**
**శుష్కించి పోయెరా ఆమె కైదండ** అంటూ నానీలో చెప్పారు.

ప్రపంచీరకణ నేపథ్యంలో నేడు తెలుగుభాష కనుమరుగయ్యే ప్రమాదం వుందని కోట్ల వెంకటేశ్వరెడ్డి 'నానీ'లో

పున్న అంజయ్య ఫోన్: 9396610639

ప్రపంచీకరణ / వేయి తలల సర్పం

శ్వాసనే కాదు / భాషనూ కాటేస్తది అని అంటారు.

ఆంగ్ల భాషా వ్యామోహానికి ఈ 'నానీ' ఒక చక్కని ఉదాహరణ.

ఎ బి సి డి లు / అక్షర వ్యాపారుల చేతుల్లో

అ ఆ ఇ ఈ లు / తెలుగు తల్లి కన్నీటి వాగుల్లో

అని అంటారు పి. అనంతరావు.

తెలుగు కబడక, వినబడక, కనుమరుగవుతుందని డా॥ ఎస్.రఘు –

ఇద్దరి మాతృభాష ఒకటే / అయినా ఒకరికొకరు

అర్థం కావట్లేదు అని నానీలో చెప్తారు.

మాతృ భాషను మరచిపోయి విదేశీ సంస్కృతికి అలవాటు పడిన వారికి ఇచ్చట తెలుగు నేర్పబడును అనే కవితలో సజ్జా వెంకటేశ్వర్లు –

ఇది ఎక్కిరింపు మాటకాదు

వెటకారపు మాట అంతకంటే కాదు

కార్పోరేట్ విద్యతో కళ్ళగంతలు కట్టుకొని

కాసుల వేట లక్ష్యంగా

దారి తప్పి తిరుగుతున్న

నా తెలుగు తల్లి బిడ్డల కోసం

ఇచ్చట తెలుగు నేర్పబడును అని అంటారు.

గురజాడ, గుర్రం జాషువా, గిడుగు, శంకరంబాడిలు ఇలా ఎందరెందరో మన తెలుగు ముద్దు బిడ్డలు. అన్నమయ్య పద కవితలు, శ్రీశ్రీ విప్లవ కవితలు, కృష్ణ శాస్త్రి భావగీతాలు, దాశరథి కవితా ధార తెలుగు భాషను సుసంపన్నం చేశాయి.

మీ పిల్లలకి / చదువు లిప్పిస్తున్నారు

ఆస్తులిస్తున్నారు / వారసత్వపు

హక్కు లిస్తున్నారు / మరి తెలుగు ఇవ్వరేం? అని ప్రశ్నిస్తారు.

'తెలుగివ్వండి' అనే కవితలో మాధవి సనారా.

'అమ్మ పాల కమ్మదనం – తెలుగు భాష తియ్యదనం' అటువంటి అమ్మ భాషకు దండం పెడతానంటున్నారు. కవయిత్రి ఝాన్సీ కె.వి. కుమారి ఈ 'నానీ'లో...

అమ్మకు దండం / అమ్మ భాషకు దండం

ఆ రెంటి నిచ్చిన / కన్న నేలకు దండం

మమ్మీ, డాడీ, ఆంటీ, అంకుల్ సంస్కృతిలో తెలుగుభాషకు తిలోదకాలిచ్చారని అడిగోపుల వెంకటరత్నం 'తెలుగు–వెలుగు' కవితలో విమర్శిస్తారు.

తెలుగునాట ఆధునికాంధ్రుడ

తెలుగు చదవని చరిత ఇది

తేట తేట తెలుగు తేనె కన్నా తియ్యన

దేశ భాషల జిగి పింఛమై

తేజరిల్లిన తెలుగు

ఇంటి వాసాలకు ఉరేసుకున్న దుస్థితి

ఆంటీ అంకుల్ సంస్కృతి లో

వయసు వరసల నిమజ్జనం

ఆంధ్రంపై తప్ప ఆంధ్రుడు

అన్ని భాషలపై స్వారీ

తెలుగును మాట్లాడవలసిన ప్రతి చోట ఆంగ్లభాషకు ప్రాధాన్యత నివ్వడంతో తెలుగు పదాలు, అక్షరాలు మరుగున పడిపోయే ప్రమాదం వుంది. ఇందుకు నిదర్శనమే ఈ 'నానీ.

టీ.వి ఛానెల్ లో / యాంకరమ్మ

తెలుగును / ఆంగ్లంలో భలే మాట్లాడుతుందే' అని

వ్యంగ్యంగా అంటారు డా.ఎస్.రఘు.

అధికార భాషగా తెలుగు అమలు తీరు కేవలం కాగితాల వరకే పరిమితమైందనడానికి ఈ 'నానీ' మంచి ఉదాహరణ.

ఇదండీ / అధికార భాషగా తెలుగు

స్పీకర్ మాత్రం / ఆంగ్లంలోనే వెలుగు అని కన్నోజు లక్ష్మీకాంతం అంటారు.

భాష అనేది సమాజంలో ప్రవహిస్తున్న నదిలాంటిది. అలాంటి భాషను, మాండలికాలతో పాటు వ్యవహారిక భాషను సమతుల్యంతో వాడాలనేందుకు ఉదాహరణ

ఏ భాష చెణుకైన / ఏ యాస చినుకైన

తనతోన కలుపుకొని / తరలింది తెలుగు అని అంటారు డా॥సి. నారాయణరెడ్డి.

ఈ విధంగా తరతరాల తెలుగు–వెలుగులను, తెలుగు కీర్తులను తమ కవితలతో ప్రకాశింప జేసిన వారెందరో ఉన్నారు. మధురమైన మన మాతృభాష మృత భాష కాకుండా బ్రతికించుకోవలసిన బాధ్యత మనందరిదీనూ. తెలుగుభాషకు మళ్ళీ పూర్వ వైభవాన్ని తీసుకు వచ్చేందుకు కవులు, రచయితలు, భాషాభిమానులు పత్రికలు, యువకులు నడుం కట్టవలసిన అవసరం ఎంతో ఉంది. ✿



# ఆవిరియంత్రం

## ఆరోహణ-9



– జె.బ్రొనొస్కి

విప్లవాలు యాదృచ్ఛికంగా రావు. వాటి వెనక, జీనియస్సుల జీవిత కృషి వుంటుంది. కాని, పద్దెనిమిదవ శతాబ్ది విప్లవాలు సామాన్యుల ప్రయత్న ఫలితమే. ప్రతివ్యక్తీ, తన భవిష్యత్తును తనే నిర్మించుకోవాలనే విశ్వాసమే వారినీ మహత్కార్యాలకు ప్రోత్సహించింది.

సైన్సుకు సామాజిక బాధ్యత వుందనేది చాలా సహజమైన విషయంగా యిప్పుడు మనం అంగీకరిస్తాం. కాని, న్యూటన్, గెలీలియోలు ఈ అభిప్రాయంతో ఏకీభవించకపోవచ్చు. వాళ్ళ దృష్టిలో సైన్సంటే ప్రకృతిరహస్యాలను అర్థం చేసుకునే క్రమం మాత్రమే. తెలుసుకున్న సత్యాలను నిజాయితీగా లోకానికి చెప్పటం సైంటిస్టు బాధ్యత అనుకున్నారు వాళ్ళు. సైన్సుకూ, సమాజానికీ సంబంధం వుందనే భావన పారిశ్రామిక విప్లవంతో ప్రారంభమవుతుంది.

1760 దశకంలో ప్రారంభమైన అనేక మార్పుల, ఆవిష్కరణల పరిణామస్వరూపమే పారిశ్రామిక విప్లవం. ఇంచుమించు అదేకాలంలో, అమెరికన్ విప్లవం (1775), ఫ్రెంచి విప్లవం (1789) కూడా పురుడు పోసుకున్నాయి. అయితే, ఈ రెండూ సామాజిక విప్లవాలు. ఇంగ్లీషు సామాజిక జీవితం మీద తిరుగులేని ప్రభావం చూపింది పారిశ్రామిక విప్లవం. దీన్ని 'ఇంగ్లీషు విప్లవంగా' అభివర్ణించవచ్చు.

ఇంగ్లండు అప్పటికే ఒక ముఖ్యమైన (వివిధవుత్పాదనల) తయారీ కేంద్రంగా ఎదిగింది. అయితే, అదంతా గృహపరిశ్రమలకే పరిమితమైంది. అందువల్ల, పారిశ్రామిక విప్లవం కూడా గ్రామాల్లోనే ప్రారంభమైంది. దీనికి ఆద్యులెవరు? ముఖ్యంగా వృత్తిపనివాళ్లు అంటే గడియారం తయారీదార్లు, కాలువలు తవ్వేవాళ్ళు. కమ్మరివాళ్లు వగైరా.

వాణిజ్యం పెరగటంతో, పరిశ్రమల మీద ఒత్తిడి కూడా పెరిగింది. గృహపరిశ్రమలు వాణిజ్య అవసరాలకు సరిపోని పరిస్థితి ఏర్పడింది. రెండు తరాలలో, అంటే 1760–1820 మధ్య పరిశ్రమల రూపురేఖలు పూర్తిగా మారిపోయాయి. 1760కి ముందు, ఫలానా ఫలానా వుత్పత్తులు కావాలని గ్రామాల్లోని వృత్తి పనివాళ్ల వద్దకు వెళ్ళటం రివాజు. 1820 ఆ పనివాళ్లే ఫ్యాక్టరీలకు (కర్మాగారాలకు) రావటం ప్రారంభమైంది. అయితే, ఆ తొలిదశ ఫ్యాక్టరీలు, కార్మికులను ఎంత దారుణంగా హింసించేవో జార్జి క్రాబ్ లాంటి కవులు హృదయవిదారకంగా వర్ణించారు.

1733లో, జేమ్స్ బ్రిండ్లే, చిన్న మరయంత్రాలతో తన ఫ్యాక్టరీ జీవితం ప్రారంభించాడు. అయితే, 1750 నాటికి వృత్తిపనివాళ్లు మరింత నేర్పు, శాస్త్రీయ, సాంకేతిక పరిజ్ఞానం గడించి 'ఇంజనీర్లు'గా మారక తప్పలేదు. అలా, పరిణామం చెందిన వాళ్లలో బ్రిండ్లీ ఒకడు. అతడికి కాలువలు తవ్వటంలో ప్రావీణ్యంవుంది. మొదట మాంచెస్టర్, లివర్‌పూల్‌ల మధ్య కాలువను పూర్తి చేసిన బ్రిండ్లీ, ఇంగ్లండులో నాలుగు వందల మైళ్ల పొడవు కాలువలు తవ్వాడు. వ్యాపార అవసరాలకు అనుకూలంగానే ఇంగ్లండులో సాంకేతిక పరిజ్ఞానం పెరిగింది. ఫ్రాన్సులో, రాజులనూ, సంపన్నులనూ మెప్పించటానికి గడియారాల వంటి ఆవిష్కరణలు జరిగాయి.

1778లో బెంజిమన్ ఫ్రాంక్లిన్, ఫ్రాన్సుకు రాయబారిగా వచ్చాడు. శాస్త్రవిషయాలనే గాక, జీవితాన్ని కాచివడబోసిన ఈ మేధావి "పూర్ రిచర్డ్స్ ఆల్మనాక్" అంటూ ప్రతిఏడూ ఓ

తెలుగు : ముక్తవరం పార్థసారథి, ఫోన్ : 9177618708

గ్రంథం ప్రచురించాడు. "ఆకలిగొన్న వాడికి రుచిలేని భోజనమంటూ వుండదు." "డబ్బు విలువ తెలియాలంటే అప్పుచేయటానికి ప్రయత్నించు" అన్న నానుడులన్నీ ఆయన సృష్టించినవే. వక్త మొహంచూడకుండా, ఫ్రెంచి భాష అర్ధం చేసుకోలేని ఫ్రాంక్లిన్, తన కళ్లద్దాలను మధ్యలో కోసి "బైఫోకల్స్ తయారు చేసుకున్నాడు. మెరుపు మెరిసినప్పుడు విద్యుత్తు పుడుతుందని 1782లో నిరూపించాడు. ఈ జ్ఞానంతో Lightining conductors తయారు చేసి డబ్బు సంపాదించాడు.

1787లో, ఇనుమును పోతపోసి, జాన్ విల్కిన్సన్ ఇనపబోటు తయారు చేశాడు. పారిశ్రామిక విప్లవానికి ముడిసరుకు ఇనుము. 1774లో, జోసయావెడ్జ్‌వుడ్, రష్యా మహారాణి కాథరైన్ దిగ్రేట్ కోసం అలంకరించిన పింగాణీ టేబుల్‌వేర్ తయారు చేశాడు. కొలిమిలోని వేడిని ఖచ్చింతగా నిర్ధారించే సాంకేతిక పరిజ్ఞానం వుండటం వల్లే ఈ పింగాణీ అద్భుతాలు సృష్టించగలిగాడు.

పారిశ్రామిక విప్లవం వల్ల కలిగిన లాభాలు : గృహపరిశ్రమలతో పోలిస్తే, ఫ్యాక్టరీలలో వుత్పత్తి అనేక వందల రెట్లు పెరిగింది. ఉత్పత్తులు అందరికీ అందుబాటులోకి వచ్చాయి. (ఫ్యాక్టరీ పరిస్థితులూ, కార్మికుల గృహవసతి, ఆరోగ్యం దారుణంగా వున్నాయి. అది వేరే విషయం.)



జేమ్స్‌వాట్

అయితే, ఈ ఫ్యాక్టరీవల్ల ఒక అనూహ్యమైన పరిణామం ఎదురైంది. ఇన్నాళ్లూ, వృత్తిపనివాళ్లు తమ అలవాట్లకు అనుకూలంగా వస్తువులను వుత్పత్తి చేశారు. ఎంత శ్రమ చెయ్యాలి? ఎప్పుడు చెయ్యాలి? అని ఎవరికి వారే నిర్ణయించుకున్నారు. కాని యిప్పుడు పరిస్థితి మారింది. యంత్రాల వేగాన్ని బట్టి కార్మికులు పనిచెయ్యక తప్పనిస్థితి. ఒకసారి యంత్రం ముందర కూర్చుంటే, కార్మికుడు ఏంచెయ్యాలో, ఎంత వేగంతో చెయ్యాలో అదే నిర్ణయిస్తుంది. దీనితో, కొత్త నీతిసూత్రాలు వల్లించారు యజమానులు. క్రౌర్యం, దుర్మార్గం పాపంకాదు. అలసత్వం నిజమైన పాపం! మాత్యూబౌల్టన్ సాయంతో, 1776లో జేమ్స్‌వాట్ తొలి ఆవిరి ఇంజన్ తయారు చేసాడు. అంతే, ఆనాటి నుండీ, ఆవిరిశక్తి, పారిశ్రామికవిప్లవానికి చోదకశక్తిగా మారింది. పరిశ్రమ అవసరాలను బట్టి గాలి, సూర్యుడు, నీళ్లు, బొగ్గు వల్లకూడా శక్తి (Power) సృష్టించవచ్చునని గ్రహించారు.

అలా, సైన్సులో జరిగిన కొత్త ఆవిష్కరణ 'శక్తి' పారిశ్రామిక విప్లవాన్ని ముందుకు నడిపించిందదే. ఇన్నాళ్లూ ప్రకృతిని అర్ధంచేసుకోవటమే తమ ప్రధాన కర్తవ్యమన్నారు శాస్త్రజ్ఞులు. ఇప్పుడు, ప్రకృతిని తమ కనుకూలంగా మలుచుకోవటానికి, (Power)ను తయారు చెయ్యటానికి ఒక వనరుగా మలచుకున్నారు. రిచర్డ్ ట్రెవితిక్ అక్కడే కార్నిష్ కమ్మరి వృత్తికారుడు జేమ్స్‌వాట్ ఆవిరి ఇంజన్లో మార్పులు చేసి ఆవిరి శక్తితో నడిచే యంత్రం రూపొందించాడు.

పారిశ్రామిక విప్లవం సాంకేతిక ప్రగతికి ఎంత తోడ్పడ్డా, వృత్తి పనివాళ్ల జీవితాలను అంత క్రూరంగా చిదిమేసింది. కాని విప్లవాల స్వభావమది. వాటి యినపచక్రాల కింద అమాయకులు నలిగిపోక తప్పదు. వందల, వేల సంవత్సరాల మానవ ఆరోహణా క్రమంలో యిటువంటి విషాదాలెన్నో!

సూర్యుడి వేడిలో శక్తి వున్నది. మెకానికల్ ఎనర్జీ, వేడిగా పరిణామంచెందే ప్రక్రియను అధ్యయనం చేశాడు మాంచెస్టర్‌కు చెందిన జేమ్స్‌ప్రెస్కాట్ జోన్. 778 అడుగుల ఎత్తునుండి పడిన నీటి ఉష్ణోగ్రత 25 ఫారన్‌హీట్ డిగ్రీలు పెరుగుతుందని తెలిసింది.

* * *

పరస్పరం సంప్రదించుకోకుండా, సంబంధంలేకుండా, యిద్దరు వ్యక్తులు, 1850లలో పరిణామ సిద్ధాంతాన్ని ప్రతిపాదించారు. ఒకరు : చార్లెస్ డార్విన్ మరొకరు : ఆల్ఫ్రెడ్ రసెల్ వాలస్. ఇద్దరికీ కొంత శాస్త్రనేపథ్యముంది. డార్విన్ రెండేళ్ళపాటు ఎడిన్‌బర్గ్ విశ్వవిద్యాలయంలో వైద్యవిద్యనభ్యసించాడు. పేదవాడైన వాలస్, పధ్నాలుగో ఏట

స్కూలు చదువుకు స్వస్తి పలికి, లండన్‌లోని వర్కింగ్‌మెన్స్ ఇన్‌స్టిట్యూట్‌లోనూ, లైసెస్టర్‌లోనూ సర్వేయర్‌లకు అసిస్టెంటుగా గడిపాడు.

తన ఇరవయ్యవ ఏట, 'బీగల్' అనబడే నౌకలో, దక్షిణ అమెరికాకు ప్రయాణమయ్యాడు డార్విన్. కొడుకు యిలా యాత్ర చెయ్యటం తండ్రికి నచ్చలేదు. కాని ఒక అంకుల్ అతణ్ణి సమర్థించాడు. 27 డిసెంబర్ 1831 నాడు బయల్దేరింది బీగల్.

అయిదేళ్ల ప్రయాణం అతడిని పూర్తిగా మార్చివేసింది. పక్షులనూ, పువ్వులనూ పరిశీలించటం అతడికి ఇష్టం. దక్షిణ అమెరికాలో ఆ యిష్టం Passion గా మారింది. రెండేళ్ల తర్వాత, జీవుల పరిణామక్రమాన్ని ఓ అభిప్రాయం ఏర్పడిందిగాని, ప్రచురించటానికి ఆసక్తి కనపర్చలేదు కాని, పరోక్షంగా మరో వ్యక్తి అందుకు కారణమయ్యాడు.

అతడే ఆల్ఫ్రెడ్ రసెల్‌వాలస్. ఇతడు డార్విన్ కన్నా పధ్నాలుగేళ్లు చిన్న. సర్వేయర్ వుద్యోగం వదిలి, 'నేచరలిస్ట్'గా అనేక సవంత్సరాలపాటు దక్షిణ అమెరికా, తూర్పుదేశాలలో జీవజాలాన్ని సేకరిస్తూ గడిపాడు. కొంత యాధృచ్ఛికంగా, కొంత మిత్రుల ప్రోత్సాహం వల్ల తను రాసుకున్న 'నోట్సు' డార్విన్ దృష్టిని ఆకర్షించాయి. రెంటికీ ఎంతో సారూప్యం వుందని కూడా తెలిసింది. ఆ తర్వాత, డార్విన్ రాసిన "ది ఆరిజిన్ ఆఫ్ స్పీషీస్" 1959 చివరన అచ్చయి గొప్ప సంచలనం సృష్టించింది. ఆ రోజుల్లో అదో బెస్ట్ సెల్లర్. ప్రకృతి వరిణామవాదం వందొమ్మిదవ శతాబ్దిలో జరిగిన అత్యంతముఖ్యమైన ఆవిష్కరణ. సృష్టి యథాతథంగా వుండదనీ, నిరంతరం మార్పుకు గురి అవుతుందనీ లోకానికి చాటి చెప్పిన సిద్ధాంతమది. భౌతికంగా, పది మిలియన్ సంవత్సరాల కాలం నాటి భూగ్రహమే యిది. కాని దీని మీది జీవులు మాత్రం ఎంతో వరిణామం చెందాయి. ఉదాహరణకు, పదిమిలియన్ నంవత్సరాల నాడు, ఈ



హార్స్ పవర్

విషయాలు చర్చింటానికి మనిషనేవాడు లేడు. ఫిజిక్సు సూత్రాలు వేరు. కాని జీవశాస్త్రం మాత్రం కాలానుగుణమైనవి. సృష్టి మనకు నిత్యనూతనంగా కనిపించటానికి కారణం దాని పరిణామ స్వభావమే. జీవి ఎలా పుట్టింది? దాని కణజాలాల రసాయన ప్రక్రియ ఏలాంటిది? అన్ని జీవులకూ వర్తించే కెమిస్ట్రీ గురించి తెలుసుకుందాం.

ఇప్పుడు మనలో ప్రవహిస్తున్న రక్తంలోని మాలెక్యూల్స్ కొన్ని లక్షల సంవత్సరాల నాటి జీవుల రక్తం నుండి వచ్చినవే. అంటే ఆ రక్తం, తననుతాను పునరుత్పత్తి చేసుకుంటూ యిన్ని వేల లక్షల తరాలుగా పరిణామం చెందిందన్నమాట. దీన్నే 'వంశపారంపర్యం' అంటాం.

జీవుల ఆవిర్భావం గురించి అనేక కథలు ప్రచారంలో వున్నాయి. ఆపిల్‌పళ్లలో పురుగు లెక్కణ్ణించి వచ్చాయి? నైలునది బురదలో మొసళ్ళు వాటంతటవే పుడతాయని కొందరు నమ్ముతారు. ఈ కట్టుకథల్ని1860లో శాస్త్రీయంగా తిరస్కరించాడు లూయీపాశ్చర్. పులియబెట్టటం (Fermentation) వల్ల క్రిములు వృద్ధి అవుతాయని నిరూపించాడు. మద్యం (Wine) లో కోటానుకోట్ల క్రిములుంటాయి. కొన్ని, ఆక్సిజన్ లేని పరిస్థితుల్లో కూడా జీవించగలవు. డార్విన్ కాలంలో ఎన్ని వివాదాలున్నా, పరిణామవాదం గురించి యిప్పుడు (యించుమించు) అందరిదీ ఏకాభిప్రాయమే. శరీర నిర్మాణంలోని రసాయనప్రక్రియను బాగానే అర్థం చేసుకున్నాం.

స్ఫటికం, ప్రధానంగా ఏడు ఆకారాల్లో, పలురంగుల్లో లభ్యమవుతుంది. నిజానికి, ప్రకృతిలోని స్ఫటికాలు, తమ నిర్మాణానికవసరమైన అణువుల గురించిన సమాచారం కూడా తెలియచేస్తాయి. అణువులు అనేక సముదాయాలకు (Families) చెందినవని మనకు తెలుసు. ఈ శతాబ్దిలో ఆవిష్కృతమైన భౌతికశాస్త్ర పరిజ్ఞానమని. స్ఫటికాల్ని అర్థం చేసుకోవటమంటే భౌతిక ప్రపంచ రహస్యాలు అవగాహన చేసుకోవటమే.

స్ఫటికాలన్నింటిలోకీ, అత్యంత సాధారణమైనది. అతిసులభంగా లభ్యమయ్యేది ఉప్పు. శాస్త్రదృష్ట్యా, యిది అతి ప్రధానమైనది కూడా. పోలిష్ రాజధాని క్రాకో సమీపంలోని వీలిజ్కా వద్ద ఉప్పు గనులున్నాయి. వేయి ఏళ్ళుగా అక్కడ తవ్వకాలు జరుగుతూనే వున్నాయి. ఈ పరిశ్రమకు సంబంధించిన పదిహేడవ శతాబ్దంనాటి పరికరాలూ, గుర్రాలతో లాగించిన యంత్రాలు యిప్పటికీ చూడవచ్చు. రసవాది పారాసెల్సస్ యిక్కడికి వచ్చి వుంటాడు. మనిషి నిర్మాణంలో ఉప్పు కీలకమైనదని క్రీ.శ.2500లు లోనే చెప్పాడు. జీవితానికి అత్యంత ముఖ్యమైనది ఉప్పు. అన్ని నాగరికతల్లోనూ యిది ఒక ప్రధాన సాంస్కృతిక ప్రతీకగా వుంది. రోమనుల కాలంలో ఉద్యోగుల జీతాన్ని (Salary) అన్నారు. ఇప్పటికీ ఆ పదం వాడుకలోనే వుంది. (Salary) అంటే Salt Money మధ్య ప్రాచ్యదేశాలలో ఒప్పందాలను ఉప్పుతో Seal వేస్తారు. పాత నిబంధన ప్రకారం యిది "వుప్పు ఒడంబడిక" అంటే "శాశ్వత ఒడంబడిక." నిజానికి, పారాసెల్సస్ అవగాహన సరైంది కాదు. ఉప్పు మూలద్రవ్యం (Element) కాదు. రెండు మూలద్రవ్యాలు-సోడియం క్లోరైన్ కలిసిన సమ్మిశ్రిత ధాతువు. ఒక తెల్లటి లోహం (సోడియం), పసుపుపచ్చ విషవాయువు (క్లోరిన్) కలిసి ఒక ద్రవ్యాన్ని సృష్టించటం విలక్షణ రసాయన ప్రక్రియగానే భావించాలి. ఇందులోని మరోవిచిత్ర మేమంటే, ఈ రెండూ, భిన్న గ్రూపులను చెందినవి. సోడియం క్షార (alkali) లోహం. క్లోరైన్, హెలోజెన్ కుటుంబానికి చెందినది. ఈ వివిధ మూలద్రవ్యాల అణునిర్మాణాల గురించి కొత్త ఆవిష్కరణలు చేసింది రష్యన్ శాస్త్రజ్ఞుడు డిమిత్రీమెండలీవ్.




'అణు' పరిశోధనల ప్రభావం, కళారంగం మీద కూడా పడింది. అంబెరక్ష బాచ్చియోనీ "ది ఫోర్సెస్ ఆఫ్ ఎ స్ట్రీట్" లేక డైనమిజం ఆఫ్ ఎ సైక్లిస్ట్' చిత్రాలు యిందుకు మంచి వుదాహరణ. స్ఫటికాలతో చిత్రాలు వేసిన వాళ్లలో జార్జ్ బ్రాక్ ముఖ్యుడు. లేదా పికాసో క్యూబిస్ట్ పెయింటింగ్స్‌లో, రూపానికి కాకుండా, అంతర్లీనంగా వున్న రూపస్వభావాన్ని అర్థం చేసుకునే ప్రయత్నం జరిగింది. వీళ్లు, శరీరభాగాలను విడగొట్టి, తిరిగి Reconstruct చేసి దృశ్యమాధ్యమంలో కొత్త ప్రమాణాలు నెలకొల్పారు. వీళ్ల మీద ఆనాటి కెమిస్ట్రీ, ఫిజిక్సుల శాస్త్ర పరిశోధనల ప్రభావం ఉంది.

అయితే, కళకూ, శాస్త్రాధ్యయానికీ మౌలికమైన తేడావుంది, కళాకారుడు, కొత్త రూపాలను సృష్టిస్తాడు. శాస్త్రజ్ఞుడు కేవలం విశ్లేషిస్తాడు. ఇప్పుడు మనం, యిరవయ్యో శతాబ్దికి చెందిన అత్యంత ముఖ్యుడైన శాస్త్రజ్ఞుడు, ఆధునిక ఫిజిక్సు పితామహుడు నీల్స్ బోర్ (Niels Bohr) గురించి మాట్లాడుకుందాం.

"నా ప్రతి వాక్యం ఒక ప్రతిపాదనగా ఒక అభిప్రాయంగా కాక, ఒక ప్రశ్నగా మీరు చూడాలి." అంటూ ఆయన తన ఉపన్యాసాన్ని ప్రారంభించేవాడు.

మాక్స్ ప్లాంక్, 1900 లో జర్మనీలో ప్రచురించిన 'On The Constitution of Atoms and Molecules' గ్రంథాన్ని ఇప్పటికీ ఒక క్లాసిక్‌గా పరిగణిస్తారు. 1922లో, నోబెల్ బహుమతి ఆయన్ను వరించింది.

భౌతిక ప్రపంచ నిర్మాణాన్ని అర్థంచేసుకోవటానికి అణు పరిజ్ఞానమే తొలిమెట్టు. పదార్థానికి నాశనం లేదని నిరూపించారు శాస్త్రజ్ఞులు. అంటే, అనంతంలో క్షణాన్ని మనం ఆస్వాదించగలగాలి. కవి విలియం బ్లేక్ ఈ విషయాన్ని తన కవితలో అద్భుతంగా బంధించాడు.

**ఇసకరేణువులో ప్రపంచాన్ని చూడాలి.**
**గడ్డిపువ్వులో స్వర్గాన్ని,**
**అరచేతిలో అనంతలోకాల్ని,**
ఒక గంటలో శాశ్వతత్వాన్ని అనుభవించగలగాలి!

భౌతిక శాస్త్రాల లక్ష్యం, భౌతిక ప్రపంచాన్ని ఖచ్చితంగా తెలుసుకోవటమే. అయినా, ఇరవైయవ శతాబ్దిలో, శాస్త్రజ్ఞులు తను లక్ష్యాన్ని సాధించ లేక పోయారు. ఓ ఉదాహరణ ద్వారా ఈ అభిప్రాయం స్పష్ట మవుతుంది.

ఒక అంధురాలు ఒక వ్యక్తి మొహాన్ని చేత్తో తడిమి చూస్తూ యిలా మాట్లాడు కొంటున్నదనుకోండి: "ఇతడు కాస్త వయసు మళ్లిన వాడైవుంటాడు. మొహం గుండ్రంగా వుంది. అంటే యింగ్లీషు వాడు కాకపోవచ్చు. ఏ దేశాలవాళ్ల మొహాలిలా వుంటాయి? యూరోపియన్లా? తూర్పు దేశాల వాడు కూడా కావచ్చు. మొహం మీద గీతలున్నట్టుంది. బాధలో వున్నాడేమో?''... వగైరా. చిత్రకారులు కూడా యిలాంటి ప్రయత్నం చేస్తారు. అయితే మనిషిని గుర్తించటానికి యిదొక్కటే పద్ధతా? ఇంతవరకూ శాస్త్ర పరిశోధనలు చేసిందదే. పరిపూర్ణ జ్ఞానమనేది మిధ్య. అది మనిషి వూహల్లో మాత్రమే వుంటుంది.



నిజానికి, పరిపూర్ణతను సాధించు కునేవాళ్ళు శాస్త్రజ్ఞులైనా, మరేయితర మేధావు లైనా, ఓటమినీ, విషాదాన్నీ అంగీకరించక తప్పదు. సమాచార సేకరణ ఎప్పుడూ పూర్తికాదు. ఆయన వలన 'మనకు తెలిసిందింతే' అని సవినయంగా మన పరిమితులను అంగీకరించాలి. మనిషి తలరాతయింతే. క్వాంటమ్ ఫిజిక్స్ కూడా యిదే చెబుతోంది.

ఇందులో ఉపమానాలూ, ఊహలూ లేవు, సత్యమిదే. ఎలక్ట్రోమాగ్నెటిక్స్ గురించి తెలిసిన సమాచారాన్ని ఒకసారి పరిశీలించండి. మనిషి తయారు చేసిన ఏ పరికరంతోనైనా దీన్ని ఖచ్చితంగా కొలవగలమా? నిర్ధారించగలమా? ఒకవేళ బెస్ట్-పర్ఫెక్ట్-పరికరం తయారుచేశామనుకన్నప్పటికీ, మనం సేకరించిన సమాచారమంతా సరిగానే వుందని ధైర్యంగా చెప్పగలమా?

1867లోనే, కాంతి 'ఒక ఎలక్ట్రోమాగ్నటిక్ అల' అని ప్రతిపాదించాడు జేమ్స్ మాక్స్‌వెల్ క్లార్క్ 'ఒక అల' అనటంలోనే అనేక అలలున్నాయన్నది కూడా స్పష్టమవుతుంది. కాంతి యొక్క వర్ణపటాన్ని (Spectrum) ను పరిశీలించి నట్టయితే, ఎరుపు నుండి నీలం దాకా కనిపించే రంగులు దృశ్యమానము కాని ధార్మికతలో ఒక భాగం మాత్రమేనని తెలుస్తుంది.

దీని గురించి, అత్యంత విస్తృతమైన సమాచారం అందుబాటులో వుంది. కాంతి, రేడియో తరంగాల అత్యంత పొడుగైన Wavelength నుండి అతి పొట్టి X Rays దాకా – అనేక లో ప్రయాణిస్తుంది. పొడుగైన రేడియో తరంగాల వునికిని హైన్రీష్‌హెర్ట్జ్ 1888 లోనే నిరూపించాడు. అంటే, మాక్స్‌వెల్ సిద్ధాంతాన్ని ధృవపరిచాడు. అత్యంత పొడవైన ఈ తరంగాలు, సూక్ష్మ రూపాలను (వుదాహరణకు మనిషి మొహం) గుర్తించ లేవు.

తరంగం పొడుగు తగ్గినప్పుడు మాత్రమే మొహం మనకు కనిపిస్తుంది. మనిషి మొహం కనిపించాలంటే, మిల్లీమీటర్ కన్నా తక్కువ పొడవున్న ఇన్‌ఫ్రారెడ్ కిరణాలు అవసరమవుతాయి. 1800లో, విలియం హెర్షెల్ వీటిని కనుగొన్నాడు. ఇన్ఫ్రారెడ్ కిరణాలంటే ఉష్ణ (Heat) కిరణాలు. కెమెరాలోని ప్లేటు వాటిని దృశ్యమానమైన కాంతిగా మారుస్తుంది. అతి తక్కువ వేవ్‌లెంక్త్‌లో – అంటే సుమారు మిల్లీమీటర్‌లో వందో వంతు – ఇన్ఫ్రారెడ్, దృశ్యమానమైన ఎరుపుగానూ మారుతుంది. శ్వేతకాంతిలో అనేక వేవ్‌లెంక్త్‌లుంటాయి.

అంటే, ఎరుపునుండి పసుపు నుండి, ఆకుపచ్చనుండి, నీలి (వయొలెట్) దాకా. చిత్రకారుడు, బొమ్మలోని ఒక్కొక్క కోణాన్నీ, తన ప్రాధాన్యతను అనుసరించి, ప్రస్ఫుటంగా చూపినట్టే. శాస్త్రజ్ఞుడు కూడా, మైక్రోస్కోప్ సహాయంతో, అనేక విషయాలను అధ్యయనం చెయ్యవచ్చును గదా అని అడగటం సబబే.

కాని, మనం గ్రహించాల్సిందేమిటంటే, మైక్రోస్కోపు, కనిపించని దాన్ని అనేక రెట్లు పెద్దదిగా చేసి చూపగలదే తప్ప, రూపాన్ని మెరుగు పర్చలేదు. ⓜ

# అలనాటి చిత్రకారిణి
# పీసుపాటి సీతాదేవి



- పి.వి. శాస్త్రి

చిత్రకళ పేరు చెప్పగానే మన తెలుగు వారికి గుర్తుకు వచ్చేది దామెర్ల రామారావు గారి పేరు. సీతాదేవి కూడా ఆకాలం నాటి చిత్రకారిణి. వారిద్దరి బాణి కళాధోరణి చాలా దగ్గరగా ఉంటాయి. కొంత మంది చిత్రాలు చూస్తుంటే వారి మనస్సులోని భావము మనకు చాలా తేలికగా అర్ధమవుతుంది. అలాగే అరుదైన చిత్రాలతో అనంతమైన భావాలను పలికిస్తూ తన ప్రత్యేకతను చాటుకున్నారు. సీతాదేవి గారు.

సీతాదేవి 1920లో పశ్చిమ గోదావరి జిల్లా ఏలూరు సమీపమున ఉన్న వసంత వాడ అనే గ్రామములో జన్మించారు. వీరి కుటుంబములో అందరూ కళాకారులు కావటం విశేషం.



గోరుముద్ద

వీరిది కళాకారుల కుటుంబము. వీరి అన్నగారైన కృష్ణమూర్తి గొప్ప చిత్రకారులు. అలాగే ఈవిడ తమ్ముడైన మొక్కపాటి నాగేశ్వరరావు ప్రశిద్ధ వైణిక విద్వాంసుడు. సీతాదేవి చెల్లెళ్ళు విజయలక్ష్మి-స్వరాజ్యలక్ష్మిలు కూడా గొప్ప చిత్రకారులు.

ఈమె అన్న గారైన మొక్కపాటి కృష్ణమూర్తి బొంబాయిలోని జెజె స్కూల్ ఆఫ్ ఫైన్ ఆర్ట్స్ కళా నైపుణ్యానికి పునాది వేశారు. ఆయన చిత్రాలు వేస్తూంటే ఈమె ఏకలవ్య శిష్యురాలి వలె నేర్చుకుని ప్రతిభను కనబర్చారు. ఈమె ఎవరి వద్ద శిక్షణ పొందలేదు. ఈమె వేసిన చిత్రాలన్నీ నీటి వర్ణ మాధ్యమముతో వేసినవే.

ఈమె తన చిత్రకళా ప్రయాణాన్ని 1935 నుండి 1960 వరకు కొనసాగించారు. ఈ కాలంలో సుమారు 40 చిత్రాల వరకు చిత్రించారు. ఒకనాటి మాసపత్రిక అయిన 'భారతి'లో ఈమె చిత్రాలు ప్రతి నెలా ముద్రింపబడేవి. దాని బట్టే ఆమె యొక్క చిత్రకళా ప్రతిభ గోచరమవుతుంది. ఆనాటి చిత్రకారిణిలలో సీతాదేవి ప్రధమ స్థానములో ఉండేవారంటే అతిశయోక్తి గాదు. ఈమె చిత్రాలు మద్రాసు ఢిల్లీ మొదలగు మహానగరాల్లో ప్రదర్శితమయినవి. "ఆంధ్ర మహిళా సభ" మద్రాసు వారు దుర్గాబాయి దేశ్‌ముఖ్ సమక్షంలో మద్రాసులో సీతాదేవిని సన్మానించి "వెండి పెట్టె" బహూకరించారు. ఆ సందర్భంలో సీతాదేవికి బహుళ ప్రచారం జరిగినది.

అదే విధంగా 1985లో ఏలూరులో చిత్రకళా ప్రదర్శన జరిగినది. ఆ విధంగా 1960 వరకు సీతాదేవిగారు చిత్రకళా రంగానికి సేవచేశారు.

సీతాదేవి వివాహము కాక పూర్వము అంటే 1940 వరకు అన్నయైన కృష్ణమూర్తి గారి ప్రోత్సాహంతో అనేక చిత్రములు వేసి ప్రదర్శనలలో ప్రదర్శించి ఎనలేని కీర్తిని గడించారు. కాని వివాహము తర్వాత ఉమ్మడి కుటుంబములో తగినంత ఆదరణ, ప్రోత్సాహము-ప్రత్యేకంగా తన భర్తగారి

---

సేకరణ: పి.వి.శాస్త్రి, ఫోన్ : 040-27631233

నుండి లేని కారణముగా ఎక్కువగా చిత్రాలు వేయలేక పోయారు. అయినప్పటికి కాన్పులకు పుట్టింటికి వెళ్ళినప్పుడు అయిదు ఆరునెలలు అక్కడే వుండి చిత్రలేఖనము చేసినారు. ఆ విధంగా చాలా చిత్రాలు వేశారు. వారి అన్న గారు అన్ని విధాల అండగా వుండి చిత్రలేఖనము చేసినారు. ఆ విధంగా చాలా చిత్రాలు వేశారు. వారి అన్నగారు అన్ని విధాల అండగా ఉండి ఆమెను చిత్ర కళా ప్రదర్శనలకు తీసుకువెళ్ళి ఎంతో పేరు ప్రఖ్యాతములు రావటానికి దోహదపడ్డారు.

1960 నుండి ఆమె చిత్రకళారంగానికి దూరమవుతూ వచ్చారు. తర్వాత తర్వాత ఆమె చిత్రాలు వేయలేకపోయారు. ఆ సమయములోనే ఆమె రెండో కొడుకు ఇంట్లో నుండి పారిపోవటం జరిగినది. అది ఆమెను చాలా కృంగ దీసింది. భర్త నిరాదరణ తోటి ఇది కూడా తోడయి ఆమెను మనస్తాపానికి గురి చేసింది. పెద్ద కొడుకు ఉద్యోగ నిమిత్తము హైదరాబాద్‌లో ఉండుట. అలాగే అమ్మాయికి పెళ్ళై హైదరాబాద్‌కు వెళ్ళి పోవుట ఆమెను మానసికంగా కృంగ తీసింది. ఈ పరిస్థితిలో ఆమె చాల వరకు ఒంటిరి జీవితాన్ని గడిపింది. ఆమె ఒకరకమైన విరక్తితో ఏకోరికలు లేకుండా మౌనంగా గడపసాగింది.

అదే సమయములో అంటే 1962లో ఆమె అన్న కృష్ణమూర్తి గారు కాలధర్మం చెందుట ఆమెను మరీ కృంగతీసింది. ఎన్నో ఒడుదుడుకులతో కుటుంబ సమస్యలతో చిత్రకళకు దూరమయి జీవితాన్ని గడిపారు సీతాదేవి.

ఆ విధంగా 30 ఏండ్లవరకు ఆమె చిత్రాలు వెలుగు చూడలేదు. కానీ తర్వాత ఆమె కుమారుడే పి.వి. శాస్త్రి వాటిని వెలుగులోనికి తీసుకు వచ్చి ఆంధ్రప్రభ మొ॥ వారపత్రికలలో ప్రచురింప చేశారు.

అలాగే మాదాపూరులోని "ఆర్ట్ గాలరీ"లో వాటిని ప్రదర్శించారు. ఆ విధంగా వాటికి ఈ నాటి కళా ప్రపంచానికి, కళా ప్రియులకు పరిచయం చేశారు.

సీతాదేవి వేసినవన్నీ నీటి వర్ణ చిత్రాలే. ఈమె చిత్రాలన్నీ గ్రామీణ వాతావరణానికి అద్దం పట్టే విధంగా ఉంటాయి. ఈమె చిత్రాలన్నీ రాధా కృష్ణులు గోపికలే ఇతివృత్తాలుగా గీసినవే. వాటి మీద ఈమెకు మక్కువ ఎక్కువ. అరుదైన చిత్రాలతో అనంతమైన భావాలు పలికిస్తూ తన ప్రత్యేకతను చాటుకున్నారు.



ఆదరణ

ఆమె చిత్రాలలో భావప్రకటన, రంగుల కలయిక, లేఖా విన్యాసాలు, ఒంపు సొంపులు, సున్నిత భావాలు ప్రత్యేకంగా చోటు చేసుకుంటాయి. వాటిలో జీవం ఉట్టిపడుతుంది.

ఈమె చిత్రాలలో గ్రామశోభ పల్లె వారి జీవనం. ప్రకృతి రమణీయత అన్నీ కలిసి ఆమె కుంచెల నుండి కాగితము మీదకు జాలువారి మనోహర చిత్రములుగా రూపుదిద్దుకున్నాయి. రేఖా సౌష్టవంలోగాని, కూర్పులోగాని భావ గంభీర్యములోగాని, రంగుల కలయికలో గాని, తెలుపు నలుపు సమ్మేళనంలోగాని వాటికవే సాటి. ఈమె చిత్రలేఖనాన్ని ఒక తపస్సుగా భావించారు. దానికి కారణం వారి అన్నగారిచ్చిన ప్రోత్సాహం, అండదండలే.

అలా సీతాదేవి 2006లో పరమపదించే వరకు చిత్రకళా ప్రపంచానికి దూరంగానే ఉన్నారు. 1935 నుండి 1955 వరకు ఒక గొప్ప వెలుగు వెలిగి రెండు దశాబ్దాలు ఎన్నో మంచి చిత్రాలు వేసి చిత్రలేఖనమునకు సేవ చేశారు.

ఆమె ఈ లోకాన్ని వదిలి వెళ్ళినా ఆమె చిత్రాలు నేటికీ సజీవంగా ఉన్నాయి. మి

# మరణశయ్య

- సంజీవదేవ్



మానవుడు అంతకుముందు అనేక విధాలైన శయ్యల మీద శయనించి వుంటాడు. కాని మరణశయ్య మీద శయనించి వుండడు. భీష్మ పితామహుడు తన జీవన సంధ్యలో అంపశయ్యమీద శయనించాడట. ఆయనకు అంపశయ్యయే మరణశయ్యగా వుండిపోయింది. పుట్టిన వాళ్లంతా ఒకనాటికి మరణశయ్యమీద శయనించి తీరాలనిపించేదే. కాని హృద్రోగాలు అధికమవుతున్న యీ రోజుల్లో చాలా మంది మరణశయ్యతో పనిలేకుండానే ఎక్కడ పడితే అక్కడే ఎవరితో చెప్పకుండానే మరణిస్తున్నారు.

తెలివి తప్పకుండా కొందరు మరణశయ్య మీదనే కొన్నాళ్లు జీవితాన్ని సింహావలోకనం చేసుకుంటూ వుండి పోతారు. వారు వర్తమానకాలంలో కంటే భూతకాలాన్నే ఎక్కువగా దర్శిస్తుంటారు. మరణశయ్యమీద శయనించి, వర్తమానకాలం వారికి మరణంతో తగిలి వున్నది; భూతకాలం జీవితంతో.

మరణశయ్య మీద శయనించి వున్న ప్రతివ్యక్తి భూతకాలం మొత్తం వెలుగుతోనే నిండి వుండదు, దానిలో ఎంతో చీకటి కూడా వుంటుంది. అయినా, మరణశయ్య మీది వ్యక్తికి గతించిన తన జీవితంలోని చీకటి కనిపించక వెలుగు మాత్రమే కనిపిస్తుంది. విషాదంలో వున్న వ్యక్తికి చీకటి ఘడియలు ఎక్కువగా గుర్తురావు. వెలుగు ఘడియలే ఎక్కువగా గుర్తుకొస్తాయి.

బాల్యంలో తాను ఆడిన ఆటలు, యవ్వనంలో తాను పాడిన పాటలు, తాను జరిపిన ప్రణయగాథలు, భగ్నప్రేమ తెచ్చిన వ్యథలు, తాను అనుభవించిన యథార్థకథలు, యీ విధంగా ఎన్నో ఎన్నో మరణశయ్య మీద కళ్లు మూసుకు పడుకున్నా కూడా తిరిగి ప్రత్యక్షమవుతూనే వుంటాయి. ఆ సజీవ జీవితం మళ్లీరాదు. ఎన్నెన్నో, యీ చావు పాన్పు ఎక్కక ముందు మరచిపోయిన జీవన లీలలు కొత్త రంగులతో, సరికొత్త రాగాలతో ఇపుడు ప్రత్యక్షమవుతుంటాయి. జీవితం అంటే ఒక నిర్వచనం ప్రకారం సంతోషంగా మరణించటానికి తయారు అయే స్థితి. ఎంత సనంతోషంగా జీవిస్తున్నా కూడా ఒక రోజుకు తాను మరణిస్తాననే భయం పీడిస్తూనే వుంటుంది. తమకు ఒకనాటికి మృత్యువు ఎదురవుతుందని మరచిపోయి జీవించేవారు కూడ లేకపోలేదు.

మృత్యువును గురించి నిత్యం భయపడుతుండటం ఎంత అవాంఛనీయమో అసలు మృత్యువు అనేది వున్నదని పూర్తిగా మరిచిపోయి జీవించటం కూడ అంత అవాంఛనీయం. ఒకనాటికి మృత్యువు ఎదురవుతుందనే విషయాన్ని మరువరాదు. మృత్యువు ఎదురవుతుంది ఒకనాటికి అని భయపడనూరాదు.

మృత్యువుకు భయపడేవాళ్లు మృత్యువు అంటే జీవితానికి అంతం కాదనీ, మరణించటం అంటే జీవితంలో ఒక మార్పు మాత్రమే అనీ, మరణానంతరపు జీవితం వున్నదనీ, తిరిగి పునర్జన్మను పొందుతామనీ నమ్మి ఆ ఆశతో సంతోషంగా వుంటారు. మరణానంతర జీవితం వున్నదో లేదో ఇంతవరకూ రుజువు కాలేదు.

అటువంటిది లేదనేది బయటికి కనపడుతున్నది, వున్నదనేది కనపడటం లేదు. బయటికి కనపడనిదంతా లేదని నమ్మటం కూడా ఒక మూఢ విశ్వాసమే. కనపడటం కనపటకపోవటం మాత్రమే సత్యానికి నిదర్శనాలు కావు. ఏది ఏమైనా, పునర్జన్మ వున్నదనే నమ్మకం చాలామందిలో వుండే మృత్యుభయాన్ని తొలగిస్తుంది కొంతవరకు. పునర్జన్మలో నమ్మకం లేకపోయినా కూడా మృత్యువుకు భయపడకుండా సంతోషంగా మరణించే వాళ్లు ధన్యులు. మరణం అంటే విచారం కలగటం, లేక భయం వేయటం సహజం.

ఇష్టమైన వాళ్లనూ, ఆత్మీయులనూ, ప్రియమైన పరిసరాలను వదిలి మరో దేశంవెళ్ళి రావటానికే భయపడతారు. వారిని శాశ్వతంగా వదిలివెళ్లే ప్రయాణం కాదు, కొద్ది రోజుల్లోనే తిరిగి వచ్చే ప్రయాణం. అయినా,

వారిని వదిలి వెళ్తూ మనసులో బాధపడతారు. త్వరలో తిరిగి వచ్చి మళ్లీ ఆత్మీయులను చూచుకొనే ప్రయాణానికి బయలుదేరుతూ తాత్కాలిక వియోగానికే బాధపడే మనిషి ఇంకెప్పటికీ శాశ్వతంగా తిరిగిరాని, ఇక ఏనాటికీ ప్రియమైన వారంతా చిరంతనంగా కనపడని ప్రయాణానికి సన్నాహం అవుతున్నపుడు మనిషి బాధపడటంలో ఆశ్చర్యం ఏముంది? ఆ తిరిగిరాని ప్రయాణమే మరణం. మరొక దేశపు ప్రయాణం నిమిత్తం యీ మర్త్యలోకాన్ని వదలాల్సిన అవసరం లేదు, కాని మరణించటం అంటే యీ మర్త్యలోకాన్నే పూర్తిగా, శాశ్వతంగా వదలిపోవాలి. అందుకు విచారం కలగక సంతోషం కలుగుతుందా?

లేదు, సంతోషమే కలగాలి. విచారకరమైన పనిని సంతోషంతో నెరవేర్చటం జీవనాదర్శాల్లోని ఉన్నతమైన ఆదర్శం. నివారించటానికి వీలులేని అనివార్యాలకు అనుకూలవడటం అభ్యసించకపోతే జీవితం విషాదకరమవుతుంది.

మరణం అనేది అన్నిటికంటే అనివార్యమైంది. దాన్ని ఏ విధంగాను, ఏ దేశంలోను, ఏ కాలంలోను నివారించటానికి వీలులేనిది. ఏ ఇతర విషయాన్ని గురించీ భవిష్యవాణి ఖచ్చితంగా చెప్పజాలంకాని ప్రతివ్యక్తి జీవితంలో తప్పక మరణం ప్రవేశిస్తుందనే భవిష్యవాణిని ఖచ్చితంగా చెప్పగలం!

కనుక వ్యక్తి, మరణశయ్య మీద శయనించి వుండి జీవితం మీద కాంక్షను కాక మరణం మీద కాంక్షను పెంచుకోవాలి. జరిగిపోయిన తన భూతకాల జీవితంలోని తీయని స్మృతులను కాక మరణశయ్య వున్న వర్తమాన కాలపు అనుభూతిని ఆనందమయం చేసుకోవాలి. తాను శయనించి వున్న స్థలాన్నీ కూడ మరచిపోయి ఆ రెంటికీ దూరంగా మరో ఆనందమయి జగత్తులో వున్నట్లు కల్పనను నిర్మించుకోవాలి. ప్రథమంలో ఏ కల్పనయినా, కల్పనగా గోచరిస్తుంది. కాని నిదానంగా అది వాస్తవంగా తయారవుతుంది.

మరణించిన వారిని గురించి ఇటీవల రకరకాల కథలు వచ్చినాయి. సగం మరణించి ఆస్పత్రులలో తిరిగి బ్రతికి వచ్చినవారు చెప్పిన కథలన్నీ ఒకరకంగా వుండక పోవటాన్ని గమనించాల్సిన విషయం. అటు వంటి సత్యం అందరకూ ఒకటిగానే గోచరించాలి కాని మనిషికొక విధంగా గోచరిస్తే అది వస్తుగత సత్యం కాక వ్యక్తిగత భ్రాంతి మాత్రమే అవుతుంది. ఆ వ్యక్తిగత భ్రాంతికి చెందిన విషయాన్ని మరో విధంగా సమర్థించ చూడవచ్చు. నలుగురు వ్యక్తులు కాశ్మీర్‌ను సందర్శించి తిరిగి వస్తారు. వారిని అక్కడి విషయాలు చెప్పమన్నప్పుడు వారు నలుగురూ చెప్పిన విషయాలు దేనికదే భిన్నంగా వుంటుంది. నలుగురి వివరణలూ ఒకటిగా వుండవు. ఇదే రీతి మరణించి తిరిగివచ్చిన వారికి కూడ వర్తింపచేస్తే వారు చెప్పింది మాత్రం అసత్యం ఎట్లా అవుతుందీ అని.

ఈ రెంటికీ పైకి పోలికవున్నట్లు కనిపించినా అసలులో పోలిక లేదు. కాశ్మీర్ సందర్శించి వచ్చిన నలుగురు చెప్పిన మాటల్లో భేదం వున్నది కాని ఆ మాటలు తెలిపిన విషయంలో భేదం లేదు. నలుగురు తెలిపిన విషయం ఒకటిగానే వున్నది. కాని మరణించి తిరిగి వచ్చినవారు తెలిపిన విషయంలోనే భేదం వున్నది. ఇక మాటల భేదం ఎందులో అయినా వుండనే వుంటుంది. విషయమే భేదించింది కనుక వారు చెప్పింది వస్తుగత సత్యంకాక వ్యక్తిగత భ్రాంతి అని నమ్మాల్సి వస్తుంది.

మరణానంతర జీవితం, పునర్జన్మ మొదలైనవి వుంటే సంతోషించాల్సిందే . సందేహం లేదు. మరణం, జీవితానికి ఒక అంతంకాక మార్పు మాత్రమే. అయితే ఆహ్లాదమే కాని విచారం కాదు. ఆ విధంగా పునర్జన్మలే వుంటే, వ్యక్తికి తన క్రిందటి జన్మ ఎందుకు గుర్తుండదా అని.

అందుకు సమాధానం ఏమంటే క్రిందటి మూడు రోజుల క్రింద తిన్న కూర గుర్తుండదు, అటువంటప్పుడు ఎన్నో ఏళ్ళ క్రిందట మరణించటానికి పూర్వం వున్న క్రిందటి జన్మ ఏ విధంగా గుర్తుంటుందని. దానికి తోడు మరణం అనే ఒక గొప్ప శారీరక, మానసిక పరివర్తన ఆ జన్మకూ యీ జన్మకూ మధ్య నిలచివున్నదాయె. అటువంటప్పుడు క్రిందటి జన్మ గుర్తుండక పోవటంలో ఆశ్చర్యం ఏముంది అని.

అందరకూ క్రిందటి జన్మ గుర్తుండకపోవటం లేదు. కొందరకు వారి క్రిందటి జన్మలు గుర్తున్న ఉదాహరణలు ప్రపంచం అంతటా లభిస్తూనే వున్నాయి. కాని క్రిందటి జన్మ గుర్తున్నదనే వ్యక్తుల్లో చాలా మోసం రుజువైంది. అందువల్ల ఆ క్రిందటి జన్మను గురించి చెప్పేవారిని నమ్మటానికి వీలులేదు.

వదిమందిలో తొమ్మిదిమంది చెప్పినమాటలు మోసమయి ఒక్కరిమాట నిజమైతే ఆ నిజమైన మాటను

విశ్వసించవచ్చుగా. హిమాలయాలను చూడని పదిమంది హిమాలయాలకు పోతున్నట్లు ప్రకటించి బయలుదేరుతారు. వారిలో తొమ్మిదిమంది హిమాలయాలకు పోకుండా వెనక్కు తిరిగివచ్చి హిమాలయాలను గురించి చెపితే తమ మాటలకూ హిమాలయాలకూ కలవక వాళ్ళది మోసం అని తేలింది.

కాని ఆ ఒక్క మనిషినీ పరీక్ష చేసి చూడగా ఆయన హిమాలయాలకు వెళ్ళివచ్చినట్లు రుజువైంది. పోకుండా తిరిగి వచ్చినవాళ్ళు చెప్పినట్లుగా లేవు హిమాలయాలు. ఆ ఒక్కడు చెప్పినట్లుగా వున్నాయి. అటువంటప్పుడు అతనిది మోసం కాదని తేలుతుందిగా? ఆ ఒక్కడూ హిమాలయాలను చూడటమేకాక వాటి ఫోటోలు కూడా తీసుకు వచ్చాడు. ఆ ఒక్కడూ వెళ్ళివచ్చినట్లు చెప్పిన హిమాలయ స్థలాల్లోకి వెళ్ళి విచారిస్తే ఆయన వచ్చిపోయినట్లు కూడ తెలియజేశారు. కాబట్టి ఆ తొమ్మిదిమందిది మోసం అయినా కూడా ఆ ఒక్కడిది మోసం కాదని తేలుతుంది.

ఇదే పోలికను క్రిందటి జన్మ గురించి తమ జ్ఞాపకాలను తెలిపే వారికి కూడ ఎందుకు వర్తింప చేయకూడదు? ఎందరో మోసం చేసినా ఒక వ్యక్తి అయినా నిజం చెపితే ఆ ఒక్కడి మాటకు విలువ ఇచ్చి పునర్జన్మ వున్నదని ఎందుకు నమ్మకూడదు? ఏమిటో ఇదంతా అయోమయంగా వుంటుంది! డాక్టర్ స్టీవెన్‌సన్ అనే అమెరికన్ పరామనోవైజ్ఞానికుడు ప్రపంచం అంతా పర్యటించి క్రిందటి జన్మ గుర్తున్నదని చెప్పేవారిని గురించి చాలాచాలా సాక్ష్యాలు సేకరించాడు. కాని ఇంతవరకూ ఆయన పునర్జన్మ విషయంలో ఏ నిర్ణయానికీ రాలేకపోతున్నాడు. మరణశయ్య మీది వారందరూ దిగులుతోనే వుండరు. చాలా తక్కువమంది దిగులు చింతలు వదలి సంతృప్తిగా మరణించేవారు కూడా వుంటారు.

దాదాపు వయసుపండిన వారు మరణశయ్య మీద వుంటే వారు ఇతర్లను, అంటే తమ ఆత్మీయులను చూచి అంతగా బాధపడరు, ఆత్మీయులూ మరణాసన్న వ్యక్తిని చూచి బాధపడరు అంతగా. జీవితాన్నంతా సంతృప్తిగా జీవించి పండినవయసులో కన్నుమూస్తున్నాడనే సంతృప్తి ఆత్మీయులకూ జనిస్తుంది. మరణించనున్నవారికీ జనిస్తుంది.

మరణశయ్యమీద కొన్నాళ్లపాటు స్పృహలేకుండా శయనించి వుండే వ్యక్తులుంటారు కూడ. అది ఎంతో హాయి అయిన పని మరణించే వారికి, మరణాన్ని గురించిన విచారం కాని, భయం కాని, ఆత్మీయుల వియోగం కాని వారికి తట్టవు. వారు ఒకరకంగా ప్రాణం వుండి కూడ మరణించిన వారిలో జమ. అటువంటి స్థితిలో వారు ఆత్మీయులను చూచి బాధపడరు కాని ఆత్మీయులు మాత్రం వారిని చూచి బాధపడతారు.

జీవితంలో మరణం చాలా విచిత్ర సంఘటన. ప్రాణం వుండగా నిప్పు చూస్తే భయం వున్న మనిషిని నిప్పుల్లో దహనం చేస్తుంటే ఏమీ బాధపడడు; కాని భస్మం అయిపోతాడు. అదివరలో చీకటి గదిని చూచి భయపడే వ్యక్తిని భూమిలో పాతిపెట్టినప్పుడు ఏ మాత్రం చలించడు. అదివరలో ధనం మీద ఎంతో కాంక్షవున్న వ్యక్తి ప్రాణం పోయిన తరువాత అటువంటి కాంక్షయే వుండదు. చేతన అచేతనంగా మారిపోయినపుడు అంతా తలక్రిందులై పోతుంది.

సృష్టి పుట్టిన దగ్గర నుండీ కూడ ఎవరూ ఇంతవరకు మరణించకుండా వున్నవారు లేరు. మృత్యువును జయించ కలిగిన వ్యక్తి ఇంతవరకు ఎవరూ జనించలేదు. అయితే, ఇంతవరకూ జరగంది ఇకముందు జరగకూడదనేది ఏమీ లేదు. ఆధునిక విజ్ఞానం ఒకనాటికి మృత్యువును కూడ యీ భూమిమీద నుండి తుడిచిపెడుతుందేమో తెలియదు. శరీరంలోని క్షీణించే సెల్సును క్షీణించకుండా చేయకలిగితే మృత్యువు వుండదు. ఇంతవరకూ ఆ పని చేయలేక పోతున్నారు.

మరణం అనేది వుండబట్టే మనిషి జీవితాన్నింతగా ప్రేమించగలుగుతున్నాడు. మరణం లేనినాడు జీవించటంతో విసుగెత్తి జీవితం మీది ప్రీతిని పోగొట్టుకుంటాడేమో. అమరత్వంతో విసిగిపోయి మృత్యువు నిమిత్తం ఆశిస్తే అది లభించదు.

అప్పుడు మనిషి జీవితం చాలా దుఃఖమయం అవుతుంది. జీవించాలంటే ఇష్టం లేదు, మరణించాలంటే మరణం అనేదే లేదు. అటువంటప్పుడు జీవించలేక, మరణించలేక బాధపడటం మాత్రమే చేయకలుగుతాడు.

మరణం లేనప్పుడు వ్యాధులూ, వృద్ధాప్యం, సంతానోత్పత్తి మొదలైనవి కూడ వుండకూడదు. పుట్టిన వాళ్లంతా చావకుండా జీవించి వుంటూ ఇంకా నిత్యం అంతు లేకుండా సంతానం జనిస్తుంటే యీ బ్రహ్మాండ గోళంలోనే ఎక్కడా ఖాళీ వుండదు. మరణం అనేది వున్న యీ రోజుల్లోనే

జనాభా సంఖ్య విపరీతంగా పెరుగుతుంటే మరణమే లేకపోతే ఇంకెంత పెరుగుతుందో వూహించజాలం! మరణం లేనపుడు జననమూ వుండకూడదు. నేటి ప్రజలు ఎంత అభినందనీయులో, కారణం జననాలను లేకుండా చేసుకొంటున్నారు కాని, మరణాలను లేకుండా చేసుకోవటంలేదు. మరణించటం అనేదే లేకపోతే జీవించటమే మరణించటం అవుతుంది. జీవించటం వుండాలంటే, జీవితం మీది ప్రేమ నిలవాలంటే భూమి మీద మరణం బ్రతికి వుండాలి! మరణం, మారణం. మరణం అంటే చావటం, మారణం అంటే చంపటం. నేడు మరణాల సంఖ్య కంటే మారణాల సంఖ్య ఎక్కువ పెరుగుతూంది. తమకు మరణం లేకుండా వుండటానికి, తాము సుఖజీవనం చేయటానికి నేడు మారణహోమం నిరంతరం జ్వలిస్తూనే వుంది. కాని ఆ మారణజ్వాలలు ఇతర్లను దహించే పనిలో స్వయంగా తమను కూడా వదలవు! ప్రక్క ఇంటికి నిప్పు అంటిస్తే తమ ఇల్లు కూడా మిగలదు. మనిషి తాను జీవిస్తూ, ఇతర్లను మరణింప చేయటం మానవతా లక్షణంకాదు. నేడు యీ రెండవదే ఎక్కువ గోచరిస్తుంది. ప్రపంచంలోని అన్ని దేశాల్లో కూడ. అయితే, కొన్ని దేశాల్లో తక్కువ, మరికొన్ని దేశాల్లో ఎక్కువ. మరణశయ్యలు మారణశయ్యలుగా మారటం మానాలి. మరణశయ్య నిజంగా ఒక కరుణశయ్య! జీవితంలో అదివరలోని తన జీవితం ఎన్ని క్రౌర్యాలకో ఆలవాలం అయి వుడవచ్చు. కాని మరణశయ్య మీది జీవితం మాత్రం కారుణ్యానికి ప్రతిబింబం. లోకంలోని మంచితనం అంతా మరణశయ్యను ఆక్రమిస్తుంది. పరమ విరోధులు కూడ మరణశయ్యమీది మనిషిని చూడవస్తారు. కాని వీరిలో కొందరు ఆ మరణించనున్న వ్యక్తి త్వరలో మరణిస్తే బాగుండుననే కోరికతో చూడటానికి రావటం కూడ జరుగుతుంది.

మరణశయ్యను, దుఃఖశయ్యగా, నిస్పృహశయ్యగా, జీవించే మరణించి వున్నవారి శయ్యగా, భయంతో కంపించే శయ్యగా చేసుకొని మరణాసన్నుల మరణశయ్య ఒక ఆనందనికేతనం!

మరణాన్ని గురించి రవీంద్రనాథ్ ఠాకూర్ అంటారు.

*When death comes and whispers to me*
*"Thy days are ended,"*
*Let me say to him, "I have lived in love*
*and not mere in time."*
*He will ask "Will thy songs remain?"*
*I shall say, "I know not, but this I know that*
*often when I sang I found my eternity".*

(మృత్యువు వచ్చి నెమ్మదిగా నాతో "నీ రోజుల ముగిశాయి" అని చెప్పినప్పుడు నేను తనతో అంటాను, "నేను ప్రేమలో జీవించాను కాని కేవలం కాలంలో మాత్రమే కాదు" అని. తాను అడుగుతాడు నన్ను, "నీ గేయాలు మిగిలి వుంటాయా" అని, నేను చెపుతాను, "నేనెరుగను, ఇది మాత్రం నేనెరుగుదును, నేను తరచుగా పాడిలపుడల్లా నా చిరంతనత్వాన్ని కనుగొంటుంటాను.")

కవిని మృత్యువు అడుగుతుంది. నీ రోజులు ముగిశాయి కనుక తనలోకి రమ్మని. కాని కవి తెలివిగా జవాబు చెప్పేడు, తాను కాలంలో మాత్రమే జీవించక ప్రేమలో జీవించానని. దీని అర్థం, తాను జీవించే కాలం అయిపోవచ్చు కాని తాను జీవించే ప్రేమ ఎప్పటికీ అయిపోదని. కనుక తనకు అప్పుడే మృత్యువు రావటానికి వీలులేదని. కాలం అంతమవుందేమో కాని ప్రేమ అంతం కాకుండా అమరంగా నిలచిపోతుందని! మృత్యువు ముందు కాలం తలవంచినా, ప్రేమ తలవంచదని!! మి

**ప్రేమ కవిత**

**ఓ** కవి ఓసారి ఓ ప్రేమ కవిత రాశాడు. అది ఎంతో అద్భుతంగా వుంది. అతను దాని కాపీలు తీసి మిత్రులకి, తెలిసిన వాళ్ళకియిచ్చాడు. వాళ్ళలో స్త్రీలు, పురుషులు వున్నారు. వాళ్ళలో ఒక అందమైన అమ్మాయి వుంది. కొండపైన వుంటుంది. ఆ అమ్మాయిని కవి ఒక్కసారే కలిశాడు. అయినా కవిత యిచ్చాడు... ఒక రోజు ఆ అమ్మాయి దగ్గరి నించీ ఒక దూత వుత్తరం తెచ్చాడు. ఆ వుత్తరంలో ఆ అమ్మాయి 'నిజం చెబుతున్నా, నీ ప్రేమ కవిత నా మనసును తాకింది. పరవశించాను. ఇప్పుడే రా. మా అమ్మని, నాన్నని కలువు. వాళ్ళని ఒప్పించి మనం పెళ్ళి చేసుకుందాం' అని రాసింది... కవి ఆ వుత్తరానికి బదులిస్తూ 'స్నేహితురాలా! ఆ కవిత కవి హృదయంలోని ప్రేమను వ్యక్తపరుస్తోంది. అది అందరు స్త్రీలు, పురుషులూ చదువుకోదగింది' అని రాశాడు...దాని బదులుగా ఆ అమ్మాయి 'మాటల్తో వంచించే అబద్ధాల కోరువి నువ్వు. ఈ రోజు నించి నా తుది శ్వాసదాకా నీ వల్ల కవులందర్నీ నేను అసహ్యించుకుంటూనే వుంటాను' అని రాసింది.

# అట్టమీది బొమ్మలు



**తోట వైకుంఠం:** (ముఖచిత్రం, నాల్గవ అట్ట)

**క**రీంనగర్ జిల్లా బూరుగు పల్లిలో జన్మించారు తోట వైకుంఠం. హైదరాబాద్ లలితకళల కళాశాలలో డిప్లొమా అందుకుని ఆ తరువాత బరోడా లలిత కళాశాలలో ఒకటిన్నర సంవత్సరం చిత్రకళలో పరిశోధనలు జరిపి తిరిగి హైదరాబాద్ చేరుకున్నారు. హైదరాబాద్‌లోని జవహర్ బాలభవన్‌లో చిన్న, చిన్న బుడతలకు చిత్రకళ ఉపాధ్యాయునిగా పనిచేశారు. అప్పట్లో చిత్రకళకు అంత ప్రాముఖ్యం లేదు. చిత్రకళలలో ఎంత ప్రతిభవున్నా ఎంతో మంది చాలీచాలని జీతాలతో డ్రాయింగ్ టీచర్లుగానే ఉన్నారు. అటువంటి క్లిష్ట సమయంలో వీరిని ఆదుకుని ఆశ్రయమిచ్చిన వారు బి.నరసింగరావు.

ఆ తరువాత కాలంలో నరిసింగరావు సాంగత్యంలో ఆర్ట్ సినిమాలయిన *మా భూమి, రంగులకల* చిత్రాలకు కళాదర్శకునిగా పనిచేశారు. ముఖ్యంగా *రంగుల కల* చిత్రం ఒక చిత్రకారుని నేపథ్యంలో నడుస్తుంది. అందులో కథానాయకుడు వేసిన చిత్రాలుగా వైకుంఠం చిత్రాలు చూపబడ్డాయి. సినిమా కలర్ చిత్రం కావటంతో ఆ సినిమా ద్వారా వైకుంఠం వేసిన అనేక చిత్రాలు ఎక్కువ మందిని ఆకర్షించాయి.



ఆ తరువాత కాలంలో ఆయన వేసిన *తెలంగాణ ముత్తయిదువులు* చిత్రం (ముఖచిత్రం) చిత్రకళా ప్రపంచంలో ప్రభంజనం సృష్టించింది. ఎంతకాలంగానో ఆయన ఎదురు చూసిన గుర్తింపుతో పాటు, ఆర్థిక భద్రత కూడా లభించింది. ఆ తరువాత ఆయన వెనకకు తిరిగి చూసింది లేదు. మొదట్లో ఎక్రిలిక్ రంగులతో చేతితో చేసిన కాగితంపై వేసిన ఆయన చిత్రాలు క్రమేపీ కాన్వాస్‌పైకి ఎక్కాయి. ఇప్పటికింకా అత్యధికంగా అభిమానులను కలవాడుగా, అత్యధిక చిత్రాలు అమ్ముడు పోయిన చిత్రకారునిగా ఆయన గణుతికెక్కాడు. ఇప్పట్లో ఆ రికార్డు బ్రేక్ అయ్యే సూచనలు లేవు. (మరిన్ని వివరాల కోసం ***మిసిమి*** జూలై 2006 పత్రిక చూడండి)

**డెలక్రాయిక్స్** (మూడవ అట్ట)

ఫ్రాన్స్ దేశస్థుడయిన డెలక్రాయిక్స్ చిన్నతనం నుంచీ తనదైన కళాసంపత్తిని ప్రదర్శించటంతో ఫ్రాన్స్ ప్రభుత్వ నుంచి యతోధికసాయం పొందుతుండే వాడు. అతని చిత్రాలకోసం ఎందరో ఎదురు చూస్తూండేవారు. చిత్రకళలో నైపుణ్యమే కాదు చిత్రపు కథావస్తువును ఎన్నుకోవటంలో అతను కొత్త పుంతలు తొక్కాడు.

1798లో జన్మించిన డెలక్రాయిక్స్ తన 30వ యేట వేసిన ఈ చిత్రం (మూడవఅట్ట) ఒక చారిత్రక సంఘటనకు సంబంధించినది. ఒకప్పుడు దేదీప్యమానంగా వెలిగిన గ్రీకు దేశం పరతంత్రమయింది. తమ దేశాన్ని 'టర్క్'ల అధీనం నుంచి విడిపించి స్వాతంత్ర్యం సాధించటంకోసం గ్రీకు యువత పోరాటం సలిపారు. ఫలితంగా ఎందరో హతులయ్యారు. మరి కొందరు క్షత గాత్రులయ్యారు. ఈ దారుణాన్ని చూసి చలించిపోయిన డెలక్రాయిక్స్ ఈ చిత్రాన్ని వేశాడు. ఎవరికోసం ఈ మారణకాండ అంటూ ప్రశ్నించుకున్న తన భావానికి మాతృ రూపమిచ్చాడు. 1863లో ఈయన మరణంతో పారిస్‌లో ఎన్నో విన్యాసాలు చేసిన కుంచె చలన రహితమైంది. రంగులు ఇంకి పోయాయి. ఫ్రాన్స్ దేశం చింతాగ్రస్థమయింది. ఈ చిత్రాన్ని చూస్తే మనకి ఈ నాటి పరిస్థితులు కళ్ళకు కట్టినట్లు ప్రతిబింబిస్తున్నాయి కదా. ఏ తల్లి మనసైనా తల్లడిల్లదా? ఇప్పటి ప్రజాస్వామ్యపు ఫలాలు కూడా ఇంతేనా? ఇదేమి నాయ్యం?



# నన్ను ప్రభావితం చేసిన పుస్తకాలు

- దేవరాజు మహారాజు

అసలు మనవెవరం? ఎక్కణ్ణించి వచ్చాం? చనిపోయిన వారంతా ఎటు పోతున్నారు? ఈ విశాల విశ్వానికి అంచు ఉందా? భూమి బంతిలా గుండ్రంగా ఉంటే మరి అడుగు భాగాన ఉన్నవారు పడిపోకుండా భూమిని అంటిపెట్టుకుని ఎలా ఉన్నారు? ఈ కాలమేమిటి? దాన్ని మనం వెనక్కి తిప్పలేమా? ఇలాంటి ప్రశ్నలు నాకే కాదు, చాలామందికి చాలా సార్లు వస్తుంటాయి. వాటికి సమాధానాలు అన్వేషించుకునేవారు మాత్రం చాలా తక్కువ. వీటికి సమాధానాలు తెలుసుకోకపోయినా తమ తమ దైనందిన జీవితం సాఫీగా గడిపేవారు గడిపేస్తుంటారు.

చుట్టూ ఉన్న కుటుంబ జీవితం, సామాజిక జీవితం ఓ దేవుణ్ణి, ఓ దెయ్యాన్ని, కొన్ని సంప్రదాయాల్ని, ఆచారాల్ని, కట్టుబాట్లని, విశ్వాసాల్ని ప్రసాదిస్తుంది కనుక, వాటిలో మునిగి చాలామంది బతికేస్తుంటారు. ఏదో ఓ దేవుణ్ణి నమ్ముకుని, ఏవో కొన్ని పూజలు చేసుకుని నిశ్చింతగా బతికే జనమే ఎక్కువ. దేవుడు లేడా? అయితే మరి అతని స్థానంలో ఎవరున్నారు? ప్రపంచాన్ని నడిపించే శక్తిగా మనం దేన్ని పరిగణిస్తున్నాం? శాస్త్రీయ దృక్పథంతో చూస్తే మానవుడి విశ్వాసాలు ఎంతవరకు నిలబడతాయి? వంటి సంక్లిష్టమైన అంశాల గూర్చి ఆలోచించగల వారు మరీ తక్కువ.

వైజ్ఞానిక సాహిత్య కళారంగాల్లో గుర్తింపు తెచ్చుకున్నవారు, సామాజిక సేవకులు, దార్శనికులు ఏదో ఒక పుస్తకంతో స్ఫూర్తి పొందుతారని నేననుకోను. ఎన్నో పుస్తకాలు, ఎన్నో కళలు, మరెన్నో జీవితాలు, ఎన్నెన్నో పరిస్థితులు మొత్తానికి మొత్తంగా వాటి సారమంతా కలిపి వారి ధ్యేయానికి రూపకల్పన చేసుకుంటారనుకుంటా. నేను వ్యక్తిగా, కవిగా ఎదుగుతున్న తొలి దశలో కొన్ని పుస్తకాలు నన్ను ప్రభావితం చేశాయి. ప్రేరణనిచ్చాయి. ఆ లిస్టుకూడా చాలా పెద్దది. వాటన్నింటి గూర్చి చెప్పే వీలు లేదు. కాబట్టి ఒకటి రెండు పుస్తకాల గూర్చి చెబుతాను.

నేను స్కూల్ విద్యార్థిగా ఉన్నప్పటి నుండే కవితలు, కథలు రాయడం మొదలు పెట్టాను. కాలేజీలో చేరినప్పటి నుండి రచనలు పత్రికల్లో ప్రచురితమౌతున్నాయి. డిగ్రీ విద్యార్థిగా 'భారతి' లో వ్యాసాలు రాశాను. రేడియోకి విరివిగా రాస్తూ కథల పోటీలో బహుమతి కూడా గెల్చుకున్నాను (ఆంధ్రజ్యోతి-పాలు ఎర్రబడ్డియ్).

అందువల్ల చాలా మంది నన్ను బియస్సీ తర్వాత యం.ఏ.లో చేరమన్నారు. భాషమీద, వ్యాకరణం మీద పట్టు సాధిస్తే మంచి కవిత్వం రాయడానికి వీలుంటుందన్నారు. కానీ నేను జీవశాస్త్ర సంబంధమైన అవగాహనే ముఖ్యమనుకుని ఎమ్మెస్సీలో చేరాను. అక్కడ ఛార్లెస్ డార్విన్ జీవ పరిణామ సిద్ధాంతం నాలో ఒక కొత్త ద్వారాన్ని తెరిచింది.

అతి కష్టంమీద 'ఆరిజిన్ ఆఫ్ స్పీసిస్' పుస్తకం సంపాదించి అధ్యయనం చేయడం ప్రారంభించాను. డార్విన్ గొప్పతనమేమంటే ఒక దిశలో నడుస్తున్న ప్రపంచ గమనాన్ని తన ఆలోచనలతో అడ్డుకుని, ఆపి, దాని దిశను మళ్లించగలిగిన మహాశాస్త్రవేత్త! ఒక రకంగా మనిషి ఔన్నత్యాన్ని కీర్తించిన మహానుభావుడు.

ముప్పయ్యేళ్లు ఎమ్మెస్సీ విద్యార్థులకు జీవశాస్త్రం బోధించినా, నాకు ఎప్పటికప్పుడు జీవితానికి అన్వయించుకునే కొత్త విషయాలు డార్విన్ సిద్ధాంతం నుండి లభిస్తూనే ఉన్నాయి. ఏ చదువు చదివినా, ఏ ఉద్యోగంలో ఉన్నా విద్యనభ్యసించిన వారు, మేధావులుగా చలామణి అయ్యేవారు

డాక్టర్ దేవరాజు మహారాజు, ఫోన్ : 9908633949

కూడా హేతుబద్ధంగా ఆలోచించకుండా, మూఢ నమ్మకాలలో పడి కొట్టుకు పోతుంటారు. మరి కొంతకాలం తర్వాత నేను పిహెచ్.డి. కోసం వృక్ష పరాన్న జీవుల మీద పరిశోధన చేస్తున్న దశలో ఒకరోజు పుస్తకాల షాపులో 'స్టీఫెన్ హాకింగ్' రాసిన పుస్తకం 'ఎ బ్రీఫ్ హిస్టరీ ఆఫ్ టైమ్' (కాలం కథ) కనిపించింది. కొని చదువుతూ ఉంటే ఎప్పటినుండో నాలో కొట్టుకుంటున్న అనేకానేక ప్రశ్నలకు ఆ పుస్తకం సమాధానాలీయ గలిగింది. కాలం గురించి, స్థలం గురించి, వాటి మధ్యగల కార్యకారణ సంబంధాల గురించి, వాటికి ఉన్న అనేక పార్శ్వాల గురించి, బిగ్ బ్యాంగ్ నుండి బ్లాక్ హోల్ దాకా ఎన్నెన్నో విషయాలను ఆ పుస్తకం చర్చించింది.

కొంతమంది చెపుతుంటారు కాలమంటే దేవుడే అని, కాలంలోనే దేవుడున్నాడని! కానీ కాలం అనేది ఈ విశ్వాంతరాళానికున్న గుణగణాల్లో ఒకటి కాదా? ఈ విశ్వమే దేవుడు సృష్టించిందని నమ్ముతున్నప్పుడు, దానిలో అంతర్భాగమైన, దాని గుణాల్లో ఒకటైన కాలంలో దేవుడుండడమేమిటి? అనేది ప్రశ్న. సృష్టికర్త తను సృష్టించిన దానికన్నా ఉన్నతుడై ఉంటాడు కానీ, తను సృష్టించిన దానిలోనే అంతర్భాగమై ఉండదుకదా?

'ఎ బ్రీఫ్ హిస్టరీ ఆఫ్ టైమ్' పుస్తకం కొన్ని సవాళ్లను మన ముందు ఉంచుతుంది. ఒక రకంగా అది దేవుడి గురించి చెప్పిన పుస్తకం. మరో రకంగా దేవుడనే శూన్యాన్ని విశ్లేషించిన పుస్తకం. అర్థం చేసుకొని అన్వయించుకునే దాన్ని బట్టి పాఠకుని అవగాహన పెరుగుతుంది. ఏదైనా పనిని మనం అనుకున్నది అనుకున్నట్టుగా చేయలేం. ఏవో కొద్దిపాటి అవకతవకలు తప్పవు. అవి ఎందుకు తప్పవూ ఆంటే అదే 'దైవేచ్ఛ' అని అంటున్నారు. నువ్వు చేయదలుచుకున్న దానికి, దైవాభీష్టానికి కొంత తేడా ఉంటుందంటున్నారు. ఆ తేడాల్ని 'టైమ్ అండ్ స్పేస్' తో పాటు వాటి డైమన్షన్స్ గురించి లోతుగా అధ్యయనం చేయగలిగినప్పుడు సమాధానాలు దొరుకుతాయి.

ఎందరో ఉన్నత స్థాయి సాహితీవేత్తలు మనకున్నారు. వారందరిలో ఒక చిన్నపాటి ప్రత్యేకతను నేను సంతరించుకోగలిగింది. ఎందుకంటే- కేవలం అది నా వైజ్ఞానిక దృక్పథం వల్లనే అని అనుకుంటున్నాను. సాహిత్య-వైజ్ఞానిక రంగాల మధ్య వారధిగా నిలబడగలిగినందుకే అని తలుస్తున్నాను. జీవం గురించి, జీవ పరిణామం గురించి లోతుగా అధ్యయనం చేయగలిగే అవకాశం నాకు వచ్చింది కాబట్టి, ఆ విజ్ఞానం వృథా కాకుండా దాన్ని నా రచనలకు వెన్నెముకగా మలచుకో గలుగుతున్నాను. అందువల్ల నా రచనలు రొటీన్ కంటే కొంత భిన్నంగా ఉంటున్నాయేమో? ఆ అవగాహనే లేకపోతే 'లైఫ్ టానిక్' మూఢ నమ్మకాల్ని వదిలిద్దాం! వంటి నాటికలు, మనిషి కథలు, డాక్యుమెంటరీ స్టోరీస్, 'కాలాన్ని వెనకేసిన మనిషి' వంటి ప్రయోగాత్మక రచనలు చేసి ఉండేవాణ్ణి కాదు. నా కవిత్వం సీరియస్‌గా చదివే పాఠకులు ఒక విషయం గమనించే ఉంటారు. తెలుగు పండితులైన ఇతర కవులు రాసే వాక్యానికి, సైన్స్ నేపథ్యంలోంచి నేను రాసే కవితా చరణాలకీ ఉన్న తేడా.

ఈ విశాల విశ్వాన్ని ఉన్నదున్నట్టుగా దేవుడు సృష్టించాడని నమ్మేవారితో గొడవేలేదు. వారితో చర్చించాల్సింది కూడా ఏమీ లేదు. కానీ పరిణామ క్రమం మీద గౌరవమున్న జిజ్ఞాసువు లెవరైనా జీవపరిణామాన్ని అధ్యయనం చేస్తే, వారు తెలుసుకున్న దాన్ని మనస్ఫూర్తిగా విశ్వసిస్తే వారు హేతువాదులవుతారు. మార్క్సిస్టులవుతారు. స్త్రీ వాదులు, దళిత వాదులు చివరికి మానవతావాదులూ అవుతారు. ఎందుకంటే వాటన్నింటి మూలాలు జీవ పరిణామంలోనే సూక్ష్మంగా నిబిడీకృతమై ఉన్నాయి.

ఎన్ని దశలు దాటి, ఎన్ని బిలియన్ సంవత్సరాల కాలాన్ని దాటి జంతు లక్షణాలు వదులుకుని, ఆదిమానవుడు మనిషయ్యాడన్నది అర్థమయితే... మళ్ళీ ఇప్పుడు మనిషి తిరోగమనంలో జంతు ప్రవర్తన ప్రదర్శించడు కదా?

ఒక్కోకాలంలో ఒక్కోజీవి ఈ భూమ్మీద అధిపత్యం ఎలా చలాయించగలిగిందో తెలుసుకుంటే, కాలానుగుణంగా ఎలా మరుగున పడిందో అర్థం చేసుకుంటే ఇప్పుడు ఆధిపత్యం వహిస్తున్న మనిషి ఇంత క్రూరంగా విర్రవీగడు కదా? తన నాశనానికి తానే కారకుడవ్వడు కదా? ప్రకృతిలో అన్ని జంతు, వృక్ష జాతులకు వాటి వాటి శక్తిని బట్టి, వాటి పరిసరాలను బట్టి సమానావకాశాలు లభించాయని తెలుసుకుంటే మనుషులే మనుషుల్ని అణగదొక్కరు కదా?

ఈ రకంగా ఆలోచించి తెలుసుకోగలిగింది, నేర్చుకోగలిగింది ఎంతైనా ఉంది. పచ్చిమాంసం తినే ఆదిమానవుడు అత్యాధునిక మానవుడిగా ఎలా పరిణామం

చెందాడో పూర్తిగా అవగాహన చేసుకుంటే మరో శక్తి గురించి ఆలోచించే అవసరమే ఉండదు. అంతేకాదు అంధ విశ్వాసాల ఆయుష్షు కూడా తగ్గిపోతుంది.

మన పురాణాల్లో అనేకమైన అద్భుతాలు కనిపిస్తాయి. కేవలం ధ్వనిని బట్టి బాణం వేయగలగడం (శబ్దభేది), తలుపును తాకకుండానే తెరిపించడం, అద్దంలో ప్రపంచాన్ని చూడగలగడం, నీళ్లకోసం దోసిలి పడితే (ఎవరూ పోయకుండానే) నీళ్లు రావడం... వగైరా మనం ఎన్నో జానపద కథల్లో చదివాం. అంటే మనిషి మనసులో ఉన్న కోరికలన్నీ, సాధించాలనుకున్నవన్నీ అలా అలా కథలుగా వేల సంవత్సరాలు తరతరాలుగా చెప్పుకుంటూ వచ్చాడు.

ఇప్పుడు అవన్నీ శాస్త్ర సాంకేతిక రంగాల్లో సాధించిన ఫలితాల వల్ల నిజమే అయ్యాయి. ఇంకా అవుతాయి కూడా! అంటే మనిషి తన ఊహను తాను తాకగలుగుతున్నాడన్నమాట!! అందువల్ల నాకు అనిపించేదేమంటే మనకు వైజ్ఞానిక స్పృహ ఉంటే జీవితమంతా పారదర్శకంగా కళ్లముందు కనిపిస్తుంది. భ్రమలు తొలగిపోయి, ఉజ్వల భవిష్యత్తు కోసం మనం పాటుపడతాం అని! ఇక యువతరానికి ఓ మాట చెప్పాలనిపిస్తోంది. కంప్యూటర్ - ఇంటర్నెట్ సౌకర్యం వచ్చినా అవి పుస్తకాలకు ప్రత్యామ్నాయాలు కావు. పుస్తకం పుస్తకమే! దాని స్థానం దానిదే. దాన్ని నమ్ముకున్న వారు మాత్రమే వారి కాళ్లమీద వారు నిలబడడమే కాదు, వారి కాలంలో వారు తప్పక నిలబడతారు. తక్షణం ఆలోచించాల్సిన విషయం మరొకటి ఉంది. మనిషి భౌతికంగా సజీవుడై ఉంటేనే విలువలు ప్రతిష్ఠించగలిగేది, ప్రేమాభిమానాలు, ఆత్మీయతలు పంచుకోగలిగేది.

మనిషి ప్రకృతిని పరిరక్షించుకో గలిగితేనే, తనను తాను రక్షించుకోగలిగితేనే, తనలోని చెడుపై తిరుగుబాటు చేయగలిగేది. సమాజంలోని చెడుపై ధ్వజమెత్తగలిగేది. అందువల్ల మానవులందరూ అన్ని రకాలుగా 'మనిషి'ని బతికించుకునే ప్రయత్నాలు నిరంతరం చేస్తూనే ఉండాలి. అది తిరుగుబాట్ల ద్వారానే కావచ్చు, కళల ద్వారానే కావచ్చు, సాహిత్యం ద్వారానే కావచ్చు, మరింకో మార్గం ద్వారానే కావచ్చు. కానీ వైజ్ఞానిక దృక్పథం వాటిలో అంతస్సూత్రంగా భాసించాలి. తప్పదు! ఇదీ నా ఆలోచనాధోరణి! మి

---

## నది



కదీషా లోయలో ఒక మహానది ప్రవహిస్తుంది.

రెండు ప్రవాహాలు ఒక దగ్గర కలసుకుని ఒక దాంతో ఒకటి ముచ్చటించుకున్నాయి. మొదటి ప్రవాహం 'మిత్రమా! ఎక్కణ్ణించీ వచ్చావు? నీ మార్గం ఎలా వుంది?' అని అడిగింది.

రెండో ప్రవాహం 'నేను వచ్చిన దారి ఎగుడుదిగుడుగా వుంది. నన్ను తన మొక్కలవేపు వెళ్ళేలా చేసి రైతు చనిపోయాడు. జనం నన్ను తొక్కుతూ బురద చేస్తూ బాధ పెట్టారు. అక్కడి నించీ వచ్చాను' అంది. మరి 'నీ దారి ఎలా వుంది?' అని మొదటి ప్రవాహాన్ని అడిగింది.

మొదటి ప్రవాహం 'నా మార్గం నీ మార్గానికన్నా భిన్నంగా వుంది. నేను పర్వతాలపైనించీ ప్రవహించి వచ్చాను. పూల పరిమళాలు నిండిన గాలికి ఆహ్లాదంగా కదిలే పూలగుండా వచ్చాను. వెండి గిన్నెలతో జనం నా నీళ్ళు ముంచుకుని తాగారు. చిన్న పిల్లలు తమ గులాబీ పాదాల్ని నాలో కదిలించారు. అన్నీ నవ్వులే, అన్ని మధురగానాలే. నీ మార్గం బాధాకరమయినందుకు నాకెంతో బాధగా వుంది' అంది.

అప్పుడు వాటి మాటలు విన్న నది పెద్ద స్వరంతో "రండి! రండి! మనం సముద్రం వేపు పోతున్నాం. రండి, రండి, ఇక మాట్లాడింది చాలు. నాతో వుండండి. మీరు నాలో కలిసి మీ ప్రయాణాలు, మీ బాధలూ, సంతోషాలు అన్నీ మరచిపోండి. రండి! రండి! మన తల్లి సముద్రంలో మనం కలిస్తే మీరూ, నేనూ మన మార్గాలన్నీ మరచిపోతాం" అంది.

39వ పుట తరువాయి..... (కనుపర్తి వరలక్ష్మమ్మ)

అలా మహిళాసభలకు వెళ్ళడం వలన అనేక ప్రాంతాలకు చెందిన విద్యావంతులైన, సంఘసేవానిరతులైన మహిళలతో ఆమెకు పరిచయమయింది. దాన్ని పురస్కరించుకొని గుంటూరులో అయిదవ ఆంధ్రమహిళాసభ జరపడానికి నిశ్చయించింది. ఆ సభనామె చక్కగా నిర్వహించింది. అనేక తాలుకా సభల్లో ఆమె పాల్గొనేది. ఈ అనుభవాన్ని పురస్కరించుకొని రాజారామమోహన్ కాలం నుంచి తన కాలం వరకు జరిగిన మహిళా అభ్యుదయ చరిత్రను 'మహిళా ప్రబోధం' అనే పేరుతో బుర్రకథగా రచించి మన్ననలు పొందారు. మద్రాసు ఆకాశవాణి కేంద్రంలో మొట్టమొదటి సారి "స్త్రీలు-పత్రికా రచన" అనే విషయంపై ఆమె ప్రసంగించారు. నాటినుంచి పదిసంవత్సరాలు వివిధ విషయాలపై మద్రాసు రేడియోలో ఆమె ప్రసంగాలు వెలువడ్డాయి. ఆమె అనేక గోష్ఠులలో పాల్గొనే అవకాశం వచ్చింది. విజయవాడలో రేడియో కేంద్రం నెలకొల్పిన నాటినుండి ఆమె ప్రసంగాలు, నాటికలు వెలువడ్డాయి. జీవనరాగం, రాధపెళ్ళి మొదలైన నాటికలు పలువురి ప్రశంసలు పొందాయి. 'నవభారతేతిహాసం' అనే పురాణాన్ని ఆమె స్వయంగా రేడియోలో వినిపించింది. 1954 నుండి ఆమె వార్ధక్యం వలన ఆకాశవాణి కేంద్రానికి వెళ్ళలేక తన రచనలు పంపగా వారు ప్రసారం చేసేవారు. 1946లో ఆమె హైదరాబాదు వచ్చినపుడు ఆకాశవాణి కోరికపై ఒక ప్రసంగం చేసింది.

1931 లో వరలక్ష్మమ్మ బాపట్లలో మహిళల ప్రోత్సాహంతో "స్త్రీ హితైషిణీ మండలి' అనే సంస్థను స్థాపించింది. బాపట్ల సనాతనులకు ఆటపట్టు, ఎవరూ దీంట్లో సభ్యులుగా వుండాడానికి సాహసించలేదు. వరలక్ష్మమ్మ కొందరి సభ్యుల సహాయంతో దీనిని స్థాపించి కార్యక్రమాలు జరపడానికి నిశ్చయించింది. ఏమాత్రం జంకులేకుండా అనుకొన్న ప్రకారం వారం వారం రామాయణ కాలక్షేపాలు, పత్రికా పఠనం కొనసాగించింది. పిల్లల చేత వినోద ప్రదర్శన లేర్పాటు చేసి ఎంతో ఉత్సాహంగా ఆమె కార్యక్రమాలను నిర్వహించింది. కుట్లు, అల్లికలు, గృహపరిశ్రమలు, యిలా ఎన్నో కార్యక్రమాలు నిర్వహించింది. ఆ సంస్థలో ఎన్నో విజ్ఞాన దాయకమైన కార్యక్రమాలు జరుగుతున్నా మహిళలు ధైర్యంగా వచ్చేవారుకారు. వరలక్ష్మమ్మ కష్టపడి పిల్లలందర్నీ చేర్చినాటికలు, ప్రహసనాలు ప్రదర్శించేది. వారి నుత్సాహపరుస్తూ బహుమతులిచ్చేది. స్త్రీలలో విద్యావిజ్ఞానాలను పెంపొందిచడానికి గ్రంథాలయ మవసరమని భావించి దానికోసం ఆమె ప్రయత్నించింది. వరలక్ష్మమ్మ అన్న రామమూర్తి గుంటూరులో వనితా గ్రంథ మండలి అని స్త్రీలకోసం ఒక గ్రంథాలయం నడిపేవాడు. అది నిలిచిపోగా దానిలోని పుస్తకాలను పంపమని వరలక్ష్మమ్మ కోరగానే వారి తల్లి హనుమాయ్మ పేరున ఆరువందల పుస్తకాలు ఆమె సోదరుడు బహూకరించాడు. తరువాత పత్రికా ప్రకటన ద్వారా చాలా గ్రంథాలు సేకరించి అన్నీ కలిపి గ్రంథాలయం ఏర్పాటు చేసింది. వరలక్ష్మమ్మను చిన్న తనంలో విద్యా విషయకంగా ప్రోత్సాహించిన చోరగుడి సీతమ్మ పట్ల కృతజ్ఞతా భావంతో ఆ గ్రంథాలయానికి 'సీతాపుస్తక సదనం' అని పేరు పెట్టుకుంది. స్త్రీ హితైషిణీ మండలి పక్షాన ఆమె చేయగలిగిన సేవంతా చేసింది. కొంత కాలం, హిందీ, సంగీతం, కుట్టు తరగతులు నడిపింది. స్త్రీలకు ఓటు హక్కురాగానే ఇల్లిల్లు తిరిగి స్త్రీలను ఓటర్లుగా నమోదు చేయించింది. బీహారు భూకంపాలు, బెంగాలు క్షామాలు, ఇంకా ఆంధ్రదేశంలో కరువులు, వరదలు వచ్చినపుడు యథాశక్తి ధనం, వస్త్రాలు మండలి తరఫున సేకరించి పంపించింది. బాపట్లకు ఏ పెద్దలు వచ్చినా వారిచేత ఉపన్యాసాలిప్పించేది. దేశోద్ధారక కాశీనాథుని నాగేశ్వరరావు పంతులుకు, అప్పటి ఆస్థాన కవి శ్రీపాద కృష్ణమూర్తి శాస్త్రికి, కుర్తాలంస్వామికి, తల్లావఝ్ఝల శివశంకరశాస్త్రికి మండలి పక్షాన సన్మాన పత్రాలు సమర్పించారు. 1934 ఫిబ్రవరి 20వ తేదిన సొసైటీల ఆక్టు ప్రకారం మండలి రిజిష్టరు అయింది. జాగర్లమూడి కుప్పుస్వామి చౌదరి గుంటూరు జిల్లా బోర్డు అధ్యక్షులుగా ఉండగా మండలికి భవనం నిర్మించడానికి 20 సెంట్ల భూమి మంజూరు చేశారు. వరలక్ష్మమ్మ తనతోటి స్త్రీలతో కలసి చందాలు వసూలు చేసి ఆ స్థలంలో భవనాన్ని కట్టించారు. 3-9-1942 నాడు 'మండలి' ఆ భవనంలో ప్రవేశించింది. నిస్వార్థ జీవిగా సేవచేసిన వరలక్ష్మమ్మ, ఆమె ప్రబోధాలు, ఆశయాల వల్ల ప్రభావితురాలైన మల్లాది సుబ్బమ్మ నాటి నుంచి నేటిదాకా మహిళాభ్యుదయం కోసం కృషి చేస్తూనేవున్నారు. వరలక్ష్మమ్మకు క్రమంగా వృద్ధాప్యం వచ్చింది. కళ్ళలో శుక్లాలు రాగా సభలకు వెళ్ళడం తగ్గిపోయింది. ఆమె ఇష్టమైన రాముడ్ని నిత్యం పూజించేది. బాపట్లలో తమ స్వగృహంలో 13-8-1978 నాడు శాశ్వతంగా కన్నుమూసింది. తన సాహిత్యం ద్వారా, సమాజ సేవద్వారా చిరస్మరణీయమైన కృషి సలిపి చరితార్థురాలయింది వరలక్ష్మమ్మ.

# వ్యక్తిత్వ వికాసానికి-చిట్కాలు



ఐశ్వర్యము లేకపోయినా
ఐశ్వర్యవంతునివలె ప్రవర్తించవలెను



ఇతరులేమనుకొనెదరో యని
ఎప్పుడును జడియవద్దు



ఎవరి స్నేహమూ చేయవద్దు
వారు పైకమడిగెదరు.



ఎట్టివారినైనను నమ్మవద్దు



అవసరము కలిగిన బ్రతిమాలండి



అవసరము తీరిన తూలనాడండి
లేనిచో ప్రమాదము



మీ పైకము వ్యయము చేయవద్దు



ఇతరుల పైకముపైన ఒక కన్ను
వేసి వుంచండి.



దేవుని దయవలన మీరు ఐశ్వర్య
వంతులయ్యెదరేమో లెండి..

(1933 శ్రీముఖ సంవత్సరాది సంచిక నుండి)

---

**తెలుగులో మొట్ట మొదటి వ్యంగ్య చిత్రకారుడు తలిశెట్టి రామారావుపై ప్రత్యేక వ్యాసం వచ్చేనెల మిసిమి లో....**



# చదవండి...

✦ **ఆమె చెప్పిన కథ:** 250 పేజీలు గల ఈ సంపుటిలో 69 కథలు ఉన్నాయి. విజయబక్ష్‌గారి రచనలలో ఆదర్శమైన ఆధునిక సమాజ దృక్పథం కానవస్తుందని వేరే చెప్పనవసరంలేదు. *వెల: ₹ 80/-*



✦ **ఆకాశంలో సగం మాది :** స్త్రీలకు ఇంతవరకూ పూర్తిగా లభించని హుందాగా జీవించే హక్కు, ఆర్థిక సమానత్వం మొదలైనవానిపై విజయబక్ష్‌గారు వ్రాసిన 40 వ్యాసాల సంపుటి. మహిళాభివృద్ధితోనే దేశాభివృద్ధి ముడివడి వుందనే ఆధునికుల అభిప్రాయము వెనుకనున్న శాస్త్రీయతను వెలికి తీసే ప్రయత్నం ఇందులో కనిపిస్తుంది. *పేజీలు 100, వెల: ₹ 70/-*



✦ **సుకన్య :** రచయిత్రి విజయబక్ష్ మనదేశంలో ప్రేమలు-పెళ్ళిళ్ళ మధ్య నడచే సవాలక్ష ప్రతిబంధకాలను విశ్లేషిస్తూ పెద్దల అర్థం పర్థం లేని కులమత సంప్రదాయాలకు బలయిపోతున్న యువత గురించి వ్రాయబడ్డ, సామాజిక స్పృహ ఉన్న నవల. *పేజీలు 122, వెల: ₹ 60/-*

✦ **సాహిత్య సౌరభం :** తెలుగు జాతి పునర్వికాసానికి తమ జీవితాలను అంకితం చేసిన దీపధారులు, వైతాళికులైన కొందరిపై కుహనా మేధావులు చేస్తున్న దాడిని రచయిత తిప్పికొడుతూ, నేటి తరాన్ని తిరోగమన భావజాలం నుండి బయటపడే ప్రయత్నంలో విజయబక్ష్ వ్రాసిన వ్యాసాలు. *వెల: ₹ 70/-*



పై నాలుగు పుస్తకాలు కావలసినవారు *సెల్‌నెం: 94413 82303 / 94413 29404 ఫోను చేయండి.*

✦ **కవిగానే కన్నుమూస్తా:** కవిత్వాన్ని ప్రేమించి, ఆరాధించి, ఉపాసించిన కె.జనార్ధన మహర్షి "కవిగానే కన్నుమూస్తా, ఇది కలకాదు, కోరికా కాదు. చాటింపుకాదు, హెచ్చరిక కాదు ఇది నా ఆశయం, ధ్యేయం" అంటూ చేసిన కన్ఫెషన్ ఈ కవితా గానం. ఇందులో జీవితం, చావు, ప్రేమ, ద్వేషం, ప్రకృతిఆరాధన, చిలిపితనం మొదలయిన అన్నిరకాల భావాలకూ తనదైన నిర్వచనంయిస్తూ రాసిన కవితలు ఇవి. *వెల: ₹ 90/- పేజీలు : 175 / ప్రతులకు: పాలపిట్ట బుక్స్, ఫోన్ : 9848787284.*




✦ **తెలుగులో మారుపేరు రచయితలు :** రచయితలు కె.పి. అశోక్‌కుమార్, ఎ.ఎ.ఎన్. రాజు. తమ అసలుపేర్లను పక్కకు పెట్టి మారుపేరుతో, లేదా పేర్లతో, కలంపేర్లతో చలామణీ అయిన రెండు వేల మారుపేర్ల వివరాలు ఇందులో పొందుపరచబడ్డియి. కలంపేర్ల వెనుకనున్న కారణాలు, కథాకమామిషులను కూడా రచయిత చర్చించారు. *వెల: ₹ 70/-, పేజీలు : 150 పాలపిట్ట ప్రచురణ, ఫోన్ : 9848787284.*




✦ **దీపాల పిచ్చయ్య శాస్త్రి నెల్లూరు గాలివాన:** 84 సం॥ల క్రితం (1927వ సం॥) నెల్లూరులో వచ్చిన గాలివాన చారిత్రక సంఘటనను అక్షర బద్ధం చేసిన దీపాల పిచ్చయ్య శాస్త్రి గారి అలనాటి రచన. దీనిని ఇంతకాలానికి ఈతకోట సుబ్బారావు చెలంచర్ల భాస్కరరెడ్డి సంకలన కర్తలుగా ఆప్తి వారు ప్రచురించారు. పిచ్చయ్యశాస్త్రిగారు బీభత్సరస ప్రధానంగా రచనసాగించారు. పద్యాలకు తాత్పర్యం కూడా ఇచ్చారు. *ప్రతులకు: 94405 29785/ 94404 728411 నంబర్లలో వెల: ₹ 20/- లకు లభ్యమవుతుంది.*



✦ **ఛానెల్ 18 (నవల) :** చినుకు ప్రచురణలు విజయవాడ రచయిత అమల సోమయాజుల నీలకంఠేశ్వర జగన్నాథశర్మ – 'ఆరణి' 'అనీలజ' అనీ కలం పేర్లతో రచనలు చేశారు – ప్రస్తుత నవల ఎ.ఎన్.జగన్నాథశర్మ పేరుతో ప్రచురితమయింది. వృత్తిరీత్యా పత్రికారచయిత ఒక టి.వీ. నటి జీవితంలోని నిమ్నోన్నతాలను కథాంశంగా తీసుకొని రాసిన నవల. *వెల ₹ 120/-, ఫోన్: 98484 32208.*



✦ **పిట్టల కాలనీ :** "మా వూరి బస్సు ఎదురై మనసు నెక్కించుకొని వెళ్ళిపోయింది". ఇటువంటి 163 హైకూల సంపుటిది. రచయిత రెంటాల శ్రీనివాసరావు. *వెల. ₹ 25/-, ఫోన్: 77991 11456*



✦ **సాహితీ స్రవంతి :** శ్రీరమణ సంపాదకత్వంలో వెలువడ్డ ప్రత్యేక సంచిక వెల: 40/- పేజీలు 125. పత్రికకు పెట్టిన మార్కెట్ విలువ కంటే కొన్ని రెట్లు అదనంగా సారస్వత విలువను తీసుకొని వచ్చి మనలను అలరిస్తుంది. ఇందులో వ్యాసాలు, గేయాలు, కొన్ని జ్ఞాపకాలతో పాటుగా సి.పి. బ్రౌన్ ఎకాడమీ : 'కథకు నీరాజనం' అనే టైటిల్‌తో ఎంపికైన కథలతో నిండుతనం సంతరించుకుంది. ఒక్క పేజీ మాత్రమే ఉన్న 'అబ్రహాం లింకన్, కొడుకు, ఒక టీచర్' అన్న వ్యాసం ఒక చిన్న హైలెట్. ఇది గురువులు, విద్యార్థులు తప్పక మననం చేసుకోవాలి. *ఫోన్ : 040-23423188*



✦ **క్రీడాభిరామం :** రచయిత సి.వెంకటేష్, తెలుగులో క్రీడాజర్నలిజమ్ పై చిన్న చూపు వున్న దశలో తనకు అందివచ్చిన అవకాశాన్ని తీసుకుని ఆ శాఖకు ఒక వింత శోభ, గౌరవం తెచ్చిపెట్టిన సి. వెంకటేష్ చేసిన క్రీడా విశ్లేషణమిది. వ్యాసాలు చిన్నవయినా విషయం మెండుగా ఉంది. *లభించు స్థలం: నవయుగ బుక్‌హౌస్, ఖరీదు : ₹ 90/-, పేజీలు : 175.*

✦ **ఆకాశం:** కవితా సంపుటి. రచయిత బి.వి.వి ప్రసాద్, కవితలలో సున్నితమైన భావావేశం, ఆర్ద్రత, నిజాయితీ పట్ల గౌరవంతో పాటు ఎన్నో మానవీయ విషయాల సమాకరణలు కనిపిస్తాయి. ఈ కవితలో మొత్తం 100 కవితలలో విషయ వైవిధ్యం ఉంది. *వెల: ₹ 70/-, పేజీలు : 140, పాలపిట్ట ప్రచురణ, ఫోన్ : 9848787284.*

(1934 భావ సంవత్సరాది సంచిక నుండి)

ఇప్పటి సినీహీరోలు సినిమాకొక్క లుక్కుకోసం తాపత్రయ పడుతున్నారు. ఈ స్టైల్సు కూడా పనికిరావచ్చు!

చిత్రకారుడు: **తలిశెట్టి రామారావు**



గొఱ్ఱెకొమ్ములు



మేక కొమ్ములు



కోడి జుత్తు



కైలాసము



భావతరంగములు



జలపాతము



కర్ణ కుసుమములు



పెయ్యినాకుడు త్రిమూర్తులు



గంగాయమునలు



రెండు కత్తుల బాకు



డ్రైవరుల పసందు



సముద్రపు కెరటాలు



తేనెపట్టు



పండ్లగంప (లేక) నూనె దండుగ



దొరటోపీ



విధవ గుండు

---

**తెలుగులో మొట్ట మొదటి వ్యంగ్య చిత్రకారుడు తలిశెట్టి రామారావుపై ప్రత్యేక వ్యాసం వచ్చేనెల *మిసిమి* లో....**

ఈ క్రింది పుస్తకాలు మీకు అవసరమయితే మాకు తెలియచేయండి. వాటి విలువకు తపాలా ద్వారా పంపిస్తాం.

**I. మిసిమి ప్రచురణలు**

| | | | ₹ |
|---|---|---|---|
| 1. | బాపు బొమ్మలు | (హార్డ్ బౌండ్) | 200.00 |
| 2. | మహాబౌద్ధ విజ్ఞాన సర్వస్వ నిఘంటువు | *అన్నపరెడ్డి వెంకటేశ్వరరెడ్డి* | 500.00 |
| 3. | బుద్ధుని దీర్ఘ సంభాషణలు | " " | 200.00 |
| 4. | బుద్ధుని మధ్యమ సంభాషణలు-1 | " " | 200.00 |
| 5. | బుద్ధుని మధ్యమ సంభాషణలు-2 | " " | 200.00 |
| 6 | ఆచార్య నాగార్జునుడు | " " | 150.00 |
| 7. | దూర తీరాలలో... | *వల్లభనేని అశ్వినీకుమార్* | 60.00 |
| 8. | అమాహ | " " | 60.00 |
| 9. | అంతర్వీక్షణం | " " | 50.00 |
| 10. | సిద్ధార్థ | " " | 50.00 |
| 11 | నాలో నేను | " " | 30.00 |
| 12. | కథాంజలి-1 | *ఎస్సార్* | 80.00 |
| 13. | కథాంజలి-2 | " " | 110.00 |
| 14. | THE THUNDERCLOUD | S.R.A. | 120.00 |
| 15. | భట్టిప్రోలు కథలు | డా. నక్కా విజయరామరాజు | 150.00 |
| 16. | రెండు దశాబ్దాలు - కథ 1990-2009 | కథా సాహితి | 150.00 |
| 17. | IN QUEST OF UTOPIA | Mrs. Daggubati Purandeswari | 250.00 |
| 18. | గురవాయణం | *డాక్టర్ గురవారెడ్డి* | 150.00 |

**II. వేమన ఫౌండేషన్ ప్రచురణలు**

| | | |
|---|---|---|
| 1. | లోకకవి వేమన - *మరుపూరు కోదండ రామిరెడ్డి* | 100.00 |
| 2. | మన వేమన - *ఆరుద్ర* | 80.00 |
| 3. | వేమన - *నార్ల వెంకటేశ్వరరావు* | 50.00 |
| 4. | VEMANA - *V.R. Narla* | 50.00 |
| 5. | VEMANA - Through Western Eyes. - *V.R. Narla* | 50.00 |
| 6. | విశ్వకవి వేమన - *గుఱ్ఱం వెంకటరెడ్డి, పోచన రామిరెడ్డి* | 100.00 |
| 7. | పురాణ ప్రలాపం *(ప్రొ. హరిమోహన్ ఝా, అనువాదం : జె. లక్ష్మిరెడ్డి)* | 100.00 |
| 8. | THE FIRST POETICAL READER *(Walter Joyes and N.C. Sashacharloo)* | 50.00 |
| 9. | వేమన - *రాళ్ళపల్లి అనంత కృష్ణశర్మ* | 100.00 |
| 10. | వేమన ఉపదేశామృతం - *ఎస్.ఎమ్. సుభాని* | 25.00 |

**III. ధర్మదీపం ఫౌండేషన్ ప్రచురణలు**

| | | |
|---|---|---|
| 1. | మహాపరిత్తం - *బోధ చైతన్య* | 100.00 |
| 2. | జాతక కథలు - *శివశంకర స్వామి* | 60.00 |
| 3. | బౌద్ధ దర్శనమ్ *(రాహుల్ సాంకృత్యాయన్ ; అనువాదం : బి. గోవర్ధన్)* | 70.00 |
| 4. | మహామానవ బుద్ధ *(రాహుల్ సాంకృత్యాయన్ ; అనువాదం : డా. జె. లక్ష్మిరెడ్డి)* | 75.00 |
| 5. | మిళిందపన్హ : ఉపమలు - *బోధ చైతన్య* | 75.00 |
| 6. | బ్రాహ్మణ, బౌద్ధ, హిందూ మతాలు - అన్నపరెడ్డి బుద్ధఘోషుడు | 40.00 |
| 7. | వర్ణవ్యవస్థా లేక మరణ వ్యవస్థా *(భదంత ఆనంద కౌసల్యాయన్; అనువాదం: జె. లక్ష్మి రెడ్డి)* | 50.00 |
| 8. | జయమంగళం - బొర్రా గోవర్ధన్ | 40.00 |
| 9. | బుద్ధుని చివరి రోజులు - ఈమని శివనాగిరెడ్డి | 30.00 |
| 10. | భగవాన్ బుద్ధ *(ధర్మానంద కోశాంబి; అనువాదం: బొర్రా గోవర్ధన్)* | 150.00 |

**IV. ఆర్ట్స్ & లెటర్స్ ప్రచురణలు**

| | | |
|---|---|---|
| 1. | తెలుగా, ఆంధ్రమా? - వాగరి | 40.00 |
| 2. | యతిగీతం- స్వామి వివేకానంద (అనువాదం ; గజ్జెల మల్లారెడ్డి) | 50.00 |



**మిసిమి** మాసపత్రిక

**Kala Jyothi Process Pvt. Ltd.,**

1-1-60/5, R.T.C. 'X' Roads, Musheerabad, Hyderabad - 500 020. Ph. 040-27645536

E-mail : misimi_monthly@yahoo.in ; e-magazine : www.kinige.com/misimi

65408

**మిసిమి** *విజ్ఞాన దాయకం, వినోద ప్రసాదం!*

**మిసిమి** పత్రిక ప్రతినెలా మీ ముంగిట చేరేందుకు మీరు చేయాల్సిన చిన్న పని, ఈ క్రింది వివరాలు మీ సంవత్సర చందా ₹240/- తో పాటు పంపండి. బయటి చెక్కులకు, ఆన్‌లైన్ ట్రాన్స్‌ఫర్‌కు అదనంగా ₹30/- కలపండి.

1. **పేరు :** ........................................

2. **చిరునామా :**

   ఇం.నెం. ........................................

   వీధి ........................................

   పేట ........................................

   ఊరు ........................................

   పిన్ ........................................

   సెల్ ........................................

3. **సంతకం :** ........................................

---

**Our A/c Details for Online Transfer :-**

| | | |
|---|---|---|
| Bank | : | STATE BANK OF INDIA |
| Account | : | MISIMI |
| A/c. No. | : | 10261569316 |
| Branch | : | Saifabad, Hyderabad, INDIA |
| IFS Code | : | **SBIN0007315** |

---

చందాలు మిసిమి పేర ఈ క్రింది చిరునామాకు పంపించగలరు.

**మిసిమి**
మాసపత్రిక

**Kala Jyothi Process Pvt. Ltd.,**
1-1-60/5, R.T.C. 'X' Roads, Musheerabad, Hyderabad - 500 020.
Ph. 040-27645536, E-mail : misimi_monthly@yahoo.in
e-magazine : www.kinige.com/misimi



ఇదేమి న్యాయం?

మనసు ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KRSA102M103 |
| పుస్తకం పేరు | మిసిమి |
| తారీఖు | 23 February 2025 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 85 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | [illegible] |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | Saranya |
| పేజీలు విడదీసినది | SARANYA |
| స్కాన్ చేసినది | Afsar |
| పరీక్ష చేసినది | HEMA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |